# తెలుగులో బాలల నవలలు

( పి. హెచ్‌డి., సిద్ధాంత గ్రంథం )

డా॥ పసుపులేటి ధనలక్ష్మి

మోహనరూప పబ్లికేషన్స్
శ్రీకాళహస్తి — 517 644

సర్వ స్వామ్య సంకలితం
ప్రథమ ముద్రణ డిశంబరు 1986
ప్రతులు — 1000

వెల — 45-00

ప్రతులకు
డా॥ పి. ఐ. లక్ష్మి, యమ్. బి. బి. యస్.,
3/88, కొండమిట్ట వీధి
శ్రీకాళహస్తి — 517 644

ముఖపత్ర చిత్రణ — డా॥ పి. ధనలక్ష్మి

ముద్రణ :—

శ్రీ లక్ష్మి ప్రింటర్స్ & బైండర్స్
పీలేరు — 517 214

# అంకితం

" నల్లనివాడు పద్మనయనంబులవాడు
కృపారసంబుపై జల్లెడువాడు
మౌళిపరి సర్పిత పింఛమువాడు
నవ్వు రాజల్లెడు మోమువాడు ....

సదా నను రక్షించే శ్రీకృష్ణ పరమాత్మకు భక్తితో సమర్పితం

జాలలే విజ్ఞాన హేతువులు
నేడు రేపు మధ్య సేతువులు
చంద్ర బంధుర సుధా శీతువులు
మానవత్వ వికాస హేతువులు ”

శ్రీ శ్రీ

ఆచార్య. జి. నాగయ్య
తెలుగు అధ్యయన శాఖాచార్యులు
శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం.

# శుభాశీస్సులు



ఆధునిక తెలుగు సాహిత్యంలో త్వరితగతిని అభివృద్ధి చెందుతున్న విస్తృతమై వైవిధ్యమున్న ఒకానొక ప్రక్రియ బాలసాహిత్యం. అతి సాధారణంగా కన్పించే అసాధారణ ప్రక్రియ ఇది. ఆధునిక యుగంలో దీని ప్రాపకం ప్రాభవం ఇంతింతన రానిది. ఇందులో బాలల మానసిక వినోద విజ్ఞాన వికాసాలకు తోడ్పడే — గేయాలు, కథాగేయాలు, కథలు, నవలలు, నాటికలు మొదలైన శాఖలెన్నో ఉన్నాయి. సాహిత్య రంగం విద్యారంగంలో బాలసాహిత్య ప్రాముఖ్యాన్ని గుర్తించని దశలోనే ముందు చూపుతో ఆచార్య జి. యన్. రెడ్డి గారు గుర్తించి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు అధ్యయనశాఖలో తెలుగు బాలగేయ సాహిత్య పరిశోధనకు ప్రోత్సహించినారు. మొట్ట మొదటి సారిగా డా॥ యం. దేవకి తెలుగు బాలగేయ సాహిత్యంపై పరిశోధన జరిపి 1979లో పిహెచ్.డి పట్టాన్ని పొందింది. ఆ తర్వాత బాలసాహిత్యంలోని తదితర శాఖలపై కూడా పరిశోధన నా పర్యవేక్షణలో జరగడం నాకు గర్వకారణం.

సుమారు 200 పైగా బాలల నవలలని శ్రమించి సేకరించి దీక్షతో నిశితమైన అనుశీలనా పటిమతో పిహెచ్. డి పట్టానికి ఒక సిద్ధాంత వ్యాసాన్ని రూపొందించి కుమారి పి. ధనలక్ష్మి పట్టాన్ని నా పర్యవేక్షణలోనే పొందింది. ఆ సిద్ధాంతవ్యాసమే ప్రస్తుతం ప్రచురితమైన బాలల నవలలు" అనే ఈ పరిశోధక గ్రంథం. తెలుగులో బాలల నవలలపై గురించిన ప్రత్యేక విమర్శ గ్రంథం ఇంతవరకు ఏదీ వెలువడలేదు. ఇదియే మొదటిది. అపూర్వమైన కృషిని సాగించి కుమారి పి. ధనలక్ష్మి ఈ గ్రంథాన్ని లోకాని కందించి నందుకు ఆమెను మనసారా అభినందిస్తున్నాను.

తెలుగులోని బాలల నవల పుట్టుకను, వికాసాన్ని, ఇతి వృత్త వైవిధ్యాన్ని, నవలలకు ముఖ్యాంశాలైన పాత్ర చిత్రీకరణ, సన్నివేశ కల్పన, సంభాషణలు, శిల్పం, శైలి, భాష సందేశం మొదలైన వాటిని కూడా కుమారి పి. ధనలక్ష్మి ఈ గ్రంథంలో చక్కగా ప్రదర్శించింది. విషయ సేకరణలోనూ, విమర్శనాత్మక పరిశీలనలోనూ, విషయ వ్యక్తీకరణలోనూ ధనలక్ష్మికి గల ప్రావీణ్యం ప్రతి పుటలోనూ ప్రతిబింబిస్తుంది. బాలసాహిత్యంలో లాగే ధనలక్ష్మి భాషాశైలి రచనా విధానం ఇందులో లలితంగా, సుందరంగా ఉన్నాయి. పరిశ్రమ, పరిశోధన పుష్కలంగా ఉన్న ఈగ్రంథం పాఠక లోకాన్ని కూడా ఆకట్టుకొంటుంది.

ఈగ్రంథానికి సముచితమైన గుర్తింపు, ఆదరణ, వ్యాప్తి తప్పక కలుగుతుందని నా నమ్మకం. మునుముందు ఇతర దాక్షిణాత్య భాషా సాహిత్యాల్లో - బాలల నవలలకు సంబంధించిన తులనాత్మక సాహిత్య విమర్శ ప్రధానమైన గ్రంథాన్ని కూడా చిరంజీవి పి. ధనలక్ష్మి రచించాలని ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

తిరుపతి
27-12-86

జి. నాగయ్య

# కృతజ్ఞతాంజలి

నాకు ఈపరిశోధనావకాశాన్ని కల్పించి ప్రోత్సహించిన గురు తుల్యులు ఆచార్య జి. యస్. రెడ్డి గారికి

బాల సాహిత్యానికి సంబంధించిన "తెలుగులో బాలల నవలలు" అనే అంశాన్ని సూచించి నాపరిశోధనా పర్యవేక్షణ భారాన్ని వహించి, నాకు అన్ని విధాల సహకరించి ఈ సిద్ధాంత వ్యాసానికి రూపు రేఖలు దిద్ది ఈ వ్యాసం పుస్తక రూపంలో రావడానికి తోడ్పడిన పూజ్యులు గురువర్యులు ఆచార్య జి. నాగయ్య గారికి

పరిశోధనా కాలంలో అమూల్య సలహాల నిచ్చి ప్రోత్సహించిన తెలుగు శాఖలోని అధ్యాపక బృందానికి

ఈపుస్తక ప్రచురణ విషయంలో సూచన లిచ్చిన సహృదయులు డా॥ కె. సర్వోత్తమన్ గారికి డా॥ పాపిరెడ్డి నరసింహారెడ్డి గారికి

పరిశోధనా కాలంలో నాపరిశోధనాంశానికి సహకరించి ఓపికతో సూచన లిచ్చిన మండా సూర్యనారాయణ గారికి కలువ కొలను సదానంద గారికి మధురాంతకం రాజారాం గారికి

పరిశోధనా కాలంలో నా పరిశోధన సవ్యంగా కొనసాగడానికి బాలల నవలల్ని సేకరించి పంపిన ఏెక్కలి సాహిత్య సాంస్కృతిక సమాజ అధ్యక్షులు రఘు పాత్రుని పద్మనాభరావు గారికి

పరిశోధన కవసరమైన పుస్తకాలను సమకూర్చి యిచ్చిన తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ ఉద్యోగులు చంద్రన్ గారికి షణ్ముగం గారికి ఎస్.వి. బాల మందిర్. తిరుపతి, బాలల గ్రంథాలయం తిరుపతి పి.సి.ఆర్ గవర్నమెంటు కాలేజీ చిత్తూరు, బ్రాంచి లైబ్రరీ టెక్కలి గ్రంథాలయ సిబ్బందికి

ఈపుస్తకం ప్రచురణకు ఆర్థిక సహాయాన్ని అందచేసిన తెలుగు విశ్వ విద్యాలయం హైదరాబాదు వారికి

ఈపుస్తకాన్ని ముద్రించి ఇచ్చిన శ్రీ లక్ష్మీ ప్రింటర్స్—పీలేరు వారికి ముఖపత్రాన్ని ముద్రించిన ఎ. హెచ్. ప్రెస్ వెల్లూరు వారికి

అందరికీ వందనాలు.

డా॥ పి. ధనలక్ష్మి

# ఉపక్రమణిక

గురుతుల్యులు పూజ్యులు ఆచార్య జి. నాగయ్య గారు నా పరిశోధనా పర్యవేక్షణ భారాన్ని వహిస్తూ తెలుగులో బాలల నవలలు అనే అంశం మీద పరిశోధన అనగానే వెంటనే అంగీకరించి, పరిశోధనకు ఉపక్రమించాను. కొంత మంది బాలసాహితీ రచయితల్ని కలుసుకొన్నాను. వాళ్ళు బాలల నవలలు ఇపుడు రావటం లేదని ఇంతకు ముందు వచ్చేవని, ఇప్పుడవి లభ్యం కావని పరిశోధనాంశాన్ని మార్చుకోమని సలహా ఇచ్చారు. చాలా నిరుత్సాహంతో మా గురువు గారిని కలిసాను. పర్యవేక్షకులు, ఆచార్య జి. నాగయ్య గారు నాకెంతో ధైర్యాన్నిచ్చి పరిశోధన కొనసాగించడానికి ప్రోత్సహించినారు బాలల నవలలు కొన్ని సంవత్సరాల క్రితం వెలువడ్డాయని, అవి కూడా దొరకడం చాలా కష్టమని ఆయా రచయితల్ని కలుసుకొంటే ప్రయోజనం ఉంటుందని సూచించినారు. ఎంత కష్టాన్నైనా భరించి బాలల నవలల మీద పరిశోధన జరపాలని ఉత్సాహంతో పరిశోధన ప్రారంభించాను.

మొట్టమొదట పాఠశాలలో ఉపాధ్యాయుడిగా పనిచేస్తున్న బాలల నవలా రచయిత కలువ కొలను సదనంద గారిని కలిసాను. పరిస్థితి ఆయనకు తెలిపాను. బాలలనవలలు దొరకడం చాలా కష్టమని చాలా కష్టమైన అంశాన్ని ఎన్నుకొన్నావని అన్నారు. అయినా ఆయనకు బాలల నవలల మీద పరిశోధన ఎంతో సంతోషాన్ని కలగ చేసింది. బాలసాహిత్యం అంతంత మాత్రంగా వున్న మన దేశంలో, ఇపుడు ఈ పరిశోధన ఎంతో అవసరమని ప్రోత్సహించి ఎన్నో సూచన లిచ్చి తన దగ్గర నున్న బాలల నవలల నిచ్చి ధైర్యాన్ని కలగ చేసినారు. ఆ తరువాత మధురాంతకం రాజారాం గారిని కలిసాను. ఆయన ఎన్నో సూచన లిచ్చి ఆయన వ్రాసిన బాలల నవలలప్రతులు కూడా ఆయన దగ్గర లేనందున చాలా బాధపడుతూ బాల సాహితీ వేత్త, బాలల నవలా రచయిత మండా సూర్య నారాయణ గారి (మ.సూ.న) అడ్రసు ఇస్తూ ఉత్తరం వ్రాయమని ఎంతో ఉపకారం చేశారు. వెంటనే మ.సూ న. గారికి నా పరిశోధనా వివరాలు వ్రాస్తూ ఉత్తరం వ్రాసాను. సహృదయులు మ.సూ న. గారు పరిశోధనకు ఎన్నో ఆధారాలు చూపుతూ ఎన్నో సలహాలతో పాటు ముఖ్యమైన బాలల నవలల జాబితా నిస్తూ ఉత్తరం వ్రాసినారు. బాలల నవలల మీద పరిశోధన చాలా అవసరమని పరిశోధనాంశాన్ని సూచించిన వారికి కృతజ్ఞతలు తెలుపుతూ ఈ పరిశోధనకు తోడ్పడటం తన కెంతో ఆనందంగా ఉంటుందని బాలలకు ప్రత్యేకంగా నవలలున్నాయని అందరికీ తెలియాలని అవి వెలుగులోకి రావాలని, బాల సాహిత్యానికి తాను యథాశక్తి సేవ చేయ కలుగుతున్నందుకు సంతోషిస్తున్నానని వ్రాస్తూ, బాలల నవలా పరిశోధనా విషయంలో

తోడ్పడడానికి అవకాశం కల్పించి నందుకు సంతోషిస్తూ పరిశోధనకు చాలా ముఖ్యమైన బాలల నవలల్ని కూడా పంపినారు. మ సూ.న. గారు పంపిన నవలల్ని చూడగానే నాకెంతో ధైర్యాన్ని ఆయన తెలిపిన విషయాలు నా కెంతో ఆనందాన్ని, ఉత్సాహాన్ని కలుగ చేసినాయి. నా పరిశోధన పూర్తయ్యే వరకు శ్రమ అనుకోకుండా, ఎప్పటి కప్పుడు సలహాల నిస్తూ బాలల నవలల్ని గూర్చి సమాచారాన్ని అందిస్తు నాకు తోడ్ప డడం నా అదృష్టం.

తిరుపతి లోని ఎస్.వి. బాలమందిర్, బాలల గ్రంథాలయం వెతికి కొన్ని నవలలు సేకరించాను. టెక్కలి సాహిత్య సాంస్కృతిక సమాజ అధ్యక్షులు రఘు పాత్రుని పద్మనాభరావు గారు కొన్ని నవలలు సేకరించి పంపినారు. విజయవాడ హైదరాబాదు మద్రాసు, నెల్లూరు. ప్రచురణల నుండి నవలల్ని తెప్పించుకున్నాను. బాలల నవలా రచయితలు కె సభా గారు, కాణిపాకం లింగన్న గార్లు చిత్తూరులో వుండేవారని, వాళ్ళ ఇండ్లకు వెళ్ళి విచారిస్తే ప్రయోజనం ఉంటుందని చిత్తూరుకు వెళ్ళడం జరిగింది. ఆ విధంగా కొన్ని నవలల్ని సేకరించాను చిత్తూరు లోని గ్రంథాలయాలు కూడా చూడాలన్న వుద్దేశంతో పి.సి.ఆర్ గవర్నమెంటు కాలేజి లైబ్రరీకి వెళ్ళడం అక్కడ నాకు చాలా బాలల నవలలు దొరకడం జరిగింది ఎంతో మంది నిరుత్సాహపరచినా, మొట్ట మొదట కొద్ది కాలం వరకూ ఒక్క నవల కూడా దొరక్కపోయినా, అధైర్య పడకుండా బాలల నవలా రచయితల్ని కలుసుకొని కొంత మందితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి, పుస్తకాలు తెప్పించుకొని దాదాపు 200 నవలల్ని సేకరించి పరిశీలించాను.

బాలల నవలలపై పరిశోధనా సమయంలో వ్యయప్రయాసలకు లోనైనా మొట్ట మొదటి సారిగా బాలల నవలల మీద పరిశోధన చేయడం నాకెంతో ఆనందాన్ని కలగ చేసింది. ఈ సిద్ధాంత గ్రంథాన్ని నాలుగు అధ్యాయాలుగా విభజించి నాకు అందుబాటు లో వున్న మూలాధారాలతో పరిశీలించినాను. ఆ మూలాధార రచయితలకు నా కృతజ్ఞతలు. సిద్ధాంత వ్యాస రచనా ప్రణాళిక మొదటి అధ్యాయంలో ఇవ్వబడింది. సహృదయులు ఈ పుస్తకాన్ని ఆదరిస్తారని ఇక మీదనైనా బాలల నవలలు వెలుగులోకి వస్తాయని ఆశిస్తాను

డా॥ పి. ధనలక్ష్మి



# విషయ సూచిక

## 1. తెలుగు బాలసాహిత్య వికాసం



## 2. బాలల నవలా వికాసం



## 3. బాలల నవలలు — వర్గీకరణ

# 4. బాలల నవలలు — వివిధాంశాలు

# 1

# తెలుగు బాలసాహిత్య వికాసం

## 1. 1 బాలసాహిత్య ప్రక్రియ

ఆధునిక తెలుగు సాహిత్యంలో త్వరితగతిని అభివృద్ధిచెందుతున్న ఒకానొక ప్రక్రియ బాలసాహిత్యం. ఇది అతి సాధారణంగా కనిపించే ఒక అసాధారణ ప్రక్రియ. బాలసాహిత్యం, బాలవాఙ్మయం, పిల్లలసాహిత్యం అనే పదాలు మూడు సామాన్య జన వ్యవహారంలో సమానార్థకాలుగానే వాడుతున్నారు. వీటిలో బాలసాహిత్యం పదం బాగాప్రచారాన్ని పొందింది. బాలలకోసం చేసే సరళమైన రచనలు బాలసాహిత్యం. దీన్ని జానపద సాహిత్యంలో ఒక ప్రత్యేక భాగంగా కూడా చెప్పుకోవచ్చు. కాని బాల సాహిత్య సృష్టి ఇటీవలకాలంలో విరివిగా జరుగుతోంది. విదేశీయ ప్రభావం వలన బాలసాహిత్యంలో అనేక ప్రక్రియలు ఆధునిక కాలంలో విస్తరించినాయి. బాల సాహిత్యంలోని కొన్ని ప్రక్రియలు జానపద సాహిత్యానికి సంబంధించినవైనా దీన్ని ప్రత్యేక ప్రక్రియగా చెప్పుకోవచ్చు. జానపదసాహిత్యం, ఆధునిక ప్రక్రియలు కలిసిన ఒక ప్రత్యేక ప్రక్రియగ బాలసాహిత్యాన్ని చెప్పుకోవచ్చు. ఆధునికయుగంలో ఈ బాలసాహిత్యం అత్యంత ప్రాపకాన్ని, ప్రాభవాన్ని సంపాదించుకొంది.

బాలసాహిత్యం చిరకాలంగా ఉన్న ప్రక్రియ. ఇది దేశవ్యాప్తంగా విస్తరిల్లిన సంస్కృతీఫలితంగా విశిష్టమైన రూపురేఖలు దిద్దుకుని దశదిశలా వ్యాపించినది. మన దేశంలో బాలసాహిత్యమంటూ ఇప్పుడిప్పుడే అభివృద్ధిలోనికి వస్తున్నది. బెంగాలి హిందీ మొదలైన భాషలలో రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వం కూడా బాలపత్రికలు ఉండినట్లు తెలుస్తున్నది తెలుగులో మాత్రం బాల పత్రికలు స్వాతంత్ర్యం వచ్చిన తొలి రోజుల్లోనే ప్రారంభమైనాయి.

1.1.1 తెలుగులో బాలసాహిత్యారంభ దశ ; తెలుగులో బాలసాహిత్యం ఎప్పుడు ప్రారంభమైందో చెప్పడం చాలా కష్టం. ఈ బాలవాఙ్మయం లయాత్మకమైన గేయ రూపంగానే ప్రారంభమైందని చెప్పవచ్చు. పూర్వకాలంలో బాలసాహిత్యంలో పిల్లలకు వారివారి వయస్సులననుసరించి పుస్తకాలు లేవు. చాలాకాలం వరకు తెలుగు రచయితలు సాహితీవేత్తలు ఈ విషయాన్ని గురించి పట్టించుకోలేదు. ప్రాచీన కాలంలో అక్షరాభ్యాస కాలంలోనే ఆంధ్రనామసంగ్రహం, శబ్దమంజరి అమరకోశం మొదలైన వాటిని పిల్లలచేత వల్లెవేయించేవారు. సుమతిశతకం కృష్ణశతకం, భాస్కరశతకం నృసింహశతకం, ఇత్యాది కొన్ని శతకాలను, భాగవతంలోని గజేంద్రమోక్షం, కుచేలోపాఖ్యానం, ప్రహల్లాదచరిత్ర, రుక్మిణీకల్యాణం, ధ్రువోపాఖ్యానం, మొదలైన ఘట్టాలలోని పద్యాలను పిల్లలచేత కంఠస్థం చేయించేవారు. ప్రాచీనాంధ్ర కావ్యాల్లో బాల సాహిత్యానికి సంబంధించిన ప్రసక్తి చాలా తక్కువగా ఉండేది. కొడవటిగంటి కుటుంబ రావు గారన్నట్లు "పెద్దల సాహిత్యంలో పిల్లలకు పనికి వచ్చేదంతా పిల్లల సంప్రదాయంగా చెలామణి కావడమే మన సంప్రదాయంగా చెలామణీ అయ్యింది"[1] అసలు బాలలకు ప్రత్యేక సాహిత్యం అవసరమని ఎవరూ గుర్తించలేదు. 'మన తెలుగు గ్రంథకర్తల దృష్టిలో బాలలే లేరు. వారి దృష్టిలో వున్నది ఆత్మపాండిత్య ప్రదర్శ ఒక్కటే"[2] అని చింతాదీక్షితులుగారు పిల్లలకు బాలసాహిత్యం యెంతో అవసరమని ఉద్ఘాటించారు. ఈ విధంగా పూర్వకాలంలో యెవరూ పట్టించుకోని బాలసాహిత్యం ఆధునిక యుగంలో శాఖోపశాఖలుగా విస్తరించింది. ఈ శతాబ్ది ప్రారంభంలో పాశ్చాత్య సంస్కృతీ ప్రభావ కారణంగా ఆధునిక స్కూలు విద్య ప్రవేశ పెట్టబడినది. ఈ పరి

---

1. బాలసాహిత్యం (సాహిత్య ప్రయోజనం) పుట 180
2. బాలవాఙ్మయము (ప్రజావాఙ్మయము) పుట 58

[illegible]మంతో పిల్లలకు పాఠ్య గ్రంథాలు రావడం మొదలైనాయి. ఆంగ్లభాషా ప్రభావంగా తెలుగులో గద్య, పద్య, గేయ రూపంలో ఆధునిక **బాలసాహిత్యం** వెలసింది. బాల సాహిత్యానికి సంబంధించి కొన్ని వ్యాసాలు పత్రికలలో వెలువడినాయి. ఆకాశవాణిలో ప్రత్యేకంగా పిల్లలకార్యక్రమాలు, బాలానంద సంఘాలు వెలసినాయి. పత్రికల పుస్తకాల ప్రచురణ బాగా పెరిగి బాలసాహితీ ప్రగతికి చక్కని అవకాశం లభించింది. బాలలకు ప్రత్యేకంగా ప్రాథమిక విద్య, సాహిత్య వ్యుత్పత్తి పెంపొందించడానికి ఆధునిక కాలంలో అనేక ప్రయత్నాలు చురుకుగా సాగుచున్నాయి.

1. 1. 2 బాలసాహిత్యోద్ధరణ :

ప్రపంచంలోని బాలసాహిత్యాన్ని పరిశీలిస్తే గ్రీకుదేశానికి చెందిన ఈసప్, డెన్మార్క్ దేశానికి చెందిన హాన్స్ ఎండర్సన్, జర్మనీ దేశానికి చెందిన గ్రిమ్ సోదరులు జాకబ్ కార్ల్ గ్రిమ్ విల్ హెల్మ్ గ్రిమ్ ప్రపంచ వ్యాప్తంగా బాలసాహిత్యాభివృద్ధికి తోడ్పడినారు. పందొమ్మిదో శతాబ్ది తరువాత ఎందరో కవి పండితులు బాలసాహిత్యంలో రచనలు చేసినారు. వీరి రచనలు తరువాతి తరానికి ప్రేరణ కలిగించినాయి తెలుగు బాలసాహిత్యంలో నూతన శకారంభకులుగా కందుకూరి వీరేశలింగం పంతులుగారిని, గురుజాడ అప్పారావుగారిని ప్రథములుగా చెప్పుకోవచ్చు మారుతున్న సమాజంలో పిల్లల్ని బాధ్యతాయుతమైన పౌరులుగా తీర్చిదిద్ది, వారిలో నైతికాభివృద్ధిని పెంపొందించడానికి వీరేశలింగం పంతులుగారు బాలలకు „నీతిదీపిక" "నీతికథామంజరి" అనే ఈసప్ నీతికథలు చిన్న చిన్న పద్యాలతో సులభవచనంలో వ్రాసినారు. గురజాడ అప్పారావుగారు బాలలకోసం భాషలో, భావంలో శైలిలో క్రొత్తదనం చూపి, ముత్యాల సరాలతో పిల్లల్ని అలరించినారు. బాలసాహిత్యోద్ధరణకు తోడ్పడిన వారిలో వెంకట పార్వతీశ కవులు, వావిలి కొలను సుబ్బారావుగారు, గజ్జల రామానుజులు నాయుడుగారు మొదలైనవారు పిల్లలకొరకు రచనలుచేసి బాలసాహిత్యాభివృద్ధికి ఎంతో కృషి చేసినారు.

క్రీ. శ. 20వ శతాబ్ది ప్రారంభంలో పాశ్చాత్య దేశాల్లోని బాలసాహిత్యాన్ని పరిశీలించి, ఆధునిక బాలసాహిత్యంలో అనేక ప్రక్రియలు చేపట్టిన వారిలో గిడుగు సీతాపతి, చింతాదీక్షితులు ముఖ్యులు. వీరి కృషి ఫలితంగా పెద్దల సాయం లేకుండానే పిల్లలే చదివి అర్థం చేసుకోగల వివిధ రచనలు తెలుగులో వెలువడినాయి. గిడుగు వేంకట సీతాపతిగారు బాలలకు సులభంగా అర్థమయ్యే రీతిలో పద్యాలు, గేయాలు

కథలు మొదలైన ప్రక్రియలను వ్రాసి ప్రచురించినారు. పాశ్చాత్య భాషల్లో బాలని సాహిత్యంలో పిల్లల్నే ప్రధాన పాత్రలుగా తీసుకొని రచనలు చేయడం ఉంది. చింతా దీక్షితులుగారు కూడా పిల్లల్ని సజీవ పాత్రలుగా తీసుకొని కథలను, నవలలను రచించి నారు. దీక్షితులుగారి "లక్క పిడతలు'' ప్రసిద్ధి చెందిన బాలగేయసంపుటి. తెలుగులో మొట్టమొదటి బాలలకు ఉపకరించేనవలలను రచించి చింతా దీక్షితులు బాలవాఙ్మయ బ్రహ్మగా ప్రసిద్ధిపొందినారు. పిల్లలను గురించి ఒక ప్రత్యేకమైన విప్లవ దృష్టి కలిగించిన వారిలో ప్రముఖుడిగా చలంగారిని చెప్పుకోవచ్చు. చలంగారి "బిడ్డల శిక్షణ" అనే పుస్తకం ప్రతి ఒక్కరూ చదువదగినది. కవికొండల వెంకటరావుగారు, టేకుమళ్ళ కామేశ్వరరావుగారు, నార్ల చిరంజీవిగారు, రేడియో అన్నయ్య, అక్కయ్యలుగా ప్రసిద్ధిచెందిన న్యాయపతి రాఘవరావు, కామేశ్వరిగార్లు, బి. వి. నరసింహరావుగారు, కె. సభాగారు, అలపర్తి వేంకటసుబ్బారావుగారు, ఏడిద కామేశ్వరరావుగారు, సరస్వతి దేవిగారు, మొదలైన వారందరూ బాలల్ని ఉత్తేజపరచే ప్రక్రియల్ని సులభశైలిలో రచించి, తెలుగు బాలలకు అపూర్వమైన సేవ చేసి బాలసాహిత్యోద్ధరణకు మార్గ దర్శకులైనారు. బాలసాహిత్యోద్ధరణకు, బాలసాహిత్య వికాసానికి పిల్లలకు అన్ని రంగాల్లోను మంచి శిక్షణ ఇవ్వడానికి ఎంతో తోడ్పడుతున్నాయి. అన్ని రంగాల్లోను పిల్లలు పాల్గొనే అవకాశాలు కల్పించి వారికి ఉత్తమ అభిరుచుల్ని కలిగించడానికి ఈ సంఘాలు దోహదం చేస్తున్నాయి. ముఖ్యమైన కొన్ని బాలానంద సంఘాలు —

1. గౌతమి బాలవిహార్, నాగార్జున సాగర్
2. కాకతీయ బాలానంద సంఘం, వరంగల్
3. దివిసీమ బాలానంద సంఘం. అవనిగడ్డ కృష్ణా జిల్లా
4. రామాబాలానంద సంఘం, అనకాపల్లి విశాఖ జిల్లా
5. రాయలసీమ బాలానంద సంఘం, గుంతకల్
6. కాళహస్తి శాలాకా బాలానంద సంఘం, శ్రీకాళహస్తి
7. బాలానంద సంఘం, తిరుత్తణి, చిత్తూరు జిల్లా
8. నవరంగ్ చిత్రకళానికేతన్, వెల్లటూరు. గుంటూరు జిల్లా
9. బాలానంద కేంద్రం, గుంటూరు

10 ఇందిరా బాలానంద సంఘం, పార్వతీపురం, విజయనగరం జిల్లా

11 నేతాజీ బాలానంద సంఘం, పోడూరు, పశ్చిమగోదావరి జిల్లా

12 రాజేంద్ర బాలానంద సంఘం, పోలమూరు, „

13 శ్రీరవీంద్ర బాలానంద సంఘం, శాలిబండ, హైదరాబాదు

14 జాంబాన్ బాలానంద సంఘం, జాంబాన్, „

15 ఆంధ్ర బాలానంద సంఘం, నారాయణగూడ „

16 బాలభారతి, విజయవాడ

17 నవీన్ బాలానంద సంఘం చిక్కడపల్లి

18 ఆంధ్ర మహిళా సంఘం బాలవిభాగం, బరంపురం, ఒరిస్సా

19 ఆంధ్ర బాలానంద సంఘం మద్రాసు

20 పాలడుగు బాలానంద సంఘం, గగనమహల్ హైదరాబాదు

21 బాలసాహితీ అకాడమీ సంజీవరెడ్డి నగర్

22 విశ్వశాంతి బాలానంద సంఘం తాడికొండ

23 నెహ్రూ బాలభవన్ అనంతపురం

24 విజయభారతి విజయవాడ

25 బాలానందసంఘం గుంతకల్లు

26 బాల సారస్వత కళాపరిషత్తు విశాఖపట్నం—24

బాలల అకాడమీలు :

ఈ బాలల అకాడమీలు బాలసాహిత్యోద్ధరణకు కృషి చేస్తూ, రచయితలకు ప్రోత్సాహాన్నిస్తూ పిల్లలకు ఆసక్తికలిగించి వారికి ప్రయోజనకరమైనసాహిత్యాన్ని అందించాలని కృషి చేస్తున్నాయి. ఇవి బాలానంద సంఘాల అభివృద్ధికి కూడా తోడ్పడుతున్నాయి. బాలసాహిత్యంలోని ఉత్తమ రచనలకు బహుమతి నిచ్చి ప్రోత్సహిస్తున్నాయి. బాలసాహిత్య రంగంలో రచయితలు, రచయిత్రులు చేసిన

కృషికిమెచ్చి ై 1978లో డా॥ పి. తిరుమలరావుగారికి, పి.వి నరసింహారావుగారికి పాలంకి వెంకటరామచంద్రమూర్తిగారికి, సరస్వతీదేవిగారికీ 'బాలబంధు' బిరుదు ప్రదానం చేసి సత్కరించింది. 1980లో ఏడిద కామేశ్వరరావుగారికి, శ్రీకంఠం క్రిష్ణారావుగారికి, మద్దులూరి రామక్రిష్ణారావుగార్లకు "బాలబంధు" బిరుదు ప్రదానం చేసింది. ఈ బిరుదును బాలసాహిత్యోద్ధారకులైన న్యాయపతి రాఘవరావు. కామేశ్వరిగార్లు తిరస్కరించారు బాలల సంక్షేమానికి అంకితమైన రెండు సంస్థలు ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ జవహర్ బాలభవన్

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ : పిల్లల వ్యక్తిత్వాన్ని వారిలో నిక్షిప్తమై యున్న కళాప్రతిభను వెలికి తీయడానికి, ప్రతిభా వ్యుత్పత్తులను వికసింపజేయడానికి 1976 సెప్టెంబరు 14వ తేదీన నెలకొల్పబడింది. బాలబాలికలకు విషయ ప్రాధాన్యంగల విజ్ఞానాత్మకమైన పుస్తకాలను గత ఏడేళ్ళగా బాలల అకాడమీ ప్రచురిస్తున్నది. గోరు ముద్దలు, గోడమీద బొమ్మ, పసిడి తెర, ఇందిరా ప్రియదర్శిని, ఆంధ్రులకథ, గప్‌చిప్ బాతు బంగారం గుడ్డు, పాలవెన్నెల, గుడి గంటలు, చందమామరావే మొదలైన పుస్తకాలు ప్రచురించింది. పిల్లలకు కమ్మని కథలు, పసందైన పాటలు, విజ్ఞాన విషయాలు చెప్పేందుకు "చిలుక-పలుకులు" అనే మాట్లాడే కాసెట్లను బాలల అకాడమీ రూపొందించింది. ఆంధ్రప్రదేశ్ దర్శిని పేరుతో 90 నిమిషాలు రంగుల చిత్రాన్ని తీసింది బాలలఅకాడమీ. ఈ అకాడమీ ప్రతిఏటా బాలలలోని కళాప్రతిభను వెలికితెచ్చి ప్రోత్సహించడానికి జిల్లా స్థాయి, రాష్ట్రస్థాయిలలో ప్రతిభాపాటవ పోటీలను నిర్వహించి గెలుపొందిన వారికి బహుమతులను, యోగ్యతాపత్రాలను అందజేస్తున్నది.

జవహర్ బాలభవన్ : భవిష్యత్తుకు ప్రతినిధులుగా నిలబడే బాలబాలికలు పరిపూర్ణులుగా రూపొందడానికిగాను వినోద, విజ్ఞానాన్ని అందించేటందుకు ఆంధ్రప్రదేశ్ జవహర్ బాలభవనం 1966వ సంవత్సరం జూన్ 23వ తేదీన ప్రారంభించబడింది. 5 నుంచి 14 ఏళ్ళ వయసుగల బాలబాలికలు ఎవరైనా ఈ జవహర్ బాలభవనంలో సభ్యత్వం తీసుకోవచ్చును. పిల్లలకు సంగీతం, హస్తకళలు, చేతిపనులు ఈత, స్కేటింగ్, హార్మోనియం, సితార తబలా మృదంగం వీణ ఫోటోగ్రఫి విజ్ఞానశాస్త్రం వ్యాయామ విద్య కార్యక్రమాలు నిర్వహిస్తున్నది. జవహర్ బాలభవనం కార్యక్రమాలు జంట నగరాలకే పరిమితం కాలేదు. రాష్ట్రంలోని బాలబాలికలకు ఉపయోగపడే విధంగా అనేక కార్యక్రమాలను చేపట్టి కృషి చేస్తున్నది 1982 సంవత్సరంలో ఈ సంస్థ నాటక ఉత్సవాన్ని నిర్వహించింది. బాలబాలికల మనో వికాసానికి అన్నివిధాలుగా ఆరోగ్యవంతులుగా రూపొందడానికి పిల్లల్లో వికాస

శ్రోతలు వెలుగొందాలని బాలసాహిత్యోద్ధరణకు ఈ సంస్థలు చేస్తున్న కృషి ప్రశంస నీయం.

బాలసాహిత్యంలో అకాడమీ బహుమతులు పొందిన కొన్ని బాలసాహిత్య రచనలు _

భారత కేంద్రప్రభుత్వ బహుమతి పొందినవి :

1. లక్క పిడతలు, చింతాదీక్షితులు, 1955
2. పిల్లల బొమ్మల రామాయణము, మాగంటి బాపినీడు, 1955
3. బొమ్మరిల్లు, కవిరావు 1955
4 బడిగంట, న్యాయపతి రాఘవరావు, 1956
5. బాలానందం, గిడుగు సీతాపతి, 1956
6. నర్తన బాల, నటరాజ రామకృష్ణ, 1957
7. పాలబడి పాటలు, బి. వి. నరసింహారావు. 1958
8. జంతు ప్రపంచం, వారణాసి సుబ్రహ్మణ్యం, 1958
9. చిలకమ్మ చుట్టాయి, ఆవంచ లక్ష్మణరావు, 1959
10. ఆకాశం, విస్సా అప్పారావు, 1960
11. బొమ్మల గౌతమ బుద్ధుడు, వేదుల కామేశ్వరశర్మ, 1960
12. జంతు పురాణం, ఎస్. ఎల్. నరసింహాచారి, 1960
13. పిడల చేతి పనులు, కె. ఎస్. నరసింహాచారి 1961
14. పరమాణు కథ, ఏ. వి. ఎస్. రామారావు, 1961
15. నర్తనసీమ, నటరాజ రామకృష్ణ, 1962
16. అంతరిక్ష విజయం, ఏ. వి. ఎస్. రామారావు. 1962
17 విశ్వ రహస్యం, 1963

18. పగలు — రాత్రి, డి. కన్యాకుమారి, 1964

19. బాలల బొమ్మల నెహ్రూజీ, బి. సూర్యనారాయణ, 1965

20. నర్తన కథ, నటరాజ రామకృష్ణ, 1967

21. స్వతంత్రభారతి, వక్కలంక లక్ష్మీపతిరావు, 1968

22. రంగురంగుల దీపాలు, మిరియాల రామకృష్ణ, 1969

23. బాలప్రపంచం — మండా సూర్యనారాయణ, 1971

24. చంద్రలోక యాత్ర, ఎ. వి యస్ రామారావు 1972

25. గాలిలో ప్రయాణం రెడ్డి రాఘవయ్య 1973

26. ఆకాశాన్ని చూద్దాం ఎ వి యస్ రామారావు 1974

27. బాల విజ్ఞాన కథానిధి ,, 1975

28. మన చుట్టూ ఉన్న వింత మొక్కలు కొత్త శేషాద్రి 1979

29. బంగారు పిలక చింతా దీక్షితులు

30. పక్షి పాటలు సత్తిరాజు కృష్ణారావు

రాష్ట్ర బహుమతి పొందిన పుస్తకాలు ;

1. లక్కపిడతలు చింతా దీక్షితులు 1949

2. బాలవినోద గేయాలు గిడుగు సీతాపతి 1958

3. ముద్దు పాటలు వేజెండ్ల సాంబశివరావు 1959

4. గంగావతరణం ఉత్పల సత్యనారాయణాచార్య 1959

5. ఆంధ్రుల కథ నాయని కృష్ణకుమారి

6. బాలవీరులు ఇల్లిందల సరస్వతీదేవి

7. రవి కథ కోడూరి శ్రీరామమూర్తి

8. పిల్లల నాటికలు, శ్రీమతి పి. సీతారాజ్యలక్ష్మి
9. జంతుపురాణం, గంటుపల్లి రాధాకృష్ణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి బాలసాహిత్యాన్ని ప్రోత్సహించే ఉద్దేశ్యంతో మహిళల రచనలకు పోటీ పెట్టి బహుమతులిచ్చిన పుస్తకాలు —

1. చిట్టిముత్యాలు, గంగరాజు సుశీలాదేవి, 1966
2. గేయకథావళి, జి. రాఘవమ్మ, 1967
3. నేటి విద్యార్థి, యస్. వెంకటరమణ, 1967
4. బాలచంద్రిక, కోడూరి లీలాదేవి
5. మూగిమొగ్గలు, ఎ. లక్ష్మీరమణ, 1968
6. కుంకుమరేఖ, కోడూరి లీలావతి, 1969
7. ప్రకృతి వింతలు, గిడుగు విశాలాక్షి, 1969
8. రాబిన్‌సన్ కూ్రసో.
9. ఆంధ్ర దేశ యాత్ర, కంచి రమాదేవి, 1970
10. యాగ్నికం, శ్రీమతి సీత, 1973

దక్షిణ భాషా పుస్తక సంస్థ, మద్రాసు బహుమతి పొందినవి ;

1. విజ్ఞాన లోకం, వెలగా వేంకటప్పయ్య, 1965
2. బాలాభిరామం, మిరియాల రామకృష్ణ, 1965

ఈ విధంగా తెలుగులో బాలసాహిత్యం ఆధునిక యుగంలో, పాశ్చాత్య ప్రభావం వలన చాలా మంది రచయితల కృషి ఫలితంగా అభివృద్ధిచెంది, వివిధ ప్రక్రియలుగా విస్తరించి ఒక ప్రత్యేక శాఖగా ప్రముఖ స్థానాన్ని ఏర్పరచుకొన్నది.

## 1. 2 బాలసాహిత్య స్వరూప స్వభావాలు :

మనిషి జీవితంలో బాల్యం చాలా ముఖ్యమైన మొట్టమొదటి దశ. ఈ దశలో పిల్లలకు మంచి సాహిత్యాన్ని అందిస్తే వారి భవిష్యత్తు దివ్యంగా ఉంటుంది. పిల్లల ఊహల్ని ఆలోచనల్ని, ఆశయాల్ని సక్రమంగా అర్థం చేసుకొని, మసలాలి. అప్పుడే "నేటి బాలలే రేపటి పౌరులు" అనే నానుడి నిజమవుతుంది. జాతికి వెన్నెల వెలుగులు పట్టవలసిన బాలలకు అనువైన సాహిత్యాన్ని అందించాలి. బాలసాహిత్యం అంటే ఏమిటి? అది ఎలా ఉండాలి? తెలుసుకొందాం.

బాలసాహిత్య బ్రహ్మగా పేరు పొందిన చింతా దీక్షితులుగారు 'శిశువు జన్మించినది మొదలు బాల్యదశ వీడేవరకు కూడా వాని మనసుకు రంజకంగా ఉండేది బాలవాఙ్మయ" [1] మని చెప్పినారు. బాలసాహిత్యం పిల్లల మనస్సులను ఆనందింప చేసేదిగా ఉండాలని వీరి అభిప్రాయం.

"బాలసాహిత్యం అంటే పాఠశాలలకు వెళ్ళిన దశనుంచి యుక్తవయస్సు వచ్చే వరకు చదివే అపారమైన సాహిత్యం [2] అని అమెరికన్ విజ్ఞానసర్వస్వం చెబుతుంది

ఎ. లక్ష్మీరమణ గారు "బాల్యమునుండి పదునాల్గు సంవత్సరముల ప్రాయము వరకు వారి వారి కనువైన సాహిత్యమును బాలసాహిత్యమని చెప్పుకొనదగును, [3] అని చెబుతూ బాలల వయః పరిమితిని కూడా సూచించినారు.

'బాలల ప్రసక్తి ఉన్నదంతా బాలవాఙ్మయమే' నని మరికొందరి అభిప్రాయం

'బాలసాహిత్యం పేర మంత్రాలు, మాయలను, దేవుళ్ళు, దయ్యాలను, అబద్ధపు అద్భుత, భయాకన విషయాలను వ్యాప్తి చేయుట నాకు నచ్చదు. అటువంటి రచనల

---

1. బాలవాఙ్మయము (ప్రజావాఙ్మయము) పుట 58
2. Literature for children (In world book encyclopaedia) Vol· 12
3. బాలసాహిత్యం, మహతి
4. సరస్వతీదేవి ఇల్లిందల, మహతి.

వల్ల పిల్లలకేకాక దేశ భవిష్యత్తుకు కూడా ప్రమాదం కలుగుతుంది. సత్యమైన విష యాలు, చక్కని భావాలు, సరళమైన భాషలో అందించిలేనే అది ఉత్తమమైన బాల సాహిత్యం. అదే ప్రయోజనకరం" [5] అని మలయశ్రీగారు ఉత్తమ బాలసాహిత్యం ఎలా ఉండాలో తన అభిప్రాయాన్ని తెలిపినారు.

పిల్లల్లో సత్ప్రవర్తన కలిగించి నీతిని, నిజాయితీని, పెంపొందించి, పిల్లలను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దగలిగేది నిజమైన బాలసాహిత్యం.

బాల్యం నుండే పిల్లలకు సరైన శాస్త్రీయమైన ఆలోచనాపద్ధతిని అందించాలి ప్రతిక్షణం మార్పులకు గురి అవుతున్న సంఘంలోని సమస్యలను వివిధ కోణాలనుండి అవగాహన చేసుకొని వాటిని క్రమంగా అర్థం చేసుకునే అవకాశాన్ని కల్పించాలి. తమ తల్లిదండ్రులు పట్టెడు మెతుకుల్ని సంపాదించడానికి ఎన్నెన్ని కష్టాలు పడు తున్నారో పిల్లలు తెలుసుకోవాలి. ముఖ్యంగా పిల్లలకు వాస్తవ ప్రపంచంతో పరిచయ ముండాలి. బాలల వ్యక్తిత్వాన్ని పెంపొందించి, వారిలో ప్రేమ, విశ్వాసం, న్యాయం, నిజాయితీ, ఆనందం, ఆత్మవిశ్వాసం, బాధ్యత పెంపొందించేదే ఉత్తమ బాలసాహిత్యం ఇలాంటి సాహిత్యం అందించినప్పుడే పిల్లల్లో మానసిక ఆలోచనలు సక్రమంగా సాగి ఉత్తమ పౌరులవుతారు.

1. 2. 1 బాల్యము — మూడు దశలు ;

బాలసాహిత్య స్వరూపాన్ని నిర్ణయించాలంటే బాలబాలికల వయః పరిమితిని గూర్చి తెలుసుకోవాలి బాలల వయః పరిమితిని గూర్చి మానసిక తత్త్వవేత్తలు, విద్యా వేత్తలు భిన్నాభిప్రాయాలు వెలిబుచ్చినారు. భారత రాజ్యాంగం 14 ఏళ్ళ వయస్సు లోపు వాళ్ళని పిల్లలుగా గుర్తించింది. 1964లో ఢిల్లీలో జరిగిన జాతీయ బాలసాహితీ విద్వత్పరిషత్తు 1—19 సంవత్సరాల వారిని బాలలుగా గుర్తించింది. 1967లో ఢిల్లీలో జరిగిన అఖిల భారత బాలల సాహితీవేత్తల సభలో 1—15 సంవత్సరాల వయస్సు వారిని బాలలుగా నిర్ణయించినారు. బాలల లకాడమీ అంతర్జాతీయ బాలల సంవత్సరంలో 1—14 సంవత్సరాలుగా బాలల వయస్సును నిర్ణయించింది. ఇది సమంజసంగా ఉందని

---

5. మలయశ్రీ బాలసాహిత్యం.

చాలామంది రచయితలు, సాహితీవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

'బాలసాహిత్యం సంగతి వచ్చేసరికి మూడు సంవత్సరాలనుండి పదిహేను సంవ సంవత్సరాలని గ్రహించుట అవసరము [1] అని గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు బాలల వయఃపరిమితి 15 సంవత్సరాలని సూచించినారు.

'బాల్యము నుండి పదునాలుగు సంవత్సరముల ప్రాయము వరకు వారి వారి కనువైన సాహిత్యమును బాలసాహిత్యమని చెప్పుకొనదగును' [2] అని ఎ. లక్ష్మీరమణ గారు 14 సంవత్సరాలని అన్నారు.

బాలల మానసిక వికాసాన్ని బట్టి, వారి ఆలోచనా ధోరణిని బట్టి, వారి మన స్తత్వాన్ని బట్టి వారి వయస్సు నిర్ణయించవచ్చు. పుట్టినప్పటినుండి పదిహేను సంవత్స రాలదాకా బాల్య దశగా చెప్పవచ్చు.

ఈ పదిహేనేండ్ల బాల్యదశలో ఏవయస్సులో ఎలాంటి సాహిత్యం పిల్లలకు అందించాలి అనే విషయాన్ని గూర్చి కొంతమంది చర్చించి బాల్యదశలను మూడు దశ లుగా విభజించి బాలసాహిత్య స్వరూప స్వభావాన్ని వివరించినారు.

1. 2. 1. 1 మొదటి దశ – శ్రవ్య సాహిత్యము :

పిల్లలు పుట్టినప్పటినుండి అయిదు సంవత్సరాలదాకా మొదటిదశగా చెప్పుకోవచ్చు ఈ దశ మరీ చిన్నతనం కాబట్టి పిల్లల జీవితం ఇంటిలోను, ఇంటి పరిసరాలలోను, గడుస్తుంది. ఈ దశలో పిల్లలు శ్రవ్య సాహిత్యమంటే ఇష్టపడతారు. పిల్లలు ఆసక్తి గా వినే చిన్న చిన్న కథలు శ్రవ్య సాహిత్యంలో చేరుతాయి. ఈ శ్రవ్య సాహిత్యం లో ప్రథమంగా గేయాలను తీసుకోవచ్చు. తల్లులు పాడే లాలి, జోల పాటలు ఈ దశ లోని పిల్లలకు అవసరం. తల్లి జోలపాట పాడేటప్పుడు అర్థం తెలియకపోయినా పిల్లల కళ్ళు సంతోషంతో వెలిగిపోతాయి. తల్లిహాయిగా –

---

1. బాలవాఙ్మయం, కిన్నెర. జనవరి 1954
2. బాలసాహిత్యం, మహతి.

"హాయి హాయి ఆపదలుగాయి
చిన్నవాండ్రనుగాయి శ్రీవేంకటేశా"

అని పాడుతుంటే పిల్లలు ఏడ్పుమాని ఆసక్తిగా ఆనందంగా వింటుంటారు. తెలుగుదేశంలోని తొలి బాలసాహిత్యం పాటల రూపంలోనే ఉంది. మొట్టమొ దశలోని ఈ బాలగేయాల సృష్టికి కర్తలు పిల్లలు పిల్లల మనసెరిగిన తల్లులు. తల్లులు తమ పిల్లలకు ఉగ్గుపాలతోపాటు సంగీత సాహిత్యాన్ని కూడ రంగరించి పోసినారన దానికి అనాదిగా వస్తున్న జోల, లాలి పాటలే నిదర్శనం. పిల్లల్ని లాలిస్తూ పాడే పాటలు లాలి పాటలు, నిద్రపోవడానికి జోకొడుతూ పాడేవి జోల పాటలు.

తల్లి తన బిడ్డను రాముడిగ, గోపాలుడిగ ఊహించి పాడుతుంది.

"లాలిరామన్నలాలి – ననుగన్నబాలగోపాల లాలి
లాలి తామర లాలి – నానోములపంట భాగ్యంబ లాలి"

ఈ పాట పాడేటప్పుడు ఆ తల్లి అనుభూతి మాటల కందని మధుర దివ్యానుభూతి. తాళ్లపాక అన్నమయ్య సంకీర్తనల్లోని "జో అచ్యుతానంద జోజో ముకుంద" అనే జోలపాట తెలుగులో ప్రాచీనమైంది, ప్రసిద్ధమైంది.

"జో అచ్యుతానంద జోజోముకుందా
రార పరమానంద రామగోవిందా జోజో
తొలుతబ్రహ్మాండంబు తొట్టె గావించి
నాలుగు వేదాలు గొలుసులమరించి
బలువైన ఫణిరాజు పాన్పు సవరించి"

భారతీయ సంస్కృతి ఉట్టి పడే ఈ లాలి, జోలపాటలు జానపదగేయ సాహిత్యంలో చాలా ప్రసిద్ధి పొందినాయి. పిల్లల ఆరోగ్యం కోసం తల్లి ఉగ్గుపట్టుతూ పా. పాట ఇది –

"ఊఊ ఉంగన్న
ఉగ్గుపాలు ఇందన్న
గంటెడు ఉగ్గు కమ్మన్న
ఉమ్మక కక్కక మింగన్న"

బిడ్డ తాగిన పాలు జీర్ణం కావడానికి తల్లిపాడే పాట ఈ క్రిందిది —

"జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం
గుర్రం తిన్న గుగ్గిళ్ళు జీర్ణమై
ఏనుగు తిన్న వెలక్కాయ జీర్ణమై
భీముడు తిన్న పిండివంటలు జీర్ణమై"

ఇంకా పిల్లల ఆనందానికి తల్లులు 'జాంజి పాటలు' కూడా పాడతారు.

ప్రథమ దశలోని పిల్లలకు తల్లి గోరుముద్దలు తినిపిస్తూ చందమామని చూపుతూ ఇట్లాపాడుతుంది —

చందమామ రావె జాబిల్లి రావె
కొండెక్కి రావె గోగు పూలు తేవె
వెండిగిన్నిలో వేడిబువ్వ తేవె
పైడిగిన్నెలో పాలబువ్వ తేవె
అందాల పాపకి అందించి పోవె

పిల్లలు పుట్టినప్పటి నుండి కొంచెం పెద్దయ్యేవరకు ప్రతిపనిని పాట పాడుతూ చెయ్యడం తల్లులకు సరదా, పిల్లలకు ఆనందం కలుగుతుంది. 1957 లో ఢిల్లీలో జరిగిన బాలసాహిత్య సదస్సు 6_7 నెలల పాపలకు పాటలు వినిపించాలి. 7-14 నెలల పాపలకు రంగు రంగుల బొమ్మల పుస్తకాలు చూపించాలి. 2_3 ఏళ్ళ పాపలకు జంతువుల కథలు చెప్పాలి. 4_5 ఏళ్ళ పాపలు బడికి వెళ్తారు. వారికి కొత్త పరిసరాలతో పరిచయం ఏర్పడుతుంది. చిన్న చిన్న కథలు చెప్పి చదివే అలవాటు చేయించవచ్చు. అని పుట్టినప్పటి నుండి 5 సంవత్సరాల దాకా పిల్లలకు అవసరమైన సాహిత్యాన్ని ఎలా అందించాలో నిర్ణయించింది.

1.2.1.2 రెండవ దశ — దృశ్యసాహిత్యం :

అయిదు సంవత్సరాల నుండి పది సంవత్సరాల దాకా రెండవ బాల్యదశగ చెప్పుకోవచ్చు. నికోలస్ హాల్స్ "పిల్లల పెంపకం" అనే వ్యాసంలో 6 సంవత్సరాల నుండి 12 సం॥ల వరకు పిల్లల బుద్ధివికాసం అత్యంతతీవ్రంగా ఉంటుందని. ఈ దశ

లోని పిల్లలు మానసికంగా, శారీరకంగా శీఘ్రగతిని పెరిగి పోతుంటారని చెప్పినాము. సాధారణంగా ఈ దశలోని పిల్లలు ప్రాథమిక పాఠశాలల్లో చదువుతుంటారు. అంత వరకు ఇంట్లో తలిదండ్రుల వాయిన జీవించిన పిల్లలకు అనేక రకాల మనుష్యులతో నిండిన విశాల ప్రపంచం ఎదురవుతుంది. పిల్లల్లో కొత్త కొత్త ఆలోచనలు, అనుమానాలు బయలుదేరుతాయి. అందుకే ఈ దశలోని పిల్లలకు దృశ్య సాహిత్యం ఎక్కువగా పనికి వస్తుంది. వారికి చిన్న చిన్న కథలు చెప్పడం లేదా చదివించడం చాలా అవసరం. శ్రవ్య సాహిత్యంలో శబ్దం ప్రధానమైతే దృశ్య సాహిత్యంలో బొమ్మలు ప్రధానం. బొమ్మలతో కూడిన దృశ్య సాహిత్యం పిల్లలని బాగా ఆకట్టుకుంటుంది. పిల్లలకు ఉపయోగకరంగా ఉండి, ఆసక్తి, ఆనందం కలిగించే బొమ్మలు పుస్తకాలు తెలుగులో లేవనే చెప్పాలి. పాశ్చాత్య బాలసాహిత్యంలో బొమ్మలతో కూడిన పుస్తకాలు పిల్లలకు ఆసక్తి కలిగించేవి ఎన్నో ఉన్నాయి. పాశ్చాత్యదేశాల్లో ఒక సామెత ఉంది.

> 'If you have a minute to spare, teach your child,
> If you have a cent, educate him'[1]

'నీకు క్షణం తీరిక చిక్కితే నీ బిడ్డకేదైనా బోధించు. నీ చేతిలో ఒక్క కాసుంటే నీ బిడ్డ విద్యకే వెచ్చించు ఈ సామెతను వాళ్ళు అక్షరాల పాటిస్తారు.

ద్వితీయ దశలోని పిల్లలకు నీతి కథలు తప్పని సరిగా బోధించాలి నీతి లేని మనిషి బ్రతుకు నిరర్థకం. నీతులు పిల్లలచేత వల్లె వేయించినంత మాత్రాన అవి వారికి ఒంట బట్టవు. ఆ నీతిని కథల్లో మిళితం చేసి వారికి అందిస్తే అవి పిల్లల మనస్సులో బాగా హత్తుకుంటాయి. ఈ నీతికథలలో మనుష్యులు, జంతువులు పక్షులు కలిసిమెలిసి ఉండటం మాట్లాడుకోవడం పిల్లలకు చాలా ఆనందాన్ని కలిగిస్తుంది.

ఈ నీతికథలు చదవడం వల్ల పిల్లల్లో లౌకిక జ్ఞానం అలవడుతుంది. బాల సాహిత్యంలో యుక్తి కథలకు స్థానం ఉంది. హాస్య, చమత్కారం, యుక్తి పిల్లల నాకర్షిస్తాయి. ధైర్యం, నిజాయితీ, స్నేహభావం, త్యాగబుద్ధి, కార్యదీక్ష చూపగలిగే కథ పిల్లల మెదడులో బలంగా నాటుకుంటాయి. ఐకమత్యమే మహాబలం అనే నీతి

---

1. వెంకట సుబ్బయ్య. గొర్రెపాటి. బాలవాఙ్మయం కిన్నెర జనవరి 1954

పయాపుంచ కథ క, సభాగారి ''ఐకమత్యం'' 'జంతువులు పాత్రలుగా గ నీతికథ. పిల్లలకు నీతిని బోధించే కథలు సుందరమూర్తిగారి 'పేరాశ' "యుక్తికి పైయుక్తి" ఇల్లిందల సరస్వతీదేవి గారి 'అదృష్ట వంతుణ్ణి చెరిపేవారు లేరు.' నీతికథల్లో ప్రసిద్ధి చెందిన పంచతంత్ర కథలు రెండు భాగాలుగా వెలువడినాయి. బాలానంద పంచతంత్రం అనే పేరుగల ఈ కథలకు గ్రంథకర్త పురాణపండరంగనాథ్. హితోపదేశ కథలు ఈసప్ నీతికథలు ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధి పొందినాయి. ఇలాంటి నీతికథల్ని పిల్లలకు బోధించడం వల్ల వారిలో సత్ప్రవర్తన అలవడుతుంది.

ద్వితీయ దశలోని పిల్లలు ఆటలంటే చాలా ఇష్టపడతారు. పిల్లలు మామూలుగా ఆడుకొనే ఆటలు కాళ్ళాగజ్జి, దాగుడు మూతలు, చెమ్మచెక్క మొదలైనవి. పిల్లలంతా కలిసి కాళ్ళా గజ్జి ఆట ఆడుతూ ఉత్సాహంగా ఇట్లా పాడతారు.

"కాళ్ళా గజ్జ కంకాలమ్మా
వేప చెక్కా వెలగమొగ్గ
మొగ్గాకాదు మోదుగ నీరు
నీరుకాధు నిమ్మలవారి
వారి కాదు వాయింట కూర
కూరగాదు కుమ్మరి చట్టి
చట్టిగాదు బాగల మర్రి మట్టా తీసి నీ మొగుడు కాలుమొత్తా"

పై పాటలో కాళ్ళకు గజ్జి వస్తే చేయాల్సిన చికిత్స చెప్పబడింది. ఈ ఆట పాటలలో జాతి సంస్కృతి, సంప్రదాయాలు వెల్లివిరుస్తూ ఉంటాయి.

పిల్లలంతా గుంపుగ కలిసి ఆడే ఆట దాగుడు మూతలు

"దాగుడు మూతా దండాకోర్
పిల్లివచ్చె ఎలుకా దాగె
ఎక్కడి దొంగలక్కడే గప్ చిప్"

ఇంకా పిల్లలు "కోలాటం పాటలు," 'గుజ్జన గూళ్ళు" మొదలైన ఆటలు ఆడుతారు ఆటల వల్ల పిల్లలకు మానసిక ఆనందం కలగడమే కాక వ్యాయామం కూడా కలుగుతుంది.

ఈ దశలోని పిల్లలకు దృశ్య సాహిత్యం ముఖ్యంగా ఉండాలి. నాటికలు, సినిమాలు, టెలివిజన్‌లు మొదలైనవి దృశ్య సాహిత్యం క్రిందికి వస్తాయి, కనపర్తి వరలక్ష్మిగారి యజ్ఞాశ్వము, ఇల్లిందల సరస్వతీదేవిగారి మహావీరుడు, అంతా దేవుని మహిమ, బాలవీరులు. యస్. మునిసుందరం గారి మహాదాత, కోడూరి లీలావతిదేవి గారి తెలుగు రాణి, ఏ. రమేష్ గారి పన్నా రాజభక్తి మధురాంతకంరాజారాం గారి దాను వెలిగించినపాలు మద్దిపట్ల వెంకట్రావుగారి వయసు దొరికాడు, వేడిద కామేశ్వర రావు గారి పౌరాణిక నాటికలు, హాస్య నాటికలు, భమిడిపాటి కామేశ్వర రావు గారి ఇవుడు, మధ్యముడు, శ్రీవాత్సవగారి రాజుగారి రామచిలుక, ఉన్నవ సేతు మాధవరావు గారి సున్నారాయుళ్ళ సంఘం, జె. పూర్ణచంద్రరావు గారి పాలిష్ భయ్యా, కె. సభాగారి పరీక్షాఫలితాలు, ఏటిగట్టున, నండూరి సుబ్బారావు గారి పన్నా, జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి కరుణామయి, బంగారు పద్మం, జి. నారాయణరావు గారి బాలవిజయం, ఎ. రమేష్ గారి, దీక్ష పిళ్ళా సుబ్బారావు గారి ధర్మశీల, అమరజీవి, తగినశిక్ష, యస్. మునిసుందరం గారి కలభాలు జె. పూర్ణచంద్రరావు గారి దొంగ చదువు స్ట్రైక్, విశ్వప్రసాద్ గారి ఎలక్షన్ మేళం, అనపర్తి సీతారామాంజనేయులు గారి పృథ్వీరాజు, నారద సంచారం, చేత వెన్నముద్ద, అంతాఒక్కటే, గంగిరెద్దు ప్రోగ్రెసు కార్డు కర్తవ్యం, కనపర్తి వరలక్ష్మమ్మ గారి పిల్లల నాటికలు, కోడూరి లీలావతిగారి బాలచంద్రిక, న్యాయపతి రాఘవరావు గారి బాల హాస్యనాటికలు, బాల పౌరాణిక నాటికలు, మూడుపెళ్ళిళ్ళు, గమ్మత్తునాటికలు, న్యాయపతి కామేశ్వరిగారి ధ్రువ మార్కండేయ, ప్రహ్లాద ఇద్దరు లలితలు, మందమతి, పరీక్షల హడావిడి, సోమంచి రామంగారి నాయనమ్మ నల్లమందు, యామర్తి గోపాలరావు గారి బడితనికి, సంక్రాంతి పాటి వెంకటరమణ గారి నేటి విద్యార్థి, ఆచార్య ఆత్రేయగారి ప్రగతి వాపలా వాని దీపం, ఎవరు దొంగ, తెన్నేటి సూరిగారి గొల్లకాడ, పిళ్ళా సుబ్బారావు గారి గోపి కోపం, ధర్మశీల, మొదలైనవి పిల్లల నాటికలలో పేర్కొనదగినవి. ఈ నాటికలు చూడడం వలన పిల్లలు సత్ప్రవర్తన అలవరచుకోవడమేగాకుండా, ఆదర్శవంతులైన పౌరులుగా తయారవుతారు. ఈ దశలోని పిల్లలకు సాహసగాథలు, హాస్యపుకథలు. ఆవు–పులి, సింహం–కుందేలు, రెండు పిల్లులు–కోతి రొట్టి ముక్క కథ, ముంగిస–ఉయ్యాలలో పిల్లవాడుకథ. కుందేలు–తాబేలుకథ, నక్క–కొంగ విందుకథ, మొదలైన చిట్టి పొట్టికథలు వీరికి ఆనందోత్సాహాల్ని, విజ్ఞానాన్ని, నీతి కుశలతను పెంపొందిస్తాయి

ఈ కథలు కొన్ని జీవిత సత్యాలను తెలియజేస్తాయి.

1.2.1.3 మూడవదశ – పఠన సాహిత్యం :

పదకొండు సంవత్సరాల నుండి పదిహేను సం ల దాకా బాల్యదశలో 3వ దశగా చెప్పుకోవచ్చు. ఈదశలో పిల్లల మనోప్రవృత్తిలో ప్రత్యేక మైన మార్పులు గోచరిస్తాయి. ఈ మూడవ దశలో పిల్లల్ని పఠన సాహిత్యానికి పరిచయం చేసి ప్రోత్సహించాలి. గొర్రెపాటి వేంకట సుబ్బయ్య గారి అభిప్రాయం. ఇది అందరూ అంగీకరించ వలసిన విషయం. పిల్లలు తమంతతామే చదివి అర్థం చేసుకోగల సాహిత్యం పఠన సాహిత్యం. పఠన సాహిత్యం ప్రధానంగా ఉండాలంటే ఈ దశలోవి పిల్లలకు పుస్తక పరిచయం కలగజేయాలి, పిల్లలకు మానసిక వికాసం కలగాలంటే తప్పనిసరిగా పుస్తక పరిచయం కలగజేయాలి. మనం ఎన్ని సార్లు చెప్పినా, ఎన్ని నీతులు బోధించినా పిల్లల బుర్రకెక్కదు. ఒక కథగాని, మంచి పుస్తకంగాని చదవినప్పుడు ఆ పుస్తకంలో నీతి, ఆ రచయిత బోధించిన మాటలు వాలి మనస్సులో హత్తుకుంటాయి. వింతలు, విడ్డూరాలు, విచిత్రమైన సంఘటనలతో కూడిన అద్భుత సాహిత్యం పిల్లల్ని ఎక్కువ ఆకర్షిస్తుంది. ఈ కథల్లో చింతా దీక్షితులుగారి బంగారు పిలక. ప్రయాగ రామకృష్ణ గారి గలివర్ సాహస యాత్రలు సత్యవోలు రాజశేఖరం గారి అల్లావుద్దీన్ అద్భుత దీపం. కె. రమేష్ గారి మాయ గంట, వంగూరి సుబ్బారావు గారి అరేబియన్ నైట్స్ కథలు, జంధ్యాల సుబ్రమణ్యశాస్త్రిగారి ఆలీబాబా నలుబదిదొంగలు, నందనవనం శ్రీకృష్ణమూర్తి గారి పాతాళలోకంలో, పాలంకి వెంకటామ చంద్రమూర్తిగారి వింత బీరువాలు, దివాకర్ల వెంకటావధానిగారి వింత లాంతరు, యం. యస్. మూర్తి గారి ఇంద్రజాలపు కథలు, నండూరి విఠల్ బాబుగారి విచిత్రద్వీపము, ఉట్ల కొండయ్య గారి తాతా తాటాకు బుట్ట, స్వర్గవనం, దేవబాల, పంచపద్మరాణి, శ్రీ ఆచార్యగారి వందిమాగదులు, వింతపక్షి, సముద్ర కన్య, రాధామణి గారి రాక్షస మంత్రి, మండవ రఘునాద్ గారి మహేంద్ర మణి, లక్ష్మీకాంత మోహనగారి పేదరాసి పెద్దమ్మ కథలు, ఎస్.కె. వెంకటాచార్య గారి సువర్ణకేశిని, సువర్ణసుందరి, సుగుణసుందరి కె పి. బాబుగారి బంగారు భూతం కప్పగంతుల మురళీకృష్ణ గారి అల్లావుదీన్ మాయా లాంతరు ముఖ్యమైన అద్భుత కథలు. కొంత వాస్తవం కొంత కల్పనలతో కూడు కున్న ఈ కథలు పిల్లల్ని ఎక్కువ ఆకర్షిస్తాయి. తెనాలి రామకృష్ణుని కథలు, పరమానందయ్య శిష్యులకథలు, మొగలాయి హాస్యకథలు, షేక్స్పియర్ కథలు,

జమిడిపాటి కామేశ్వరరావు గారి లోకోభిన్నరుచి; మునిమాణిక్యం నరసింహారావుగారి హాస్యకథలుతమాషా కథలు కోట సోదర కవుల హాస్యకథలు యం. యస్. మూర్తిగారి రాజా-మంత్రి శేషయ్యకథలు ఆదిరాజు వీరభద్రరావుగారి నవ్వులు-పువ్వులు మిరాయి చెట్టు' జి వి.జి. కృష్ణగారి వినోద కథలు. రాచమల్లు రామచంద్రారెడ్డిగారి విక్రమార్క విడ్డూరం, వి.వి.యల్. నరసింహారావు గారి పిచ్చి పుల్లయ్య. న్యాయపతి రాఘవరావు గారి పొట్టిబావ-చిట్టిమరదలు లాంటి హాస్యకథలు పిల్లలకు వినోదాన్ని కలిగించడమే కాకుండా మెదడుకు పదును పెడ్తుంది. ఈ కథల్లోని హాస్యం యుక్తి, చమత్కారం పిల్లలను ఆకట్టుకుంటాయి. పిల్లలు సోమరితనానికి అలవాటు పడకుండా వారి నిరంతర వినోద ప్రవృత్తికి ఉపయుక్తమైన ఏదో ఒక పనిలో నిమగ్నం చెయ్యాలి ఆ సమయం వారికి పుస్తక పరిచయం చేస్తే అది అలవాటుగా మారి మంచి విజ్ఞానాన్ని పెంపొందించు కుంటారు.

మూడవ దశలోని పిల్లలు బాగా అర్థం చేసుకొనే శక్తి కలిగి ఉంటారు. అందుకే పిల్లలకు జనమంచి రామకృష్ణగారి విజ్ఞానం చంద్రమండలయాత్ర, ఆరోగ్యమేమహా భాగ్యం. విభావసుగారి బొగ్గుకథ, భూమికథ, నీరుకథ, గాలికథ, మెడిసిన్‌కథ, గిడుగు విశాలాక్షిగారి ప్రకృతిలో వింతలు లాంటి విజ్ఞాన శాస్త్ర విషయాలు, పవనశ్రీ గారి ధృవుడు, భక్త సిరియాళ బలభద్ర పాత్రుని కృష్ణారావు గారి ప్రహ్లాద విజయము దంటు కృష్ణమూర్తి గారి వీరాభిమన్య. కప్పగంతుల కమలాకరరావు గారి భారత వీరులు, ఉప్పల కోటయ్య చౌదరిగారి భక్తాంజలి. సరిపెల్ల విశ్వనాథశాస్త్రి గారి పంచ కన్యలు, కలగర అన్నపూర్ణాదేవి గారి సీతారామము, నాళం అప్పల నరసింహంగారి సీతాదేవి, మునిమాణిక్యం నరసింహరావు గారి బాలకుశలవ చరిత్ర, బాలధ్రువ చరిత్ర, దంటుకృష్ణమూర్తి గారి కురుక్షేత్రము అమృత కవి అన్నపూర్ణదేవిగారి అనసూయదేవి దమయంతి సతీసావిత్రి. శకుంతల. ఉభయశ్రీగారి ప్రవరుడు వల్లమూడి గోపాల కృష్ణగారి కిరీటి, సుదర్శనుడు మొదలైన పౌరాణిక గాథలు అందించాలి. ఇలాంటివి పిల్లల్లో నైతిక విలువల్ని పెంపొందించి. భారతీయ సంప్రదాయాలను తెలియజేస్తాయి.

ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ వాళ్ళు ప్రచురించిన వెలుగు బాటలు జీవిత చరిత్రలు జయశ్రీ పబ్లిక్‌గారి రామకృష్ణ పరమహంస మహాత్మాగాంధి మహాకవి గురజాడ బాలగంగాధర తిలక్ పవనశ్రీ గారి భగత్‌సింగ్. ఉభయభాషా ప్రవీణ బులుసు వేంకట రమణయ్య గారి లాల్‌బహదూర్ శాస్త్రి రవీంద్రనాథ టాగూర్

శ్రీ ఆచంట సత్యనారాయణ గారి మార్కోపోలో. జోసఫ్ ప్రీస్లీ రైట్ సోదరులు జేమ్స్‌వాట్ మొదలైన మహాపురుషుల జీవిత గాథలు పరిచయం కలిగించడం చాల అవసరం. అనుకరణ ప్రవృత్తి గల ఈ దశలోని పిల్లలకు మహనీయుల జీవిత చరిత్రలు వారి జీవితగమనానికి తోడ్పడతాయి.

మూడవ దశలోని పిల్లలకు చారిత్రక కథలు పరిచయం చెయ్యాలి. కోట సోదర కవుల పురుషోత్తముడు ఉభయభాషా ప్రవీణ బులుసు వేంకటరమణయ్య గారి రాణా ప్రతాపసింహుడు ఆంధ్ర భోజుడు గౌతమబుద్ధుడు జయశ్రీ మల్లిక్ గారి బాలచంద్రుడు తిమ్మరుసు రాణీరుద్రమ శివాజి కృష్ణరాయలు అక్బరు చాణక్య చంద్రగుప్త మహావాది వేంకటరత్నము గారి పల్నాటి కథలు ఉపాల పిచ్చయ్య శాస్త్రిగారి దేశభక్తి వారణాసి గంగాధరశాస్త్రిగారి స్వయం ప్రతిష్ఠ పుట్టపర్తి నారాయణాచార్యులు గారి వాద విజయము విజయాంధ్రులు బిరుదురాజు గారి దేశింగురాజు కథ సర్వాయి పాపడు బొబ్బిలి రాజు దువ్వూరి శేషగిరిరావు గారి పిల్లల చారిత్రక వీరగాథలు శ్రీనివాస సోదరులు గారి తెలుగు వెలుగు యామిజాలపద్మనాభ స్వామిగారి శ్రీకృష్ణ దేవరాయలు రత్నాకరం అనంతాచార్యులు గారి కళింగ దేశకథలు తల్లావజ్ఝల కృత్తివాస తీర్థులుగారి నాయకురాలు కోట సోదర కవుల విశ్వనాథ నాయకుడు మొదలైన చారిత్రక గాథలు పిల్లల్ని ఆదర్శ పౌరులుగా తీర్చిదిద్దడానికెంతో తోడ్పడతాయి. ఇంకా ఇల్లిందల సరస్వతీదేవి గారి పండుగ బహుమానము ముద్దులూరు రామకృష్ణగారి ముద్దుబిడ్డలు నాన్నకోసం విద్వాన్ విశ్వంగారి చందమామ చెప్పినకథ సత్తు సిపాయి రావూరి భరద్వాజ గారి పితృ హృదయం చింతా దీక్షితులు గారి ఎన్నో చేస్తాను సూరి-సీతి-వెంకి విద్వాన్ దేవరకొండ చిన్ని కృష్ణశర్మగారి గోకర్ణయ్య గొడుగు ఓగడ తరగలు పాలకాయలు పసిడిపలుకులు పాలంకి వెంకట్రామ చంద్రమూర్తి గారి పండుగ బట్టలు దొంగలున్నారు జాగ్రత్త నార్ల చిరంజీవిగారి కర్ర చెప్పులు నీతికథానిధి మామ కథలు నండూరి విఠల్ బాబుగారి అదృష్టవంతుడు చిత్రమైన శిల్పము రావూరి భరద్వాజ గారి తెలివైన దొంగ ఆర్. లక్ష్మీ కాంతమ్మ గారి ఎందరో మహానుభావులు భల్లం సోమలింగేశ్వరరాజుగారి ముగ్గురు బాలురు ఉత్తమ విద్యార్థి లాంటి బాలసాహిత్యంలో విశేష ప్రచారాన్ని పొందిన కథల్ని పిల్లలకు పరిచయం చెయ్యాలి.

మూడవ దశలోని పిల్లలచేత నీతి శతకాలు వేమన పద్యాలు వల్లె వేయించాలి ఇందువల్ల పిల్లల్లో సమత మానవతా భావాలు పెంపొందుతాయి. పిల్లలు పాడుకోవ

దానికి అనువుగా, సులభంగా ఉండే దేశభక్తి గేయాలు పిల్లలకు నేర్పించాలి.
గురజాడ అప్పారావుగారి—

దేశమును ప్రేమించుమన్నా
మంచి యన్నది పెంచుమన్నా
దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుషులోయ్

లాంటి గేయాలు.పిల్లల్లో దేశభక్తిని కలిగిస్తాయి. తెలుగు సంస్కృతితో బాటు,జాతిపట్ల స్ఫూర్తిని కలిగించే రాయప్రోలు సుబ్బారావుగారి గేయం ప్రతి ఒక్కరూ నేర్చుకోదగ్గది

"ఏదేశమేగినా ఎందుకాలిడినా
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనినా
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండు గౌరవం

జననీ జన్మభూమిశ్చ, స్వర్గాదపి గరీయసీ అనే సూత్రాన్ని పిల్లలకి బోధించాలి. శంకరంబాడి సుందరాచారిగారు రచించిన ఈక్రింది తెలుగుతల్లి ప్రార్ధనాగీతం పిల్లలచే పాడించాలి

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరిలించు మాతల్లి

బాలలే చదివి అర్ధం చేసుకోగల పఠనీయ నాటికలు ఈ దశలోని పిల్లలకు అందించాలి కేవలం చదివి ఆనందించే పఠనీయ నాటికలే గాక శ్రవ్యనాటికలైనా రేడియో నాటికలు దృశ్య ప్రధానాలైన రంగస్థల నాటికలు, టెలివిజన్ నాటికలు వెలువడ్డాయి. శ్రవ్యనాటికలైన రేడియో నాటికలు వినడం వల్ల పిల్లల్లో భావనాశక్తి, ఆలోచనాశక్తి, ఉచ్చారణ దక్షత ఏర్పడతాయి. దృశ్యనాటికలు పిల్లల కాలక్షేపానికే గాక, బుద్ధి వికాసానికి, మానసికానందానికి తోడ్పడుతాయి.

తృతీయ దశలోని పిల్లలకు విజ్ఞాన యాత్రలు చాలా అవసరం. ఇవి పిల్లల్లో మానసిక వికాసాన్ని కలుగచేస్తాయి. మూడవ దశలోని పిల్లలు ఆలోచనాశక్తి, కల్పనా శక్తి కలిగి ఉంటారు. బాలలే చదివి అర్థం చేసుకోగల సులభ శైలి ఉదాత్తమైన సన్నివేశాలు, తెలివైన సంభాషణలు గల నవలలు మూడవదశలోని పిల్లలకు అందించాలి. ఈ దశలోని పిల్లలకు ఆసక్తి అనుకరణ ఉండటం సహజం అందుకే రావి ఎస్. అవధాని గారి మహావీరుడు కర్ణుడు, ఉభయభాషా ప్రవీణ శ్రీ ఓష్లా లక్ష్మీకాంతశాస్త్రి గారి బ్రహ్మపుత్ర గౌతమి శీతం రాజుగారి బాల్య స్నేహితులు పాలంకి వెంకటరామచంద్ర మూర్తిగారి బంగారు తల్లి చిలుకప్ప వావిలాల సోమయాజులుగారి నాలంద కలువ కొలనుసదానంద గారి బంగారు నడిచిన బాట నార్ల చిరంజీవి గారి పేను—పెసరచేను మందార బాల వీధిగాయకుడు కె. సభాగారి చంద్రం సూర్యం కవి—గాయకుడు పసి హృదయాలు బడిపంతులు గీతాసుబ్బారావు గారి పారిపోయిన బకాణి పూల మనసులు కోడూరి లీలావతి దేవి గారి ఆశాకిరణం ఎ. ఎస్ మణి (అరవింద)గారి ప్రేమమంత్రం కంచి రమాదేవి గారి అంతంలో అనంతం మండా సూర్యనారాయణ గారి మనోరమ రత్నబాల ఉన్మాదిగారి ఉన్మాదిని బద్దెపూడి రాధాకృష్ణమూర్తిగారి వసంతము కొమ్మూరి వేణుగోపాలరావు గారి పిల్లదొంగ రవిగారి సాహసి గోపి చాపరాల సరళాతిలక్ గారి చిన్నారి మనసులు రావి కొండలరావు గారి దాసు చింతాదీక్షితులు గారి గోపీమోహిని లీలాసుందరి శంపాలత కాణిపాకం లింగన్న గారి శాంతి చక్రం ఆలూరి భుజంగరావు గారి కుక్క ఆత్మకథ ముద్దం శెట్టి హనుమంతరావు గారి వాసుచదువు కనకమేడల వెంకటేశ్వరరావు గారి అన్నదమ్ములు ఆర్.ఆర్. ఉప్పుటూరిగారి నెహ్రూక్లబ్బు సి. కనకాంబరరాజు గారి చింటూ తెచ్చిన తంటా అంతటి నరసింహం గారి కోటవీరన్న సాహసం మంత్రాల రామన్న మొండితనం ఉదయగిరి పోలన్న ధైర్యం కవిగారి బాల్యం తంగెళ్ళ పాండురంగ శర్మ గారి గులాబి బాలలు మిక్కిలి సుందర రావు గారి మంచి స్నేహితులు జయశ్రీ మల్లిక్ గారి సాహస యాత్ర మల్లాది అవధానిగారి పారిపోయిన పిల్లవాడు పాతూరి ప్రసన్నం గారి సుఖీభవ యమ్. ఫిరోజెమగారి ఉడుతా ఉడుతా హూత్ శ్రీపతి ధనం గారి అమ్మే కావాలి యుగంధర్ గారి టింకూ—సాహసాలు టింకూ—బుడిగి నక్కజిత్తులు—కుందేలు ఎత్తులు పిలకా గణపతి శాస్త్రి గారి అశోక వర్ధనుడు దేవరకొండ చిన్ని కృష్ణశర్మ వాసంతిక శ్రీవాత్సవగారి జల్తారు జాబిలి నోరి నరసింహశాస్త్రి గారి కర్పూర ద్వీప యాత్ర చక్రపాణిగారి విచిత్ర కవలలు రావూరి భరద్వాజగారి రతనాల లోయ కె. రాజేశ్వర రావుగారి చిట్టిరాజు—గూనిగుర్రం

నండూరి రామమోహనరావు గారి టామ్‌సాయర్ హకల్‌బెరీఫిన్ రాజు_పేదఎస్ కె.వెంకటాచార్యులు గారి ఆలివరు ట్విస్టు వి దుర్గాప్రసాద్ రావు గారి అలీ బిలీ లోకంలో అమ్మాయికథబద్దెపూడి రాధాకృష్ణమూర్తి గారి చిట్టితల్లి బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు గారి ఎర్రగుర్రపు పిల్ల లాంటి నవలలు వీరికి అందించాలి. సాధ్యమైనంత వరకు అసభ్యకరమైన శృంగార రచనలు పిల్లలకు దూరంగా ఉంచాలి. మూడవ దశలోని పిల్లలకు ఉత్తమమైన పఠన సాహిత్యం అందిస్తే వారు సాహితీ పరులు, విజ్ఞాన వంతులుగా తయారవడమేగాక జాతిని ప్రభావితం చేయగలుగులారు.

ఈ విధంగా బాలలను ఆనందింపచేసి, వారి మానసిక విజ్ఞాన వికాసాలకు తోడ్పడే బాలసాహిత్యం గేయాలు కథలు నాటికలు నవలలు మొదలైన వివిధ ప్రక్రియలతో విస్తృతమై ఉంది ఆధునిక బాలసాహిత్యంలో ఈ ప్రక్రియలన్నీ విరివిగా వెలువడుతున్నాయి.

1.3 బాలసాహిత్యంపై జరిగిన కృషి :

బాల సాహిత్య వ్యాప్తిని ప్రాముఖ్యాన్ని గూర్చి తెలుగులో సమగ్రమైన పరిశోధనగాని, పరిశీలనగాని ఇంతవరకు జరగలేదు. బాలసాహిత్యంపై పత్రికలలో ప్రత్యేక సంచికల్లో కొన్నివ్యాసాలు వెలువడినాయి. తెలుగు బాలసాహిత్యంలో మొట్టమొదటిసారిగా డా॥ యం. కె. దేవకి గారు తెలుగులో బాలగేయసాహిత్యంపై డా॥ జి. నాగయ్య గారి పర్యవేక్షణలో పరిశోధన జరిపి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో పిహెచ్ డి. పట్టం పొందినారు. తరువాత డా॥ వెలగా వెంకటప్పయ్య గారు బాలసాహితీ వికాసం అనే పేరుతో బాలసాహిత్యంపై పరిశోధన జరిపినారు. తెలుగులో బాల నాటికలు_సవిమర్శక సమీక్షపై యం. రజని గారు డా॥ జి. నాగయ్యగారి పర్యవేక్షణలో పరిశోధన జరిపి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో యం. ఫిల్. పట్టం పొందినారు. ఆచార్య బి. రామరాజుగారు తమ తెలుగు జానపద గేయ సాహిత్యం అనే పరిశోధన గ్రంథంలో బాలగేయాలను గూర్చి కొంత ప్రస్తావించినారు వేటూరి ప్రభాకరశాస్త్రి టేకుమళ్ళ కామేశ్వరరావు నేదునూరి గంగాధరం, ఆర్వీయస్ సుందరం. ఎల్లోరా మొదలైన వారు జానపద బాలగేయాలను సేకరించి సమీక్షించినారు.

తెలుగులో వెలువడిన బాలల నవలలను గూర్చి ఇంతవరకు విస్తృతమైన పరిశీలనగాని పరిశోధనగాని జరగలేదు. బాలల నవలలను గూర్చిన విమర్శక గ్రంథం

ఇంతవరకూ తెలుగులో రాలేదు. తెలుగుబాలగేయ సాహిత్యం అనే పరిశోధన గ్రంథం లో బాలల నవలా రచయితలను కొన్ని బాలల నవలల పేర్లను పేర్కొన్నారు. డా॥ వెలగా వెంకటప్పయ్యగారు తమ బాలసాహితీ వికాసంలో కథా సాహిత్యం అనే అధ్యాయంలో కొన్ని పిల్లల నవలల్ని గూర్చి ప్రస్తావించినారు. డా॥ చంద్రశేఖర గారు రచయిత్రుల సాంఘిక నవలలు అనే పరిశోధన గ్రంధంలో కొన్ని పిల్లల నవలల పేర్లను పేర్కొన్నారు. ఇవి కేవలం ప్రస్తావికాలే తప్ప విస్తృతమైన పరిశోధనలు కావు. కాబట్టి తెలుగులో బాలల నవలల పరిశోధన అత్యంత అవశ్యకమైనది. ఇంతవరకు పిల్లల నవలల్ని గూర్చి సమగ్రమైన పరిశోధనాగ్రంథం వెలువడని కారణంగా పిల్లలంటె విపరీతమైన ఆపేక్ష ఇష్టం ఉన్నందున బాలల నవలలు అనే అంశం పై అభిమానంతో బాలల నవలలను పరిశోధనాంశంగా ఎన్నుకోవడం జరిగింది

1.4 సిద్ధాంత వ్యాస రచనా ప్రణాళిక :

తెలుగులో బాలల నవలల పుట్టుకను వికాసాన్ని ఇతివృత్త పై విధ్యాన్ని ప్రదర్శించడం ఈ పరిశోధనా ప్రయత్నం. బాలల నవలా రచయితలను స్వయంగా కలుసుకొని కొందరితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి విషయాలను సేకరించి ఈ పరిశోధనా వ్యాసాన్ని వ్రాయడం జరిగింది. ముద్రితాలైన 200 బాలల నవలల్ని పరిశీలన ఈ సిద్ధాంత వ్యాసంలో వివరించడమైనది బాలలకోసం తెలుగులో వెలువడిన వివిధ రకాలైన బాలల నవలల్ని పరిశీలించడం జరిగింది.

బాలల నవలా సాహిత్య పరమైన పరిశోధనలో రూపొందిన ఈ సిద్ధాంత వ్యాసాన్ని అయిదు అధ్యాయాలుగా విభజించడం జరిగింది.

మొట్టమొదటి అధ్యాయంలో బాలసాహిత్యం అంటే ఏమిటి? బాలసాహిత్య స్వరూపతత్వం బాలదశను మూడు దశలుగ విభజించి, ఆయా దశలలో అవసరమైన శ్రవ్య పరన సాహిత్య స్వరూపం వివరించడం ఈ అధ్యాయం లోని ప్రధానవిషయం

రెండవ అధ్యాయంలో నవల అంటే ఏమిటి? నవలా నిర్వచనం తెలుగులో నవలా వ్యాప్తి బాలల నవలా వికాసం పత్రికల తోడ్పాటు బాలల అకాడమీల తోడ్పాటు గూర్చి చర్చించడం జరిగింది.

మూడవ అధ్యాయంలో ఇతివృత్తాన్ని బట్టి బాలల నవలల్ని జానపద, పౌరాణిక, చారిత్రక, సాంఘిక, అనువాద, హాస్య, వైజ్ఞానిక మొదలైన వివిధ రకాలుగా వర్గీకరించి పరిశీలించడం జరిగింది.

నాల్గవ అధ్యాయంలో పిల్లల నవలల్లోని పాత్రలు సన్నివేశ కల్పన, సంభాషణలు, శైలులను గూర్చి శిల్ప వైశిష్ట్యాన్ని గూర్చి చర్చించడం జరిగింది.

**ఈ** విధంగా బాలల కోసం వెలువడిన వివిధ రకాలైన నవలలను గ్రహించి నాలుగు అధ్యాయాలుగా విభజించి ఈ సిద్ధాంత గ్రంథంలో పరిశీలించడం జరిగింది. బాలల నవలల పరిశోధన తరువాతి అధ్యాయంలో వివరించడమైంది.



# 2

# బాలల నవలా వికాసం

2.0 ఆధునిక యుగంలో పిల్లలే చదివి అర్థం చేసుకోగల నవలలు విరివిగా వెలువడుతున్నాయి. వీటిలో పిల్లల్ని పాత్రలుగా తీసుకొని పెద్దలు వ్రాసిన నవలలు కూడా ఎన్నో ఉన్నాయి. బాలల నవలావికాసాన్ని గూర్చి తెలుసుకోడానికి ముందు తెలుగు నవల ఆవిర్భవికాసాల్ని, స్వరూప స్వభావాలను పరిశీలిద్దాం.

## 2.1 తెలుగు నవల — ఆవిర్భావ వికాసాలు :—

ఆంగ్లసాహిత్య ప్రభావం వల్ల వృద్ధిపొందుచు ఆధునికాంధ్ర వాఙ్మయానికి పరిపుష్టి కల్గిస్తున్న సాహిత్య ప్రక్రియలలో నవల ఒకటి.

### 2.1.1 నవల — నిర్వచనాలు :—

సుమారు వేయి సంవత్సరాల క్రిందట జపాన్ దేశంలో నవలా ప్రక్రియ ఆవిర్భవించినట్లు తెలుస్తున్నది. జపాన్ దేశంలో క్రీ.శ. 975—1031 సంవత్సరాల మధ్య కాలంలో "మురాసకి" వ్రాయబడ్డ "గెంజిగాథ" (The Tale of Ganji) విశ్వ సాహిత్యంలో మొట్టమొదటి నవలగా చెప్పవచ్చు.

ఇంగ్లీషులో **Novel** అనే పదానికి సమానార్థకంగా 'నవల" అనే పదాన్ని వాడుతున్నాం. లాటిన్ భాషలో నోవిలస్ అని, ఫ్రెంచి భాషలో నోవా అని ఇటాలియన్ భాషలో నొవెల్లా అని దేశీయ భాషలైన మరాఠి, గుజరాతి కన్నడ భాషలలో "కాదంబరి అని బెంగాలి, ఒరియా, అస్సామి, హిందిలలో "ఉపన్యాస్" అని వ్యవహరింపబడు తున్నది. ఈ నవలా ప్రక్రియ మొట్టమొదట "వచన ప్రబంధము" నవీన ప్రబంధము' అని పిలువబడేది.

నవలను ఆంగ్ల విమర్శకులు, తెలుగు సాహితీ వేత్తలు చాలామంది నిర్వచించారు.

'Lord David cecil

'A Novel is a work art in so far as it introduces us into a living world in some respects resembling the world we live in, but with an individuality of its own'

సజీవమైన జగత్తులో పరిచయం చేసే కళాకృతి నవల. చాలా విధాలా ఈ జగత్తుమన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని పోలి ఉంటుంది. అని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చినారు.

Rolph Fox

'The Novel is fictitious narrative which contains a plot'[2]

కథా వస్తుతో కూడిన కాల్పనిక వర్ణనాత్మక రచన నవల అని నిర్వచించినారు

"సామాన్య జీవితమునందలి సంగతులను, కుట్రలను తెలుపునట్టి అదీర్ఘ చరితాఖ్యానము[3] అని కాకర్ల వెంకట రామ నరసింహం గారు నిర్వచించారు. యదార్థ జీవితముల వాస్తవిక చిత్రణముగల గద్యరూపక కథాసాహిత్యము నవల[4] అని పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు గారి అభిప్రాయం.

---

1. Hardy the Novelist
2. The Novel and the People.
3. సాహిత్య దర్శనము
4. తెలుగు నవలావికాసము పుట

నవల యనగా కల్పనలతో కూడిన ఒక సుదీర్ఘమైన ఊహా నిర్మితకథ. ఇందు లో వాస్తవ జీవితమునకు సంబంధించిన స్త్రీ పురుష పాత్రలు సన్నివేశములు జిగిబిగి అయిన అల్లికతో కలిసిపోయి ప్రకాశించును. ఈ నిర్వచనము నేడు సాహిత్యములో మనకందరికి పరిచితమగు నవలలను, గ్రంథములన్నింటిని సమన్వయించును.[1] అని తెలుగు విజ్ఞాన సర్వస్వం చెబుతుంది.

రచనా కాలమునందలి వాస్తవిక ములగు జీవితాచార వ్యవహారములను చిత్రించు నది. నవల [2]అని బొడ్డపాటి వేంకట కుటుంబరావుగారు చెప్పారు. మొదలి నాగభూషణ శర్మగారు తన 'తెలుగు నవలా వికాసం' లో నవలను సాంఘిక జీవితానికి ప్రతిబింబం గా వ్యక్తుల జీవిత గమనాన్ని చిత్రిస్తూ, జనుల ఆచార వ్యవహారాలను వ్యక్తీకరించే గద్యప్రబంధం నవల[3] అని నిర్వచించారు.

సాహితీవేత్తల, విమర్శకుల అభిప్రాయాలను పరిశీలిస్తే సమాజంలోని వ్యక్తుల యదార్థ జీవన విధానాన్ని కళాత్మకంగా చిత్రించేది నవల అని చెప్పుకోవచ్చు. సంఘం లో ని వ్యక్తుల ఆచార వ్యవహారాలు కూడా ఈ నవలలో ప్రతిబింబిస్తుంటాయి.

మనదేశంలో ప్రవేశపెట్టబడిన పాశ్చాత్య విద్యావిధానం, పాశ్చాత్య సంస్కృతుల ప్రభావం, పాశ్చాత్య విజ్ఞాన పరిచయం. అచ్చు యంత్రం, పత్రికలవ్యాప్తి, వచన వికా సం మూలంగా 19వ శతాబ్దిలో తెలుగులో నవల ఆవిర్భవించింది.

19వ శతాబ్దిలో ఆంగ్ల నవలతో పరిచయం కూడా మన తెలుగు నవలావిర్భావానికి అనేక విధాల చేయూతనిచ్చింది. ప్రపంచ ప్రథమ ద్వితీయ మహాసంగ్రామాలు భారత స్వాతంత్ర్య సంగ్రామం, జాతీయ పునరుజ్జీవన ప్రయత్నాలు, సంఘ సంస్కరణ, స్వాతంత్ర్యానంతరం సంస్థానాల విలీకరణ తెలంగాణా భూస్వామ్య వ్యతిరేక పోరాటం వంటి దేశీయ-అంతర్జాతీయ సంఘటనలు, తెలుగు నవలను ముందుకు నడిపించడానికి తోడ్పడ్డాయి. కాల్పనిక అభ్యుదయ, దిగంబర, విప్లవోద్యమాలు. దిన, వార, మాస ప త్రి క లు సాహిత్య సంస్థలు ప్రచురణ సంస్థలు, ప త్రి క ల వ్యా ప్తి ప్రచురణ సంస్థల వ్యాపారాభివృద్ధి, వ్యాపారదృష్టి, ధారావాహిక నవలల ప్రచురణ

---

1. నవలావాఙ్మయము (తెలుగు విజ్ఞాన సర్వస్వము) పు 876
2. ఆంధ్రనవలా పరిణామము పు 102
3. తెలుగు నవలా వికాసం పు 20

నవలల పోటీలు తెలుగు నవలా వికాసానికి తోడ్పడ్డాయి. నూటికి తెలుగు నవలా సాహిత్యాభివృద్ధికి ఆదిలో పునాదులు వేసింది అనువాదాలే. అవి ఈనాటికీ తెలుగు నవలా సాహిత్యాభివృద్ధికి దోహదం చేస్తూనే ఉన్నాయి, రచనా రంగంలో ప్రవేశించిన స్త్రీలు తెలుగు నవలా వికాసానికి ఎంతగానో తోడ్పడ్డారు.

2.1.2. మొట్టమొదటి తెలుగు నవల :

తెలుగులో మొట్టమొదటి నవల ఏది? అనే విషయం మీద చాలా చర్చలు జరిగినాయి. 1872 సంవత్సర ప్రాంతంలో తెలుగుదేశంలో కర్నూలులో నరహరి గోపాల కృష్ణమశెట్టి గారు డిప్యూటీ కలెక్టరుగా ఉండేవారు. 1872 లో లార్డు మోయో బెంగాలు గెజిట్ లో చేసిన ప్రకటన గోపాలక్రిష్ణమశెట్టిగారిని 'శ్రీరంగరాజ చరిత్ర' అనే వచన ప్రబంధం వ్రాసేటట్లు ప్రేరేపించింది. దీన్ని 1872లో ప్రకటించారు. శ్రీరంగరాజ చరిత్రను మద్రాసు గెజిట్ తొలి తెలుగు నవలగా పేర్కొన్నది.

1872 లో కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి 'మహాశ్వేత' వెలువడింది. ఇది 1872కు పూర్వమే వ్రాయబడిందని కొందరు పండిత విమర్శకులు ప్రతిపాదించారు

ఇక మూడవది కందుకూరి వీరేశలింగం పంతులుగారి రాజశేఖరచరిత్ర ఆలివర్ గోల్డుస్మిత్ రచించిన దివికారాఫ్ వేక్ ఫీల్డు ఆధారంగా కథను మాత్రం తీసుకొని దేశీయ వాతావరణంలో తెలుగు వాళ్ళకు ఆకర్షణీయంగా సాంఘిక జీవనం ప్రతిపాదించేటట్లు ఈ నవల వ్రాయబడ్డది. 1878లో వివేక వర్ధని అనే మాసపత్రిక ఈనవలను ప్రకటించింది ఈ నవలకు ఎక్కువ ప్రచారం లభించింది. ఈ నవలా లక్షణాలను బట్టి, ఆ నవలకు లభించిన ప్రచారాన్ని బట్టి వీరేశలింగం పంతులు గారి రాజశేఖరచరిత్ర మొట్టమొదటి నవలగా నిర్ణయింపబడింది. ఆనాడు సమాజంలో ఉన్న దుర్మార్గాలని, దురాచారాలని మూఢ విశ్వాసాలను ఈ నవలలో చక్కగా చిత్రకరించినారు. ఆనాటి సమాజానికి ప్రతిబింబమే పంతులుగారి నవల.

ఆంగ్ల సాహిత్య ప్రభావం వల్ల వృద్ధిపొందుచు, ఆధునికాంధ్ర వాఙ్మయానికి పరిపుష్టి కల్గిస్తున్న ఈ నవల క్రమవికాసాన్ని పొందింది. సాంఘిక జీవితానికి ప్రతిబింబంగా సంఘంలోని మూఢ విశ్వాసాలను రూపుమాపే సాధనంగా ప్రారంభమైన నవల రానురాను అనేక మార్పులకు గురైంది. ఈ మార్పులను మొదలి నాగభూషణ శర్మ గారు నాలుగు దశలుగా విభజించి చూపారు.

2.1.3 మొదటి దశ 1872—1900 :—

నవలా వికాస చరిత్రలో ఇది ప్రారంభయుగం. ఈ దశలోని రచయితలు నవలను వచన ప్రబంధం గానే భావించి రచనలు చేసినారు. సంఘంలోని దురాచారాల మూఢవిశ్వాసాలను రూపుమాపాలనే ప్రయత్నంలో మొదటి దశలో నవల వెలువడింది. సంఘ సంస్కారంతో వీరేశలింగం పంతులుగారి కలంనుండి వెలువడిన మొట్టమొదటి నవల రాజశేఖర చరిత్ర ఇది సాంఘిక నవల ఈ నవల తరువాతి తరం వారందరికి మార్గదర్శకమైంది. మొదటి సాంఘిక నవల వెలువడినా క్రమంగా అన్ని రకాల నవలలు వెలువడినాయి. సాంఘిక, చారిత్రక నవలలతో పాటు కొన్ని అపరాధ పరిశోధక నవలలు కూడా వెలువడినాయి. మొట్టమొదటి దశలో కందుకూరి ఆయన మార్గాన్నే అనుసరించి నవలా రచన ప్రారంభించిన చిలకమర్తి లక్ష్మీనరసింహంగార్ల కృషివల్ల తెలుగులో నవలకు మంచి ఆదరాభిమానాలు లభించినాయి. వీరేశ లింగం గార్కి అడుగు జాడలలో నడుస్తూ చిలకమర్తిగారు ఎన్నో నవలలు రచించినారు. చిలకమర్తి గారి మేధా సంపత్తికి, అసామాన్యమైన ప్రతిభకు ఉదాహరణగా వెలువడిన ఉత్తమ సాంఘిక నవల రామచంద్రవిజయము. ఈ దశలో ముఖ్యంగా సాంఘిక మైన ఉన్నతికి ప్రాముఖ్యమిచ్చి రచయితలు తమ రచనలు చేసినారు. ఈ దశ లో సంఘ-సంస్కరణోద్యమాలు, దేశీయసాహిత్య ప్రభావం రచయితల్ని ప్రోత్సహించి నాయి. తొలి దశలోని నవల సమకాలిక, సాంఘిక జీవితంలోని చెడుని విమర్శించడానికే ఉద్దేశింపబడింది.

2.1 4 రెండవ దశ 1900—1920 ;—

ఈ దశను అనువాద యుగమనవచ్చు. ఈ దశలో అనువాదాలు, అనుసరణలు ఎక్కువగావచ్చాయి ఈ దశలో జాతీయోద్యమ ప్రభావం రచయితల మీద పడింది, వంగ భాషనుండి అనువాదం చేయబడ్డ అపరాధపరిశోధక నవలలు ఎక్కువగా వచ్చినాయి. దొరస్వామయ్య గారి కమలాకోమల 1908 కనకవల్లి భాస్కరరావు ప్రఫుల్ల ముఖి 1909 వాగంటి శేషయ్యగారి రాధారాణి 1910 దుర్గేశనందిని 1911 నవాబునందిని 1915 వేంకటపార్వతీశకవుల రాజసింహం 1912 లాంటిబంకిం నవలలు అనువాదం చేయబడి ప్రజాదరణ పొందినాయి. ఇంకా రమేష్‌చంద్రదత్తు వ్రాసిన లేక్ ఆఫ్ పామ్స్, అన్న నవలకు చిలకమర్తి వారి సుధాశరశ్చంద్రము భద్రెల్లోకు అనుకరణ అయిన కొండపర్తి వీరభద్రాచార్యులుగారి జయసేన విజయం 1910 వంటి అనువాద నవలలు వెలువడినాయి. ఈ అనువాదాలతో పాటు స్వతంత్ర నవలలుకూడా

ఎక్కువగా వెలువడినాయి. ఈ యుగంలో చిలకమర్తి, వేంకటపార్వతీశ కవులు అను వాదాలు చేస్తూనే సాంఘిక చారిత్రక నవలలు కూడా వ్రాసినారు, వేంకటపార్వతీశ కవుల ప్రబోధావనము, చిలకమర్తి వారి హేమలత అహల్యాబాయి శాపము మొదలైనవి పేర్కొనవచ్చు, భోగరాజు నారాయణమూర్తి గారు తెలుగు చరిత్ర మీద నవలలు వ్రాసినారు. వీటిలో కొన్ని ముఖ్యమైన నవలలు ఆంధ్రరాష్ట్రము 1915 విమలాదేవి 1910 అస్తమయం 1916 ధరణికోట 1917. ఈ కాలంలో పాఠకులలో పఠనా శక్తిని పెంపొందించటానికి అనేక పుస్తక సంస్థలు వెలసినాయి. ఈ దశలో తెలుగు నవలల మీద కేవలం జాతీయోద్యమ ప్రభావమే గాకుండా ఆనాటి సాంఘిక ఆర్థిక పరిస్థితులు ప్రభావం కూడా పడిందని చెప్పవచ్చు.

2.1.5 మూడవ దశ 1920_1942 :_

ఈ దశలో నవలా పరిణామం ఒక నూతనాధ్యాయం ప్రారంభమైందని చెప్పవచ్చు. ఈ దశలోని రచయితలు తమ భావాలకనుగుణంగా రచనలు చేసినారు ఈ దశలో వెలువడిన నవలలన్ని చాలా వరకు స్వతంత్ర రచనలే. చారిత్రకాలు సాంఘికాలు ఎక్కువగా వెలువడ్డాయి. ఈ దశలో వెలువడ్డ నవలలు చాలావరకు సాంఘిక విప్లవాన్ని ఉద్దేశించి వ్రాయబడినవే. 1921లో వెలువడ్డ ఉన్నవ లక్ష్మి నారాయణ పంతులుగారి సాంఘిక నవల మాలపల్లి ఆంధ్ర నవలా సాహిత్యంలో సరికొత్త ప్రయోగం. గాంధీజీ ఆశయాలకు అనుగుణంగా వ్రాయబడ్డ ఈ నవల తెలుగు నవలా రచనలో క్రొత్త సంచలనాన్ని కలిగించింది. కాల్పనిక, అభ్యుదయ భావ కవితా ప్రభావం ఈ యుగంలో రచయితల మీద ప్రబలంగా పడింది. ఈ కాల్పనికోద్యమ ప్రతినిధులు. విశ్వనాథ సత్యనారాయణ, చలం, అడవి బాపిరాజు 1925లో మొక్కపాటి నరసింహశాస్త్రి గారి బారిష్టరు పార్వతీశం ఉత్తమ హాస్య నవలగా పేరు పొందింది. ఈ కాలంలోనే శరత్ అనువాదాలు ప్రారంభమై దేశాన్ని ప్రభావితం చేశాయి. ముఖ్యంగా ఈ దశలో తెలుగు చారిత్రక నవలా వికాసానికి అడవి బాపిరాజు, నోరి నరసింహశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ ఎంతో కృషి చేసినారు

2.1.6. నాల్గవదశ 1943_1970:

ఈదశలోని నవలల్లో ఆధునిక ధోరణులు ఎక్కువగా కనిపిస్తాయి. ఆంగ్ల

సాహిత్య ప్రభావం కూడా ఈ కాలపు రచయితల మీద పడింది. ఈదశలోని కాలంలో దేశానికి స్వాతంత్ర్యం లభించడం వల్ల దేశీయ జీవన రంగంలో విప్లవాత్మకమైన మార్పులు చాలా మంది రచయితల్ని పురికొల్పినాయి. ఫ్రాయిడ్ మనో విశ్లేషణ. మార్క్స్ భౌతిక వాద దృక్పథం ప్రబలంగా తెలుగు నవలల మీద పడింది ఈదశలో స్వాతంత్ర్యానంతరం దేశంలోని పరిస్థితుల ప్రభావం తెలుగు నవలల్లో కనిపిస్తుంది. ఈ దశలో మనోవైజ్ఞానిక నవలలు కూడా వెలువడినాయి. ఇందులో ముఖ్యంగా బుచ్చిబాబు గారి "చివరకు మిగిలేది" రాచకొండ విశ్వనాథశాస్త్రి గారి "అల్పజీవి" గోపీచంద్ గారి "అసమర్థుని జీవయాత్ర" లను చెప్పుకోవచ్చు. జాతీయోద్యమ ప్రభావం చక్కగా చిత్రించిన నవల కొడవటిగంటి కుటుంబరావుగారి "చదువు" ఇంకా విశ్వనాథవారి "జేబుదొంగలు" జి. వి. కృష్ణారావు గారి "కీలుబొమ్మలు" "రాగరేఖలు" "పాపికొండలు" ముఖ్యమైనవి. తరువాతి కాలంలో ఎంతో మంది రచయితలు, రచయిత్రులు నవలలు వ్రాయడం ప్రారంభించినారు. ముఖ్యంగా స్త్రీలు ఎక్కువ నవలలు వ్రాయడం ఈ నవలా వికాసానికి ఎంతగానో తోడ్పడింది. ఈ కాలంలో నవలా రచయితలు తమ నవలల్లో కుటుంబ గాథల్ని ఇతివృత్తాలుగా ఎన్నుకోవడం జరిగింది. ఈ దశలో ప్రవేశించిన మహిళా రచయితలు శ్రీమతి మాలతీ చందూర్. లత. ముప్పాళ. రంగనాయకమ్మ, కోడూరు కౌసల్యాదేవి తరువాత యద్దనపూడి సులోచనారాణి, ద్వివేదుల విశాలాక్షి. ఆనందారామం లాంటి వారెందరో నవలా సాహిత్యాన్ని చేపట్టి నవలా వికాసానికి తోడ్పడ్డారు మొదలి నాగభూషణశర్మ గారు నాల్గుదశల కాలాన్ని అంటే 1970 సంవత్సరం దాకా వచ్చిన నవలా పరిణామాన్ని గూర్చి వివరించినారు 1970 నుండి ఇప్పటివరకు వచ్చిన నవలల్ని గూర్చి ప్రస్తావించలేదు. 1970 నుండి ఇప్పటి దాకా ఒక దశగా గుర్తించి నవలా క్రమ పరిణామాన్ని పరిశీలిద్దాం.

1970_ఇప్పటి దాకా :

1970 తర్వాత నవలలు లెక్కకు మించి బయలుదేరినాయి. వివిధ రకాలైన దిన, వార, పక్ష, మాస, పత్రికల ప్రచురణ ఎక్కువగా జరిగింది. ఈ పత్రికలు ఉగాదికి, దీపావళికి. సంక్రాంతికి, విజయదశమికి నవలల పోటీలు ప్రకటించి నవలా వికాసానికి ఎంతగానో తోడ్పడ్డాయి. పైగా రచయిత్రులు ఎక్కువగా నవలలు వ్రాయడం మొదలెట్టారు. వార. మాస. పత్రికలలో సీరియల్స్‌గా డైరెక్టుగా ఎన్నో

రకాల నవలలు వెలువడినాయి. అన్ని రకాల నవలలతో పాటు తెలుగు నవలలో అంతకు ముందులేని ఒక కొత్తదనం ప్రవేశించింది. మంచి ప్రేమ కథల్ని ఎంతో మంచి కుటుంబగాధల్ని జోరుగా, హుషారుగా, చదివే తెలుగు పాఠకులు కొత్తదనం కోసం సొగసులు వెతుకుతూ కలవరిస్తున్న తరుణంలో సైన్స్‌నీ, విజ్ఞానాన్ని, కల్పననీ, సస్పెన్సునీ, ఆధునిక జీవితంలోని ఆందోళననీ మిళాయించుకుని తెలుగు నవలా సాహిత్యంలో ఒక కొత్త కలం వెలసింది. తెలుగు నవలను కొత్తదారికి మళ్లించిన ఆకలం యండమూరి వీరేంద్రనాద్. హారర్ సస్పెన్స్ సరదాగా సైన్స్‌తో కలిపి రొమాన్స్‌తో నింపి సుమారు 1978 నుండి ఇప్పటిదాకా ఎన్నో నవలలను వ్రాసినారు. అంతకు ముందు తెలుగు నవలా సాహిత్యంలో ఎక్కువ ప్రచారంలో లేని క్షుద్ర సాహిత్యాన్ని ప్రవేశపెట్టినాడు. ఇతడు మొట్టమొదటి సారిగా 1978 లో "పర్ణశాల" అనే నవలను వ్రాసినాడు. తర్వాత వరుసగా తులసి, తులసిదళం, యుగాంతం, రాధా—కుంతి, వెన్నెల్లో ఆడపిల్ల. ఆఖరిపోరాటం. అడక్కు. నిశ్శబ్దం నీకూ నాకూ మధ్య, చెంగల్వ పూదండ లాంటి నవలెన్నో ప్రజాదరణ పొందినాయి. ఈ దశలో క్షుద్ర సాహిత్యాన్ని ప్రవేశపెట్టి ప్రజల్ని ఉత్ర్కూత లూగించిన వారు చందు సోంబాబు. ఎన్. ఆర్. నంది గార్లను చెప్పుకోవచ్చు. చందుసోంబాబు కాష్మోరా" లాంటి ఉత్కంఠత కలిగించే క్షుద్రసాహిత్యాన్నే గాక, స్త్రీల అభ్యుదయం కోసం "మొగుడే కావాలా?" అనే నవలను కూడా వ్రాసినాడు. ఎన్. ఆర్. నందిగారు క్షుద్రసాహిత్యానికి సంబంధించిన "కాంచనగంగ" నవలేగాక సైంటిపిక్ నవల "గుడ్‌బై భూదేవి గుడ్‌బై నవలను కూడా వ్రాసినాడు. ఈదశలో సస్పెన్స్ నవలలు, సైంటిపిక్ వైజ్ఞానిక నవలలు చారిత్రక నవలలు వేల సంఖ్యలో వెలువడినాయి. రచయితలు, రచయిత్రులు దిన, వార పక్ష, మాస, పత్రికల్ని యదేచ్ఛగా పరిపాలించినారు. లల్లాదేవి గారి ఆర్య అనార్య, సంగ్రామాల అద్భుత చిత్రణ "గలగలా గోదారి" "కౌగిట్లో కృష్ణమ్మ. నాగ్రవి. తిరుచరణాలు, ప్రసాద్ గారి అప్పాజీ, ఆర్య చాణక్య రోషనార షాజహాన్, సామ్రాట్ శ్రీ రంగరాయ సురాజుద్దౌల, విజయనగర పతనం, ఈ దశలో వెలసిన ముఖ్యమైన చారిత్రక నవలలు. మల్లాది వెంకటకృష్ణమూర్తి "ఈ గంటగడిస్తే చాలు" "నక్షత్రలోస్తు న్నాయి జాగ్రత్త, రావినూతల సువర్ణాకన్నన్ "క్లిక్ క్లిక్ క్లిక్, మైనంపాటిభాస్కర్ బుద్ధి జీవి. ప్రఫుల్ల చంద్ర రేపటి మనుషులు లాంటి సైంటిపిక్ సస్పెన్స్ నవలలు ప్రజల్ని ఉత్ర్కూతలూగించినాయి.

ఇంకా ఈ దశలో మతం కన్నా మానవత్వం గొప్పని నిరూపించి కళాప్రపూర్ణ లత సాహిత్యం 'ఏదిసత్యం?', ఘండికోట బ్రహ్మాజీరావు గారి "శ్రామిక శకటం" "విజయవాడ జంక్షన్", కొమ్మనాపల్లి గణపతి గారి "అరణ్యకాండ", మందా వెంకట రమణ గారి "నరబలి", తెన్నేటి హేమలత "వనమాల" కొర్ర పాటి గంగాధరరావు గారి ఢంసా, కె. వి. కృష్ణకుమారి గారి 'కర్మయోగి' చీర్ల లోకేశ్వర రావుగారి నరమేథం, పవని నిర్మల ప్రభావతిగారి 'చైతన్య రాహిత్యంలో స్త్రీ' శలబాలు. డా॥ కేశవరెడ్డి గారి 'ఇన్‌క్రెడిబుల్ గాడెస్, సి. ఆనందరామంగారి వెరైటీ నవల తుఫాన్, పరిపల్లి కృష్ణారెడ్డి గారి సిట్టూర్పుల జీవితాలన్ని కలిస్తే నిలువెత్తు చేతన్యపు ఉప్పెన అని చిత్రించే నవల 'ఉప్పెన', వడ్డెర చండీదాస్ గారి' హిమజ్వాల' అనుక్షణికం, వాసిరెడ్డి సీతాదేవి గారి సంచలన నవల 'మరీచిక' లాంటి నవలలు వెలువడి ప్రజల్ని విరివిగా ఆకట్టుకున్నాయి. 1970 నుండి ఇప్పటివాకా ప్రేమ కథలు' కుటుంబ గాథలతో పాటు, క్షుద్రసాహిత్యం, సైంటిసిక్, సస్పెన్స్, వైజ్ఞానిక, హాస్య. నవలలెన్నో వెలువడినాయి.

ఆంగ్ల ప్రభావం వల్ల తెలుగులో వెలసిన నవలా సాహిత్యంలో బాలలకు కూడా నవలలు వెలసినాయి. ఇవి పిల్లల కోసంవారి మన స్తత్వాన్ని ఆధారంగా తీసు కొని పెద్దలు వ్రాసిన నవలలు. తెలుగులో బాలల నవలా వికాసాన్ని కూడా పరిశీలిద్దాం.

## 2.2 ఆధునిక బాల నవలా వికాస చరిత్ర:

కందుకూరి వీరేశలింగం పంతులుగారు సంఘ దురాచారాల, మూఢాచారాల విర్మూలనకు నడిపిన ఉద్యమాల్లో నవల ప్రధాన పాత్ర వహించింది. తెలుగులో నవల ప్రవేశించిన దాదాపు ఎనభై సంవత్సరాలకు గాని. తెలుగులో పిల్లల నవలరాలేదు. దాదాపు 35 సంవత్సరాల క్రితం తెలుగులో పిల్లల నవల ప్రవేశించింది. ఆంగ్ల సాహిత్య ప్రభావంవల్ల తెలుగులో నవల ప్రవేశించినట్లే. పిల్లల నవల కూడా ఆంగ్ల సాహిత్య ప్రభావం వల్లనే తెలుగులో ఆవిర్భవించింది. తెలుగు వాఙ్మయ చరిత్రలో అనేక నూతన ప్రక్రియలకు దారి చూపిన కందుకూరి వీరేశలింగం పంతులుగారే పిల్లలకు ఉపకరించే రచనలు కూడా చేసినారు. పిల్లలకు మొట్టమొదటి సారిగా పాఠ్య పుస్తకాలు వ్రాసింది కూడా పంతులుగారే. ఈ విధంగా మొదలైన బాలల వాఙ్మయ శాఖ క్రమంగా గిడుగు వేంకట రామమూర్తి పంతులు గారి కాలంలో ఒక వినూత్న

రూపం దాల్చింది. గిడుగు సీతాపతి చింతా దీక్షితులు, పిల్లల కోసం అనేక ప్రక్రియలు చేపట్టినారు. మొట్టమొదటి సారిగా తెలుగులో పిల్లలకు లీలాసుందరి అనే నవలను పరిచయం చేసింది చింతా దీక్షితులు గారు. రేడియో అక్కయ్య, అన్నయ్యలుగా ప్రసిద్ధి కెక్కిన న్యాయపతి కామేశ్వరి, రాఘవరావుగార్లు అన్ని రంగాల్లో పిల్లల అభివృద్ధికి కృషి చేసినారు.

ఆధునిక కాలంలో తెలుగులో బాల సాహిత్య సృష్టి విరివిగా సాగుతోంది. బాల సాహిత్యంలో నవలా రచన కూడా ఆధునిక సాహిత్యంలో ఒక భాగంగా వెలసింది. తెలుగులో బాల సాహిత్యంలో ఈ నవలా ప్రక్రియకు సరైన ఆదరణ లభించలేదు. పాశ్చాత్య బాల నవలా సాహిత్యంతో పోల్చి చూస్తే మన తెలుగు బాల నవలా సాహిత్యం చాలా తక్కువని చెప్పవచ్చు ప్రపంచంలో ఇతర భాషల్లో వెలువడినట్లు పిల్లల వయసుననుసరించి వారి మనో ప్రవృత్తుల ననుసరించి వారి ఆలోచనలు అలవాట్లు ప్రతిబింబించే ఉత్తమ బాల నవలా సాహిత్యం తెలుగులో వెలువడడంలేదు మొత్తంమీద బాలల నవలా సాహిత్యాన్ని పరిశీలిస్తే అనువాదాలే ఎక్కువని చెప్పవచ్చు. తెలుగులో పిల్లల నవలల్ని గూర్చిగాని, పిల్లల నవలా సాహిత్యాన్ని గూర్చి గాని ఎవరూ ఎక్కడా సమగ్రంగా చర్చించలేదు. అసలు ఈ విషయాన్ని గూర్చి ఎవరూ పట్టించుకోలేదనిపిసుంది. బాల సాహిత్యానికి సంబంధించిన కొన్ని వ్యాసాల్లో కొంతమంది ఈ ప్రసక్తి తెచ్చినారు. కాని బాలల నవలా ప్రగతికి ఇది ఎంతమాత్రం తోడ్పడదు.

'తెలుగు నవల తెన్నులు' అనే వ్యాసంలో కుమారి జి లలిత గారు పిల్లల నవలల్ని గూర్చి ప్రస్తావిస్తూ—

'పాపాయి ముద్దు రూపాయి ముద్దు
పాపాయి పలుకు, పాటా ముద్దూ'

అన్నారు. అటువంటి పాపాయికి ఈ నాటి తెలుగు నవలల్లో చోటున్నదా అంటే చెప్పుకోదగ్గంత లేదని అనాలి. ఈ చిన్నారుల చిరుగోమును నవలలుగా రూపొందింప ప్రయత్నిస్తున్నారు. శ్రీయుతులు దత్తాత్రేయగారు, చల్లా రాధాకృష్ణశర్మగారు, రావి రావికొండలరావు గారు దిగవల్లి శేషగిరిరావు. ఈ చిరుతలపట్ల మన నవలా కారులు ఇంకా కొంత శ్రద్ధ చూపగలిగితే బాగుంటుంది, అని పిల్లల నవలా సాహిత్యం అభివృద్ధి పొందాలని సూచించినారు.

చంద్రశేఖర్‌గారు తమ సిద్ధాంత వ్యాసం 'ఆధునిక రచయిత్రుల సాంఘిక నవల సమీక్ష' లో పిల్లల నవలల్ని గూర్చి చెబుతూ 'చింతా దీక్షితులుగారితో ప్రారంభమైన బాలల నవలా రచన కె. సభా పాలంకి వెంకటరామచంద్రమూర్తి, శ్రీవాత్సవ, రావి కొండలరావు, కనకమేడల మొదలగు వారి చేతుల్లోపెరుగుతూ వచ్చింది. పిల్లల మాస పత్రిక వ్యాప్తిలో ప్రత్యేకంగా పిల్లలకోసం పౌరాణిక, జానపద, చారిత్రక నవలలు శతాధిక సంఖ్యలో వెలసినాయి. కాని పిల్లలకోసం వెలసిన సాంఘిక నవలలు తెలుగులో అత్యల్పం అని చెప్పవచ్చు [1] అని పిల్లల నవలా సాహిత్యాన్ని గూర్చి ప్రస్తావించినారు.

పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు గారు తమ 'తెలుగు నవలా సాహిత్యవికాసము లోను వెలగా వెంకటప్పయ్య గారు తమ బాలసాహితీ వికాసంలోను, కొన్ని పిల్లల నవలల్ని గూర్చి ప్రస్తావించడం జరిగింది. డాక్టరు దేవకి గారు తమ 'బాలగేయసాహిత్యంలో కొన్ని పిల్లల నవలల పేర్లను సూచించినారు. ఇంతకు మించి పిల్లల నవలల్ని గూర్చి ప్రత్యేక శ్రద్ధతో ఎవరూ ఎక్కడా సమగ్రంగా చర్చించలేదు.

సమాజంలోని వ్యక్తుల యదార్ధ జీవన విధానాన్ని కళాత్మకంగా చిత్రించేది నవల అని చెప్పుకున్నాం. పిల్లల నవలను నిర్వచించ వలసివచ్చినపుడు వస్తు పరిధి విషయంలో పెద్దల నవలకు, పిల్లల నవలకు తేడా ఉంటుంది. పిల్లల నవలల్లో సామాన్యంగా పిల్లల మనో ప్రవృత్తుల్ని ప్రాధాన్యం ఇవ్వాల్సి ఉంటుంది. పిల్లల భాషను, భావాన్ని వాళ్ళ స్థాయికి దించుకుని, పిల్లలకు అందుబాటులో ఉండే ఇతి వృత్తాల్నే తీసికొని వాళ్ళకు ఉపయోగకరంగా ఉండేటట్లు వ్రాయడం కష్టమే. పిల్లల నవల వ్రాయడం ఎంత కష్టమో వివరిస్తూ ఎ.వి.యల్. నరసింహరావు గారు 'కథ' చెప్పటం కంటే పిల్లలకోసం నవల వ్రాయడంలో కష్టమెక్కువ. కథ వ్రాయడం కుక్క పిల్లకు పాలు పోసినట్లనిపిస్తే, నవల వ్రాయడం మదపుటేనుక్కి మేతపెట్టి నట్లు. అందులోను పిల్లల నవల వ్రాయటమంటే గున్న ఏనుగుల్ని గోముగా చేరదీసి మచ్చిక చేసుకోవటం లాంటిది [2] అని చెపూ పిల్లల నవల వ్రాసి మెప్పించడం అంత సులభంకాదని వస్తు పరిధి విషయంలో పెద్దల నవలలకు పిల్లల నవలకున్న తేడా

---

1. ఆధునిక రచయిత్రుల సాంఘిక నవలల సమీక్ష,
2. శాంతి చక్రం, పీఠిక,

వివరిస్తూ "కె. సభా గారు "పెద్దలు చదివే నవలలో ఎన్నో సమస్యలు చిత్రించ వచ్చు అది సులభం. ఎందుకంటే ఆ నవలలకు కథావస్తువు పుష్కలంగా లభిస్తుంది. అమ్మాయి అబ్బాయితో ఆదిమధ్యాంతాలను అమితోల్లాసంగా చిత్రించుకోవచ్చు. పిల్లల నవలా రచనా విధానమే వేరు. ఇక్కడ బాధ్యతలు కూడా ఎక్కువ. దృష్టివేరు. దృక్పథం వేరు. అందుచేత ఇచ్చట కథావస్తువులు కూడా వేరై పోతాయి[1] అని వివరించినారు.

పాశ్చాత్య బాలల నవలా ధోరణులును పరిశీలిస్తే వారి నవలల్లో పిల్లలే పాత్ర ధారులు, పిల్లల నవల అనగానే పిల్లల మనో ప్రవృత్తులకు ప్రాధాన్యం ఇవ్వాలి కె. సభాగారు చెప్పినట్లు "పిల్లలలో అనంతమైన సమస్యలుంటాయి, అవి నవలల్లో నిక్షిప్తం కావాలంటే వాటిని పరిశీలించాలి. ఇందుకు ఎంతో ఓపిక అవసరం ఊహించి రాసే నవలల్లో సహజత్వం కన్పించదు. అవి కృత్రిమంగా తయారై సాహిత్యంలో నిలవకుండా అదృశ్యమై పోతాయి. ప్రతి పిల్లవాడికీ ఒక కథ ఉంది అతని వెనక ఒక చరిత్ర ఉంది. అన్నీ కాకపోయినా కొన్నయినా కథలకు ఉపకరించేవే నవలలకు కథావస్తువులు కాదగినవి[2] అంటూ అనుభవపూర్వకంగా పిల్లల జీవితాల్ని నవలా రూపంలో మలచిన ఘనత వీరికే దక్కింది.

పిల్లలకు నచ్చే ఇతి వృత్తంలో వారికి ఆనందాన్ని కలిగించి, ఆలోచనల్ని రేకెత్తించేదే పిల్లల నవల. పిల్లల జీవితం నుంచే కథను తీసుకొని నవలగా వ్రాసి నపుడు అది ఉత్తమ నవలగా రూపొందుతుంది. సాధ్యమైనంత వరకు పిల్లల మధ్య ఉండే సమస్యల్నే ఇతి వృత్తంగా ఎన్నుకోవడం మంచిది. పిల్లల నవలలు సులభ శైలిలో వారికి ఉత్కంఠతకలిగించేవిగా ఉం డాలి. ఇవి చూడడానికి అందంగా, బొమ్మలు చూడగానే అర్థమై ఊహలను కదిలించేవిగా ఉండాలి. ఎలాంటి అచ్చుతప్పులు లేకుండా పిల్లలకు చాలా చవగ్గ లభించాలి. అప్పుడే పిల్లలందరికి నవలలు అందుబాటులో ఉండి వారికి మానసిక విజ్ఞానం, అలవడుతుంది. సునిశితమైన హాస్యంతో, ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని ఆహ్లాదాన్ని కలిగించే నవలలు పిల్లలకు ఆసక్తి కరంగా ఉంటాయి. అద్భు

---

1. పిల్లల నవలలు. పుట 253
2. పిల్లల నవలలు. బాలసాహిత్య శిక్షణశిబిర ఉపన్యాసం.

తాలంటే పిల్లలకు ఎక్కువ ఇష్టం ప్రతి పిల్లల నవలలో నీతి, ఉపదేశం తప్పక ఉండాలి, మన సంస్కృతి, సంప్రదాయాలు పిల్లల నవలల్లో ప్రతిబింబించాలి.

నవలా ప్రక్రియ ప్రారంభమై దాదాపు ఎనభై సంవత్సరాలు తర్వాత తెలుగులో పిల్లల నవల వెలువడింది. బాలసాహిత్య బ్రహ్మగా పేరు పొందిన చింతా దీక్షితులు గారు మొట్టమొదటి సారిగా తెలుగులో పిల్లల నవలను పరిచయం చేసినారు. వీరు వ్రాసిన "లీలాసుందరి" 1949 మొదటి సారిగా తెలుగులో వెలువడ్డ పిల్లల నవలగా చెప్పుకోవచ్చు. ఈ నవలకు ఆంధ్ర ప్రదేశ్ బహుమతి లభించింది. వెలగా వెంకటప్పయ్యగారు తమ "బాలసాహితీ వికాసం"లో 'తొలి తెలుగు నవల" (పు. 189) అనే దాంట్లో వి దుర్గాప్రసాదరావు గారి "ఆర్లీ బిర్లీ లోకంలో అమ్మాయి కథ" (1951) లూయి కెరోల్ వ్రాసిన 'A lice in wonder land' మొదటి బాలల నవల అనే అభిప్రాయం వెలిబుచ్చినారు. అంతకు ముందే చింతా దీక్షితులుగారి లీలాసుందరి వెలువడింది. ఇది జానపద సంప్రదాయానికి చెందిన అద్భుత నవల. అట్టమీద, లోపల అందమైన బొమ్మలతో, పెద్ద పెద్ద అక్షరాలతో పిల్లల్ని ఆకట్టుకునే విధంగా వ్రాయబడ్డది. పిల్లలు అద్భుతాలంటే చాలా ఇష్టపడతారు. పిల్లలకి వాస్తవానికన్నా అద్భుతాలంటేనే ఇష్టం. చింతా దీక్షితులుగారు పిల్లల్లో ఆలోచనా శక్తిని కలిగించాలని మనుషులు జంతువులు, పక్షులుగా మారడం, రాక్షసి పిల్లల్ని ఎతుకెళ్ళడం లాంటి అద్భుతాలలో పిల్లల్ని ఆకర్షించే ఇతివృత్తంతో, పిల్లల్ని ఆశ్చర్యపరిచే సంఘటనలతో అద్భుతంగా మలచిన నవల. ఈ నవల వెలువడిన తరువాత నాలుగైదు సంవత్సరాల వరకు తెలుగులో పిల్లల నవల రాలేదు. 1950 నుండి 1955 మధ్య కాలంలో అనువాదాలు విరివిగా వెలువడినాయి. ఈ కాలంలో వెలువడ్డ అనువాద బాలల నవలలు ఆబాలగోపాలాన్ని ఉర్రూతలూగించినాయి. ఈ అనువాద నవలల ద్వారానే పిల్లల నవలల్ని గుర్తించినారు ఈ అనువాద నవలల్ని మొట్టమొదట మన తెలుగు పిల్లలకు పరిచయం చేసింది నండూరి రామమోహనరావు గారు. వీటికి మూలం అమెరికన్ సాహిత్యమూలపురుషులలో ఒకరైన మార్క్‌ట్వేన్ గారి రచనలు. 1950 నుండి 1955 దాకా అనువాద నవలలు ఉధృతంగా వచ్చినప్పటికి చాలా కొద్ది సంఖ్యలో అద్భుత నవలలు, సాంఘిక, చారిత్రక నవలలు వెలువడినాయి. అయినా తెలుగులో బాల సాహిత్యంలో ఈ ప్రక్రియ అంతగా ఆదరణ పొందలేదు. 1950–1955 మధ్య కాలంలో వెలువడి ప్రజాదరణ పొందిన నవలలను, వాటి రచయితల్ని గూర్చి తెలుసు

కుందాం. ఇంగ్లీషులో లూయికెరోల్ వ్రాసిన 'ఎ లైస్ ఇన్ ది వండర్ లేండ్" కు వి దుర్గాప్రసాదరావు గారి అనువాదం అల్లీ బిల్లీ లోకంలో అమ్మాయి కథ' ఇది 1951 వ సంవత్సరంలో వెలువడింది. ఈ నవల వారపత్రికలో సీరియల్‌గా ప్రచురింపబడింది

అమెరికన్ సాహిత్యంలో మరపురాని మహారచయిత "మార్క్‌ట్వీన్" గారి రచనలను కొన్నింటిని నండూరి రామమోహనరావుగారు తెనిగించి తెలుగు పిల్లలకు పరిచయం చేశారు. మార్క్‌ట్వీన్ గారి "టామ్‌సాయర్ న్," "హకల్ బెరీఫిన్" ను నండూరి రామమోహనరావు గారు అదే పేర్లతో తెనిగించి తెలుగు పిల్లల కెంతో మేలు చేసినారు. పై రెండు నవలలు అమెరికన్ సాహిత్యంలో అజరామరమైనవి ఇవి మరచిపోదామన్నా మరిపురావు. ఈ నవలలు పిల్లల మన స్తత్వాన్ని, అల్లరిని కళ్ళకు కట్టినట్లు చిత్రించినాయి. ఇవి పిల్లల్ని ఎంతో ఉత్తేజపర చినాయి. మార్క్‌ట్వీన్ గారి మరి రెండు నవలలు "ప్రిన్స్ అండ్ ది పాపర్" "మిస్టీ రియస్ స్ట్రేంజర్స్" ఈ నవలల్ని కూడా నండూరి రామమోహన్‌రావు గారు "రాజు పేద", "విచిత్రవ్యక్తి" అనే పేర్లతో తెనిగించినాడు 1950_1953 మధ్యకాలంలో ఈ నవలలు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సీరియల్‌గా వెలువడి. ఆతర్వాత పుస్తక రూపంలో వెలువడి పిల్లల్ని విపరీతంగా ఆకర్షించి అలరించినాయి. రాజుపేద నవల ఇటీవల ప్రజాతంత్ర వారపత్రికలో సీరియల్‌గా వెలువడి ఆంధ్రపాఠకలోకాన్ని మరొక్కసారి ఉర్రూతలూగించింది. చార్లెస్ డికెన్స్ "ఆలివరు ట్విస్" ను అదేపేరుతో ఎస్. కె. వెంకటాచార్యులుగారు తెనిగించినారు. ఇది తెలుగు దేశంలో అత్యంత ప్రచా రం పొందిన నవల. ఆర్. ఎల్. స్టీవెన్సన్‌గారి "గోల్డెన్ ఐలాండ్" (1955)కు వెంక టాచారిగారి అనువాదం "బంగారు దీవి" అలెగ్జాండర్ డ్యూమా గారి నవలను 'ముగ్గురు యోధులు" (1955) అనే పేరుతో ఎస్ కె. వెంకటాచారిగారే తెనిగించినారు. ఇంకా కొన్ని అనువాద నవలలు తెలుగులో వెలువడినాయి. 1950_55 మధ్య కాలంలో అనువాద నవలలు ఎక్కువగా వెలువడి నప్పటికి, కొన్ని స్వతంత్ర బాలల నవలలు కూడా వెలువడినాయి. 1950_1955 మధ్య కాలంలో తెలుగులో బాల సాహి త్యంలో ఈ ప్రక్రియకు ఎక్కువ ఆదరణ లభించలేదు. విద్వాన్ కొండూరి నరసింహం గారి 'తానాజి" (1952,) బాలజీరెడ్డి చెన్నారెడ్డిగారి "కలము ఖడ్గము' 1954, నండూరి రామకృష్ణమాచార్యగారి తెలుగు దళవాయి (1954)మొదలైన చారిత్రక నవలలు, ఆలూరి భుజంగరావుగారి "కుక్క ఆత్మకథ" (1954) ముద్దంశెట్టి హనుమంతరావు గారి వాసు

చదువు(1955)లాంటి సాంఘిక నవలలు, చింతాదీక్షితులు గారి "గోపి మోహిని"(1955) చిరంజీవిగారి 'వీధిగాయకుడు"(1955)వంటి అద్భుత నవలలు వెలువడినాయి. స్వతంత్ర నవలలు వెలువడినా వీటికి ఎక్కువగా ఆదరణ లభించలేదు. అనువాద బాలల నవలలకే ఎక్కువ ఆదరణ లభించింది. 1950–55 ల మధ్య కాలంలో వచ్చినన్ని అనువాద నవలలు తరువాతి కాలంలో రాలేదు. క్రమంగా అనువాద నవలల ఒరవడి తగ్గి స్వతంత్ర నవలలు రావడం మొదలు పెట్టాయి. పిల్లల కోసం నవలలు వ్రాసేవారు చాలా మంది తయారైనారు. బాలసాహిత్య రచయితలలో చెప్పుకోదగ్గరచయితలు కె. సభాగారు గీతా సుబ్బారావు గారు, నార్ల చిరంజీవిగారు, పాలంకి వెంకటరామచంద్రమూర్తి, గారు సింగంపల్లి అప్పారావు గారు మొదలైన వారందరూ పిల్లలను ఉత్తేజపరిచి, వారి మానసికానందానికి తోడ్పడే పిల్లల నవలలను వ్రాసినారు.

కె. సభాగారు పిల్లల్నే పాత్రలుగా తీసికొని వాళ్ళ సమస్యల్ని ఇతివృత్తాలుగా తీసుకొని, వాళ్ళ మనోప్రవృత్తులు ప్రతిబింబించేటట్లు "సూర్యం" (1959) "చంద్రం" (1965–ద్వి) "పసిహృదయాలు" (1961) "కవి గాయకుడు" (1961) "మత్స్య కన్యలు (1957) "బడిపంతులు" (1955) "పిల్లల రాజం" (1958) వంటి నవలలు వ్రాసి బాలల నవలా వికాసానికి ఎంతగానో తోడ్పడ్డారు. పిల్లల్ని పాత్రలుగా తీసుకొని దిక్కులేని పిల్లల జీవితాల్లోని కష్టనష్టాలు వివరిస్తూ గీతా సుబ్బారావు గారు 'పారిపోయిన బఠాణీ' (1960) "పూల మనసులు" (1979) "చిన్నారి విజయం" (1962) లాంటి మంచి నవలల్ని పిల్లలకోసం వ్రాసినారు. పిల్లలకోసం కొత్తలోకాలు సృష్టించి వాళ్ళలో కొత్తభావాలు, కొత్తఆలోచనలు ప్రవేశపెట్టాలని నార్ల చిరంజీవిగారు పిల్లలకు వీధి గాయకుడు(1955) "పేను–వెనరచేను" (1958) నవలలను అందించినారు విలక్షణమైన ఇతి వృత్తంతో బాలబాలికల మనో వికాసానికి కొమ్మూరి వేణుగోపాలరావుగారు 'పిల్ల దొంగ" (1964), నవలను వ్రాసినారు.

పిల్లల హృదయాలను రంజింపచేసేటట్లు సి. కనకాంబర రాజుగారు "చింటూ తెచ్చిన తంటా" (1976). పిల్లలకు అందించినారు.

ఇంకా అనేక మంది రచయితలు పిల్లల విజ్ఞానాభివృద్ధికి తోడ్పడే నవలలను వ్రాసినారు. చాపరాల సరళాతిలక్ గారి "చిన్నారి మనసులు", ఎ. ఎస్. మణి (అరవింద) గారి "ప్రేమ మంత్రం" (1973) సాహిత్య అకాడమి బహుమతి పొందిన,

నవల, ఆర్. ఆర్. ఉప్పుటూరిగారి "నెహూర్రి క్లబ్బు" (1964), కోడూరి లీలావతి దేవిగారి "ఆశాకిరణం" (1973), (సాహిత్య అకాడమీ బహుమతి పొందిన నవల) కప్ప గంతుల మురళీకృష్ణగారి "గోపి చదువు' (1978), కనకమేడలగారి "అన్నదమ్ములు (1979), ఐ. నాగమల్లారెడ్డిగారి "పోలీసుకుక్క" (1966), శ్రీమతి ఎస్.సి. శాయి లీలాగారి "సవతి తల్లి" (1981), రవిగారి "సాహసిగోపి" తంగెళ్ళ పాండురంగ శర్మగారి "గులాబి బాలలు" (1965), గిరిజశ్రీభగవాన్ గారి "ఓ.పాప కథ" బూచాడు కాణిపాకం లింగన్నగారి "శాంతి చక్రం" (1977) మొదలైనవి ముఖ్యమైన సాంఘిక నవలలు.

హాస్య రచయితల్లో ప్రముఖ స్థానం పొందిన ముళ్ళపూడి వెంకరమణగారు పిల్లలకోసం "బుడుగు" అనే నవలను వ్రాసినారు. ఇది హాస్య నవల.

మనదేశంకోసం, మనదేశ స్వాతంత్ర్యం కోసం ఎందరో వీరులు తమ ప్రాణా లను అర్పించి, భారత దేశ చరిత్రలో స్థిరస్థాయిగా నిలిచిపోయినారు. ఇలాంటి గాథలు పిల్లలు తెలుసుకోవాలనే ఉద్దేశంతో కొంతమంది చారిత్రక అంశాలను సులభశైలిలో వ్రాసి పిల్లలకు అందించినారు.

పాలంకి వెంకటరామచంద్రమూర్తిగారి "బంగారు తల్లి" (1978), ఆంధ్ర జ్యోతి నిర్వహించిన బాలల నవలా పోటీలో బహుమతి పొందిన నవల) సింగంపల్లి అప్పారావుగారి "గౌతమీ పుత్రి శాతకర్ణి" (1982), దళవాయి రామప్పయ్య (1982) "మహారాణా హమీర్ సింహుడు" (1982), "జస్వంత సింహుడు" (1982), వావిలాల సోమయాజులుగారి "నాలంద' శ్రీశార్వరిగారి 'నాగార్జున' (1962) 'సాగరిక' (1962) జీరెడ్డి చెన్నారెడ్డిగారి 'దక్షిణ తార', గుఱ్ఱం జాషువగారి చిన్నానాయకుడు (1958) శ్రీశిష్టా లక్ష్మీకాంతశాస్త్రిగారి 'కోహలుడు' (1960), 'రత్నప్రభ' (1960) మొదలైన చారిత్రక నవలలు వెలువడి బాలల నవలా వికాసానికి దోహద మొనర్చినాయి.

పిల్లలకు మార్గదర్శకాలైన మన పురాణాల్లోని ఇతి వృత్తాలను తీసుకుని పిల్లల కర్థమయ్యే రీతిలో కొంతమంది నవలల్ని వ్రాసినారు. రావి ఎస్. అవధాని గారి 'మహా వీరుడు కర్ణుడు" (1970), శ్రీనుదురుమాటి వేంకటరమణ శర్మగారి ''వేణీ సంహారము (1970), శీతంరాజుగారి ''బాల్యస్నేహితుడు" (1979), కిరణీకుమారిగారి " మహామే

ఛాయి శకుని", 'రారాజు సుయోధన" శ్రీశిష్టా లక్ష్మీ కాంతశాస్త్రిగారి "గౌతమి" (1961), బ్రహ్మపుత్ర (1961), వి.యస్. ప్రకాష్ గారి "మాయా బజార్" "గందరగోళంలో ఇంద్రజాలం" లాంటి పౌరాణిక నవలలు వెలువడినాయి

ఇవిగాక ఇంకా కొన్ని అనువాద నవలలు, అద్భుత నవలలు కూడా వెలువడి నాయి. తమిళంలో ఎస్. అబ్దుల్ ఖాదర్ గారి "నలసమ్ చూడర్" ను మధురాంతకం రాజారాం గారు "ఆకాశదీపం" అనే పేరుతో తెనిగించినారు. 1965 సంవత్సరంలో దక్షిణ భాషా పుస్తక సంస్థ బాలసాహిత్యపు పోటీలో బహుమతి పొందిన నవల.

ప్రముఖ భారతీయ నవలాకారుడు శ్రీకిషన్ చందర్ ఉర్దూలో వ్రాసిన "దాదార్ పులెకెబచ్చే" (1974) కు, "ఉల్టాదరఖ్" కుజ్ఞానేంద్ర అనువాదం "దాదర్ వంతెన పిల్లలు" "లిఫోముఖ వృక్షం" (1974), పుల్టన్ ఔర్స్లర్, విల్ ఔర్స్లర్ రచించిన "ఫాదర్ ఫాగన్ ఆఫ్ బాయిస్ టౌన్" కు అనువాదం శ్రీ ఎస్.ఆర్. చందూర్ గారి తెలుగు అనువాదం "బాలరాజ్యం" ఆర్.డి బ్లాక్ మోర్ రచించిన "లోర్నాడూన్" నవలను అదే పేరుతో ఉదయ శంకర్ గారు తెనిగించినారు. చార్లెస్ డికెన్స్ వ్రాసిన ఒకానొక నవలకు బద్దెనపూడి రాధాకృష్ణమూర్తి గారి అనువాదం "జీవిత నౌక" (1946)

తెలుగులో బాలసాహిత్యంలో అద్భుత నవలలకు ఒక విశిష్టమైన స్థానం ఉంది. ఇవి జానపద ఇతివృత్తానికి సంబంధించినవి. పిల్లల్లో ధైర్య సాహసాల్ని కలిగించడా నికి, భయాందోళనలు తొలగించడానికి కొంత మంది అద్భుత నవలల్ని వ్రాసినారు.

పాయసం సుబ్రహ్మణ్యం గారి "శాంతి పావురం" (1979), చింతా దీక్షితులు గారి "శంపా లత" (1956). గద్దె లింగయ్యగారు, రావూరు భరద్వాజగారు కలిసి రచించిన "రతనాల లోయ (1956) పరకాయ ప్రవేశం (1956). "దేవరకొండ" చిన్నికృష్ణశర్మ గారి "ఆనందలహరి" (1958), ఆలూరి భుజంగరావుగారి "అంతా సమత్తు" (1962), శ్రీ వద్దిపర్తి వెంకటరావు గారి 'జలసింహ" (1956), కిరణ్ కుమారి గారి "చందమామ రావే" అలెగ్జాండర్‌గారి "రత్నాల దీవి" విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులుగారి కుమార రాముడు' (1983), మల్లాది అవధానిగారి "పారిపోయిన పిల్లవాడు" (1962), బాలసాహిత్య శాఖలో అత్యంత కృషిచేసిన అంతటి నరసింహం గారి "కోటవీరన్న సాహసం" (1972). "మంత్రాల రామన్న మొండితనం" (1972)

ఉదయగిరి పోలన్న ధైర్యం, "కవిగారి బాల్యం", (1972), చిమ్మకుల పురుషోత్తం గారి "బంగారం ఎలా చెయ్యాలి?" (1980), లాంటి అద్భుత నవలలు వెలువడినాయి

1979వ సంవత్సరాన్ని అంతర్జాతీయ బాలల సంవత్సరంగా ప్రకటించడంతో ఆ సంవత్సరంలో చాలా మంది రచయితలు పిల్లల నవలల్ని రచించినారు. అంతర్జాతీయ పిల్లల సంవత్సరంలో అనేక వర్గాలకు చెందిన నవలలు వెలువడినాయి. అంతర్జాతీయ బాలల సంవత్సరంలో బాలల మానసికానందానికి దోహదం చేసి, పఠనాశక్తిని పెంపొందించే నవలలు వెలువడి బాలల మనస్సులను రంజింప చేసినాయి.

సింగం పల్లి అప్పారావుగారి "పిచ్చివాడి అదృష్టం", "గోస్వామి తులసీదాసు" "సామ్రాట్ అజాత శత్రువు", "సముద్రపు దొంగలు", మహారాణా ప్రతాప సింహుడు "ప్రేతాత్మ-అబ్దుల్లా" "పండరీబోసుగారి" "ఇద్దరు వీరులు" "తారకాసురుడు" "గీతా సుబ్బారావుగారి" "పూల మనసులు" "భూలోక సుందరి". బోసుబాబుగారి "రాజశక్తి" "ప్రభావతీ పరిణయం", శ్రీ శీతంరాజుగారి "ఒకరోజు రాజు", "బాల్య స్నేహితులు" "వైకుంఠ ఏకాదశి" "యుగంధర్" టింకూ సాహసాలు" "టింకూ బుడిగి", జయశ్రీ మల్లిక్ గారి "మంత్రాలయం", పాయసం సుబ్రమణ్యం గారి "శాంతి పావురం", శీతం రాజు గారి "రౌతుకొద్దీ గుర్రం" "వీర మల్లుడి సాహసాలు" విచిత్ర కవచం" లాంటి నవలలు వెలువడినాయి. ఇవికాకుండా ఇటీవల కాలంలో "జానపద బాలల నవల" అను పేరుతో జానపద ఇతివృత్తలకు సంబంధించిన అద్భుత నవలలు విరివిగా వెలువడుతున్నాయి. అట్ట మీద లోపలి బొమ్మలు పిల్లలను ఆకర్షించే విధంగా ఉంటున్నాయి. ఇవి కొన్ని పిల్లల పత్రికలకు అనుబంధాలుగా మరికొన్ని స్వతంత్ర నవలలుగా వెలువడుతున్నాయి. ఇవి చూడడానికి చిన్న ఆకారంలో ఉంటాయి. ఇవి అ సంఖ్యాకంగా వెలువడుతున్నందు వలన కొన్ని నవలల పేర్లు మాత్రమే ఇక్కడ తెలియ బరచడం జరిగింది.

మదనబాబు—మహామాయ, విద్యాధర సుందరి, నాగ మంజరి.

కుమారి గాయత్రి—రక్తచండి, రత్నాలదీవి, మంత్రదీపం, మాయాద్వీపం, కంకాళదుర్గం

మదనగోపాల్—అగ్ని గుండం, ఇంద్రజాలం, విచిత్రలోయ, భైరవస్వామి.

కిరణ్ కుమారి—త్రిలోక సుందరి, విషసుందరి.

సుహాసిని—సింహధ్వజం

పాణి—ఖడ్గమాల

మధురాధర్—కీలుగుర్రం. కపాల గృహ

రమేష్‌బాబు—ఆకాశ వీరుడు

శ్రీమతి లక్ష్మీరమణ—బంగారు గౌరీపిల్ల

సాయికుమార్—చిరుతమాంత్రికుడు, పిశాచ మంటపం.

విజయకాంత్-మాయావి, అక్షయపాత్ర

మధులత—ఎగిరే గుర్రం

దేవేంద్ర భూచి—తాగుబోతు దెయ్యం

ప్రకాష్—రాణా. చీకటి రాకాసి.

కుమారి-బెబ్బులి

కేశి—కోయదిబ్బ, మాయకప్ప, దానవీర శూర చేప.

యామిని ప్రసన్న—సువర్ణబాల అందాల బాల.

పల్లూరి శివప్రసాద్—మంత్రాల మంత్రి-తంత్రాల సుందరి

భవాని శంకర్-వింతలోకంలో వీరన్న శోకం.

పన్నూరి రాజ్యలక్ష్మి—టక్కరి దొంగ-తిక్కల చక్రవర్తి. రాకాసి వానరం. మార్జాల మంత్రికుడు.

రెంటాల వాగేశ్వరరావు-యంత్రాల పడవ-మంత్రాల గొడవ.

పై నవలలన్ని పిల్లల్లో పఠనాశక్తిని పెంపొందించి బాలల నవలా వికాసానికి తోడ్పడుతున్నాయి.

ఈ నవలలన్నిటితో పాటు జంతువులు పాత్రలుగా గల నవలలు కూడా కొన్ని వెలువడినాయి. కలువకొలను సదానందగారి "బంగారు నడచిన బాట" (1965) యం. ఫిరోజెమగారి 'ఉడుతా ఉడుతా హూష్" (1978), పాతూరి ప్రసన్నం గారి "సుఖీభవ" (1975). శ్రీమతి ధనం గారి అమ్మేకావాలి" (1978). యుగంధర్ గారి "నక్క-జిత్తులు—కుందేలు ఎత్తులు" లాంటి నీతిదాయకమైన నవలలు బాలల నవలా వికాసాని కెంతగానో దోహదం చేసినాయి.

## 2.3 బాలల నవలా వికాసానికి పత్రికల కృషి :

బాలసాహిత్యంలో నవలా ప్రక్రియ వికాసానికి, ప్రచారానికి పత్రికలు ప్రధాన సాధనాలుగా చెప్పుకోవచ్చు. పిల్లల్లో చదివే అలవాటుకు, ఆసక్తిని పెంపొందించడంలో కొత్త కొత్త విషయాలు తెలియజేయడంలో పత్రికలు ఎంతగానో తోడ్పడుతున్నాయి. పిల్లల్లో భాషాభివృద్ధి పెంపొందించడానికి కూడా ఇవి దోహదం చేస్తున్నాయి.

ఈ పత్రికలు 'సాహిత్య ప్రచారానికి గొప్ప సాధనాలు సాహిత్య సృష్టికి ప్రేరణలు. బాలల రచనా శక్తి, భాషానురక్తి, జ్ఞాపకశక్తి, భాషాభివృద్ధికి పత్రికలు ఎంతగానో దోహదం చేస్తాయి.[1] అని బి.వి. నరసింహారావు గారు పిల్లల పత్రికలను వాటి ప్రయోజనాల్ని గురించి వివరించినారు. పిల్లలకోసం వెలువడే పత్రికల్ని పెద్దవాళ్ళు తప్పకుండా పిల్లలకు పరిచయం చెయ్యాలి. తెలుగులో ఇటీవల కాలంలోనే పిల్లల పత్రికలు ఎక్కువగా వస్తున్నాయి. పాశ్చాత్య దేశాలలో ఈ శతాబ్దం మొట్ట మొదటి నుండి పిల్లల పత్రికలున్నటు తెలుస్తున్నది. సోవియట్ దేశంలో పిల్లల పత్రికల విషయంలో చాలా ప్రగతిని సాధించింది ఈ దేశంలో ఎక్కువ పిల్లల పత్రి కలున్నట్లు తెలుస్తున్నది. మనదేశంలో తెలుగులో పిల్లల పత్రికలు తక్కువైనప్పటికి యథోచితంగా పిల్లల నవలా సాహిత్య వికాసానికి తోడ్పడుతున్నాయి. కొన్ని పెద్దల పత్రికలు కూడా పిల్లల శీర్షికలు ప్రవేశపెట్టి బాలసాహిత్యాన్ని, బాలల నవలా సాహి త్యాన్ని ప్రోత్సహిస్తున్నాయి. మొట్టమొదటి సారిగా తెలుగు పిల్లలకు పత్రికల ద్వారా నవలలను పరిచయం చేసింది ఆంధ్ర సచిత్ర వార పత్రిక. ఈ పత్రిక బాలలకు ప్రత్యే కంగా "బొమ్మరిల్లు" అనే శీర్షిక ప్రారంభించి, పిల్లల నవలల్ని ప్రచురించింది. ఆంధ్ర సచిత్రవార పత్రికలో "బొమ్మరిల్లు" శీర్షికలో 1950 నుండి 1953 దాకా "టామ్ సాయర్" హకల్ బెరీఫిన్", "రాజు-పేద", "విచిత్రవ్యక్తి" "మనిషిలో మనిషి" "అల్లీ బిల్లీ లోకంలో అమ్మాయి కథ", లాంటి నవలలు ధారావాహికంగా ప్రచురించి బాలల నవలా వికాసానికి ఎంతగానో తోడ్పడింది.

చందమామ :-

నాగిరెడ్డి, చక్రపాణి గార్ల సంపాదకత్వాన వెలువడిన పత్రిక. అట్టమీద, లోపల

---

1. బాల వాఙ్మయం, పుట 26

రంగు రంగుల బొమ్మలతో ఆహ్లాదకరంగా వెలువడిన పత్రిక. వెలువడిన నాటి నుండి పిల్లలను ఆకట్టుకుని ఎదురు లేకుండా ఇప్పటికీ వెలుగుతున్న పత్రిక. ఈ పత్రిక "విచిత్ర కవలలు", "యక్ష పర్వతము", "రాతి రథము", శిధిలాలయము 'రాకాసి లోయ", "రేచుక్క" "మకర దేవత" "ముగ్గురు మాంత్రికులు" లాంటి పిల్లల నవలలు ప్రచురించి బాలల నవలా వికాసానికి ఎంతగానో తోడ్పడింది. రామాయణ భారత, భాగవతాదులను కూడా పిల్లల కర్థమయ్యే సులభ శైలిలో ప్రచురించి పిల్లలకు ఎంతగానో తోడ్పడింది.

బొమ్మరిల్లు :-

బాలల హృదయాలను రంజింప చేసే రంగు రంగుల బొమ్మలతో విజయ బాపినీడు గారి నాయకత్వాన 1972లో వెలువడిన మాస పత్రిక. ఈ పత్రికలో "సర్ప కన్య" "మృత్యులోయ", లాంటి నవలలు ప్రచురించడమే కాకుండా భారతం భాగవతం లాంటివి కూడా ప్రచురించింది. ఈ పత్రికకు అనుబంధంగా పిల్లల జానపద నవలలు కూడా వెలువడినాయి ఇప్పటికీ వెలువడుతున్న పత్రిక.

బాలమిత్ర :-

జి.వి. రాధాకృష్ణమూర్తి గారి సంపాదకత్వాన 1949లో వెలువడిన మాసపత్రిక ఈ పత్రిక "మాయావి" "విషవలయం", ఉక్కుపిడి" వంటి అద్భుత నవలల్ని ప్రచురించి బాలల మనసుల్ని రంజింప చేసింది. ఈ పత్రిక క్షేత్రమహాత్మ్యాలు, పురాణాలు భాగవతం లాంటివి పిల్లల కర్థమయ్యే రీతిలో ప్రచురించి బాలల నవలా వికాసాని కెంతగానో తోడ్పడింది. ఇది ప్రతినెలా వెలువడుతున్నది.

బాలానందం :-

శ్రీయం. సాయికుమార్ గారి సంపాదకత్వాన వెలువడిన మాసపత్రిక. బంగారు నగరం "బెన్‌హర్" "వృశ్చిక లోయ" వంటి నవలలు వెలువరించింది.

బాల జ్యోతి :-

మొట్టమొదటి సారిగా పిల్లలకు నవలలను పరిచయం చేసిన బాలల నవలా సాహిత్యవేత్త నండూరి రామమోహనరావుగారి సంపాదకత్వాన 1980లో వెలువడిన

మాసపత్రిక. ప్రతినెల "అనుబంధ నవల" అనే పేరుతో ఒక నవలను ప్రచురించి బాలల కెంతో ఉపయోగకరంగా ఉంది. "పరశు రాముడు" "భయపడిన దెయ్యం" "అమృతవల్లి", "కమలుడు_విమలుడు" మొదలైన నవలలెన్నో ప్రచురించి బాలల నవలా సాహిత్య ప్రగతికి దోహదకారిగా వెలుగుతున్నది. "పిశాచగిరి" "పంచతంత్రం" లాంటి బొమ్మల సీరియల్ ప్రచురించింది. ఈ పత్రిక ఉత్తమ బాలల నవలలను ఆహ్వానిస్తూ, బాలల నవలా రచయితలను ప్రోత్సహించే ఉద్దేశంతో ఉత్తమ బాలల నవలలకు బహుమతి ప్రకటించింది. పోటీలో గెలుపొందిన రచనలు వసుంధర రచన "నాకున్నది ఒక చక్కని బొమ్మ". రెంటాల నాగేశ్వరరావుగారి "దక్షిణ ధ్రువయాత్ర అనే వైజ్ఞానిక నవలల్ని సీరియల్స్‌గా ప్రచురించి ఉత్తమ బాలలనవలా వికాసానికి తోడ్పడుతున్నది

బాల రంజని :-

ఆంధ్ర సచిత్ర వార పత్రిక వారి నిర్వహణలో 1985 సంవత్సరంలో వెలసిన మాస పత్రిక. ప్రచురణ కర్త శివలెంక నాగేశ్వరరావు. సంపాదకుడు శివలెంక రాధాకృష్ణ. బుడుతడు, రాము సాహసయాత్ర, కాంచనవల్లి లాంటి నవలలు సీరియల్స్‌గా ఆకర్షణీయమైన పద్ధతిలో ప్రచురిస్తున్నారు ఈ పత్రిక ఇంకా అభివృద్ధి చెంది బాలల నవలా వికాసానికి తోడ్పడగలదని ఆశిద్దాం.

బుజ్జాయి :-

గీతా సుబ్బారావుగారి సంపాదకత్వంలో 1975 లో వెలువడింది. శ్రీనివాస కల్యాణం", "స్పార్టకస్" లాంటి నవలలు ప్రచురించిన బొమ్మల మాస పత్రిక. ఈ సంస్థ అనుబంధ నవలలుగా జానపద బాలల నవలల్ని కూడా విడుదల చేసింది. ఇప్పటికీ వెలువడుతున్న మాస పత్రిక.

వసంత బాల :-

విశ్వ ప్రసాద్ గారి సంపాదకత్వంలో 1974లో వెలువడిన పత్రిక. పిల్లలకు ఉపయోగకరంగా ఉండే నవలల్ని ప్రచురించింది.

బాల భారతి :-

1978లో వి.వి. నరసింహారావు గారి సంపాదకత్వాన వెలువడింది. ఇందులో కూడా కొన్ని నవలలు సీరియల్‌గా వచ్చినాయి.

## 2.4 తెలుగు బాలల నవలా వికాసానికి ప్రచురణ సంస్థల, సాహిత్య సంస్థలకృషి :-

బాలల నవలా ప్రచురణ వికాసానికి సంస్థల తోడ్పాటు, సాహిత్య సంస్థల చాలా అవసరం.

### సాహిత్య సంస్థలు :-

బాలల సర్వతోముఖ వికాసంకోసం ఆంధ్ర ప్రదేశ్‌లో మొట్టమొదట బాలల అకాడమీ నెలకొల్పబడింది. ఈ సాహిత్య సంస్థలు ఉత్తమ బాలల నవలలకు బహుమతులు ప్రకటించి బాలల నవలా వికాసానికి ఎంతగానో తోడ్పడ్డాయి. ఈ సాహిత్య సంస్థలు కొన్ని పుస్తకాలను కూడా ముద్రించి చవకగా, పిల్లలందరికి అందుబాటులో ఉండేలా అందించి, పిల్లల్లో పఠనాశక్తిని పెంపొందించడానికి దోహదం చేసింది.

కలువకొలను సదానంద గారి "బంగారు నడచిన బాట" కు 1966 లో కేంద్ర ప్రభుత్వం ఉత్తమ నవలా బహుమతినిచ్చి ప్రోత్సహించింది.

ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం బాలల నవలా వికాసానికి తోడ్పడే ఉద్దేశంతో బహుమతిని ప్రకటించి చింతా దీక్షితులుగారి "లీలాసుందరి" కి బహుమతి నిచ్చి ప్రోత్స హించింది.

వాసమూర్తి (వారణాసి సత్యనారాయణమూర్తి) "అల్లరిగోపి అద్భుతయాత్ర" నవలకు దక్షిణ భాషా పుస్తక సంస్థ బహుమతి లభించింది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బాలల నవలా రచయిత్రులకు ఉత్తమ నవల లను ఆహ్వానిస్తూ బహుమతులను ప్రకటించింది. ఎ.ఎస్.మణి (అరవింద)గారి "ప్రేమ మంత్రం" కు 1972లో ఉత్తమ పిల్లల నవలగా ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి బహుమతి లభించింది.

1969_70లో కోడూరి లీలావతిదేవిగారి "ఆశాకిరణం" కు, 1970_71లో కంచి రమాదేవి గారి "అనంతంలో అంతం" కు, 1966_67లో కె. రామలక్ష్మిగారి "యువరాజు" కు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతులు లభించాయి

ఇతర సాహిత్య సంస్థలు కూడా కొన్ని ప్రత్యేక సందర్భాలను పురస్కరించు

కొన్ని ఉత్తమ బాలల నవలలకు బహుమతులను ప్రకటించి బాలల నవలా వికాసానికి తోడ్పడ్డాయి.

1975లో ఆంధ్ర జ్యోతి నిర్వహించిన బాలల నవలా పోటీలో పాలంకి వెంకట రామచంద్రమూర్తి గారి "బంగారుతల్లి" కి బహుమతి లభించింది.

ప్రచురణ సంస్థలు :-

ప్రజలకు (పాఠకులకు) రచయితలకు మధ్య ప్రచురణకర్తలు వారధి లాంటి వారు. పత్రికలలో ప్రచురించిన నవలలే గాక, అనేక మంది వ్రాసి పత్రికలలో ప్రచురింప బడ కుండా ఉండే నవలలను పుస్తక రూపాన పిల్లలకు అందించి బాలల నవలా వికాసానికి ఈ ప్రచురణ సంస్థలు ఎంతగానో దోహదం చేస్తున్నాయి.

ఆంధ్ర గ్రంధమాల :-

శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు 1926లో నెలకొల్పినారు. తమ ఆంధ్ర పత్రికలో పిల్లల నవలలను సీరియల్స్‌గా ప్రచురించడమేగాకుండా పుస్తక రూపాన కూడా వెలువరించినారు. "టామ్‌సాయర్" అల్లీ బిల్లీ లోకంలో అమ్మాయి కథ లాంటి పిల్లల నవలలను పుస్తక రూపాన వెలువరించినారు.

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ :-

బాలబాలికలను విజ్ఞాన వినోదాలు కలిగించే మంచి మంచి నవలలను ప్రకటించింది. నార్ల చిరంజీవిగారి పేను-పెసరచేను, గీతా సుబ్బారావు గారి "పారిపోయిన బరాణి", కిషన్‌చందర్ నవలకు జ్ఞానేంద్ర అనువాదం "దాదర్ వంతెన పిల్లలు" అధో ముఖవృక్షం లాంటి నవలలను ప్రచురించింది.

ఆదర్శ గ్రంథమండలి :-

రచయిత, ప్రచురణకర్త అయిన శ్రీ గద్దె లింగయ్య గారు స్వయంగా వ్రాసినవి కొన్ని, ఇతర రచయితల నవలలుకొన్ని ప్రచురించినారు. గద్దె లింగయ్యగారు రావూరి భరద్వాజ గారితో కలిసి రచించిన రతనాల లోయ, పరకాయ ప్రవేశం, కె. సభా గారి "సూర్యం", "పిల్లల రాజ్యం", లాంటి మంచి పిల్లల నవలలు ప్రచురించి పిల్లలలో చైతన్యాన్ని కలిగించింది.

న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్ :-

ఇది విజయవాడలో ఉన్న సంస్థ. మంచి గెటప్‌తో నవలలను ప్రచురించిన సంస్థ. పాతూరి ప్రసన్నం గారి సుఖీభవ, పాలంకి వెంకట రామచంద్ర మూర్తి గారి బహుమతి పొందిన నవల "బంగారు తల్లి", టెంపోరావ్ గారి "డిటెక్టివ్ వాలి సింగం పల్లి అప్పారావుగారి "గలివరు సాహస యాత్రలు" యమ్. పిరోజెమ గారి "ఉడుతా ఉడుతాహూత్" శ్రీపతి ధనంగారి "అమ్మేకావాలి" లాంటి నవలలు ప్రచురించి ప్రముఖ సంస్థగా పేరుపొందింది.

బాలజ్యోతి పబ్లికేషన్స్ :-

విజయవాడలో ప్రముఖ సంస్థ. అంతర్జాతీయ బాలల సంవత్సరంలో వచ్చిన నవలలన్నింటిని పుస్తక రూపంలో ప్రచురించి బాలల నవలా సాహిత్య వికాసానికి తోడ్పడిన ప్రముఖ సంస్థ. సింగం పల్లి అప్పారావుగారి "పిచ్చివాడి అదృష్టం" "సామ్రాట్ అజాత శత్రువు" "సముద్రపు దొంగలు" "మహారాణా ప్రతాపసింహుడు" "ప్రేతాత్మ అబ్దుల్లా" పండరీ బోసుగారి "ఇద్దరు వీరులు", "తారకాసురుడు" గీతాసుబ్బా రావు గారి "పూలమనసులు". "భూలోక సుందరి", బోసుబాబుగారి "రాజభక్తి" ప్రభా వతి పరిణయం" లాంటి నవలలు ప్రచురించిన సంస్థ.

మారుతి పబ్లికేషన్స్ :-

విజయవాడలో నెలకొల్పబడిన సంస్థ. జయశ్రీ మల్లిక్ గారి "సాహసయాత్ర" "మంత్రాలయం", శీతంరాజుగారి "వైకుంఠ ఏకాదశి" నుదురుమాటి వేంకటరమణ శర్మగారి వేణీసంహారము", 1.2 , శీతంరాజుగారి "రౌతుకొద్దీ గుర్రం, విప్లవజ్వాల "ఒకరోజురాజు", బాల్యస్నేహితులు, లాంటి నవలలను ప్రచురించి బాలల నవలా సాహిత్య వికాసానికి సేవ చేస్తున్నది.

ఇంకా బుడుగు బుక్స్, విజయవాడ, మారుతి రామా అండ్ కో, విజయ, వాడ. లీలాపబ్లిషర్స్. విజయవాడ, సమతా సాహితి_విశాఖపట్నం, ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్_విజయవాడ, వాహినీ పబ్లిషింగ్ హౌస్_విజయవాడ, యుగంధర్ బుక్స్_విజయవాడ, దేశి బుక్ డిస్ట్రిబ్యూటర్స్, విజయవాడ, దేశికవితామండలి విజయ వాడ, ఐ యస్. ఆర్. పబ్లికేషన్స్ నెల్లూరు, విశ్వప్రభ ప్రచురణలు, పాకాల, కవితా పబ్లికేషన్స్ ఇంకా ఎన్నో ప్రచురణ సంస్థలు, జిల్లా రచయితల సంఘాలు, బాలల

వలా సాహిత్య వికాసానికి తోడ్పడుచున్నవి.

ఇటీవల కాలంలో చిన్న చిన్న జానపద నవలల్ని బాలల బొమ్మల జానపద నవలలు అనే పేరుతో కొన్ని సంస్థలు వేల సంఖ్యలో ప్రచురించి బాలల నవలా సాహిత్యానికి దోహదం చేస్తున్నాయి. అద్భుత, వినోద. జంతువులు పాత్రలుగా గల నవలలను ప్రచురించి పిల్లల్లో పఠనాశక్తిని పెంపొందింపచేయడానికి సేవచేస్తున్నాయి.

మద్రాసు—

1. పొదరిల్లు పబ్లికేషన్స్
2. అన్నపూర్ణా పబ్లికేషన్స్
3. నవ్వులు—పువ్వులు పబ్లికేషన్స్
4. వికటకవి పబ్లికేషన్స్
5. బుజ్జాయి పబ్లికేషన్స్
6. వి.యం జి. పబ్లికేషన్స్
7. బొమ్మరిల్లు పబ్లికేషన్స్
8. జాబిలి పబ్లికేషన్స్
9. హరివిల్లు పబ్లికేషన్స్
10. బాలభారతి పబ్లికేషన్స్
11. శ్రీవాణి పబ్లికేషన్స్
12. బుడుత పబ్లికేషన్స్
13. ఎస్.యు ఎస్. పబ్లికేషన్స్
14. లక్ష్మి పబ్లికేషన్స్
15. శ్రీకృష్ణ పబ్లికేషన్స్
16. విజయలక్ష్మి పబ్లికేషన్స్
17. బాలప్రియ పబ్లికేషన్స్
18. కుమారి పబ్లికేషన్స్
19. రాజా పబ్లికేషన్స్

విజయవాడ : హనుమాన్ పేట :

1. బాలప్రపంచం.
2. పాపాయి చిల్డ్రన్ బుక్స్

మొదలైన సంస్థలన్నీ పిల్లల నవలల్ని ప్రచురించి తెలుగు బాలల నవలా వికాసానికి మరింత పుష్టిని సమకూర్చుతున్నవి.

తెలుగులో ఆంగ్ల భాషా ప్రభావం వల్ల వెలసిన బాలల నవలలు సుమారు నలభై సంవత్సరాల కాలం నుండి చాలా మంది రచయితల కృషి ఫలితంగా, పత్రికల అభివృద్ధి సంస్థల దోహద ఫలితంగా క్రమపరిణామంలో అభివృద్ధి చెందుతూ, ఒక ప్రత్యేక సాహిత్య ప్రక్రియగా స్థానం ఏర్పరచుకున్నది. బాలల నవల క్రమపరిణామంలో వికాసం చెందిన విధానాన్ని ఈ అధ్యాయంలో చర్చించడమైంది బాలల జానపద నవలా ఇతివృత్తానికి చెందిన అద్భుత నవలల పరిశీలన పక్క అధ్యాయంలో పరిశీలించడం జరిగింది

# 3

# బాలల నవలలు-వర్గీకరణ

## 3.1. బాలల జానపద నవలలు

గద్యకథానాల ప్రభావం వల్ల, మనిషిపై జానపద ప్రవృత్తి కారణంగా వెలసినవే జానపద నవలలు. ముఖ్యంగా జానపద నవలలకు గద్యకథ నాలు మూల రూపాలని చెప్పవచ్చు. జానపదులలోని ఆచార సంప్రదాయాలు, అద్భు తాలు, కల్పన, అవాస్తవికతల కలయికే జానపద నవల. సామాన్యంగా కథాసాహిత్య రచనలో కొంత యదార్థత, కల్పన, పాఠకుల మనస్సులను కదిలించే చైతన్యం ఈ మూడు లక్షణాలుండటం సహజం. సాంఘిక నవలల్లో సంఘంలో జరిగిన లేక జరిగ డానికి వీలున్న సంఘటనలు ఇతివృత్తంగా గృహించబడతాయి. అలాగే చారిత్రక నవ లల్లో గతకాలంలో జరిగిన లేదా ఆయాదేశకాలాలకనుగుణంగా ఆయావ్యక్తుల మధ్య జరగడానికి వీలున్న సంఘటనలు ఇతివృత్తంగా గ్రహింపబడతాయి. పౌరాణిక నవ లల్లో పురాణాలలోని, కావ్యాలలోని సంఘటనలను ఇతివృత్తాలుగా ఎన్నుకుంటారు. కాని జానపద నవలలకు ఇతివృత్తాలు కల్పనలతోనే సాగిపోతుంది. జానపద నవలా రచయిత తన కల్పనా చాతుర్యం వల్ల కథ, వాతావరణం, పాత్రలు కల్పించి శ్రోతల మనస్సులకు సందేశ ఆహ్లాదాలను కలిగించేటట్లు జానపద నవలా రచన చేస్తాడు. మామూలుగా ఈ జానపద నవలలు పిల్లలకోసమే ఎక్కువగా వెలువడినాయి. మామూ

అన్నివర్గాలకు చెందిన నవలల్లో కొన్ని ముఖ్యాంశాలు కన్పిస్తాయి. ఇతివృత్తం. పాత్రచిత్రణ, సంభాషణలు, ఉద్దేశ్యం, వాతావరణం లాంటివి అన్ని రకాల నవలల్లోనూ ఉంటాయి. కాని జానపద నవలల్లో వీటితోపాటు ప్రత్యేకించి చెప్పుకోదగ్గ అవాస్తవికత, కల్పన అనే రెండు లక్షణాలు ఉన్నాయి. మిగిలిన నవలల్లో కల్పన ఉన్నప్పటికీ అవాస్తవికత కన్పించదు. వాస్తవిక జగత్తులోని విషయాలను ఆకర్షణీయంగా ఉండే విధంగా వ్యక్తం చేయడం సాంఘిక నవలల్లో కన్పిస్తుంది. జానపద నవలల్లో కథ, పాత్రలు రచయితలు కల్పించి వ్రాయడం జరుగుతుంది. ఇవి పిల్లలను ఎక్కువ ఆకర్షిస్తాయి. మనకు పేదరాశి పెద్దమ్మ కథలున్నాయి. కాశీమజిలీ కథలున్నాయి, శుకసప్తతి కథలున్నాయి. బేతాళపంచవింశతి కథలున్నాయి. ఈ కథలన్నీ తెలుగు దేశంలో పిల్లల్ని, పెద్దల్ని అమితంగా ఆకర్షించినాయి. కాలక్రమేణా పిల్లలకు ఈ కథా రీతిలో ఉన్న జానపద నవలలు వెలువడినాయి. పిల్లల మనస్సులను ఆకట్టుకోవడమే ఈనవలా రచయితల ఉద్దేశ్యమై ఉండచ్చు. బాలల జానపద నవలల్లోని వివిధాంశాలను-మూలాంశము, మాదిరి సమానాంశాలు, సన్నివేశాలు, పాత్రచిత్రణ మొదలైనవి—పరిశీలించడానికి పూర్వము బాలల జానపద నవలలను ఇతివృత్తాన్నిబట్టి వివిధ రకాలుగా వర్గీకరించి వాటిలోని ఇతి వృతాన్ని పరిశీలిద్దాం.

ఏ నవలకైనా మూలం ఇతివృత్తం. ఈ ఇతివృత్తమే నవలా కల్పనకు ఆధారం. జానపద నవలల్లో రచయిత ఎలాంటి ఇతివత్తాన్ని స్వీకరించాలి? అనే నిబంధన లేదు. రచయిత తన ఇష్టప్రకారం ఇతివృత్తాన్ని స్వీకరించవచ్చు లేదా కల్పించవచ్చు ఈ నవలల్లోని ఇతివృతాలు చిత్రవిచిత్రమైన సన్నివేశాలతో, అద్భుతాలలో చిత్రింపబడతాయి. ఈ ఇతివృతాలు మామూలు నవలా ఇతివృత్తాలకన్నా పిల్లల మనస్సులను ఎక్కువ ఆకర్షించి, అలరింపచేస్తాయి.

ఇతివృత్త వైవిధ్యాన్ని బట్టి జానపద నవలలను క్రింది విధంగా వర్గీకరించవచ్చు

1. బాలల అద్భుత నవలలు
2. పశుపక్ష్యాదులు పాత్రలుగా గల బాలల నవలలు
3. బాలల వినోద నవలలు.

### 3.1.1. బాలల అద్భుత నవలలు :-

జానపద నవలల్లో అద్భుత నవలలు అధిక ప్రచారాన్ని పొందినాయి. దేవతలు

మాంత్రికులు, కొత్తలోకాలు, సహజంగా ఉన్న విచిత్రవిషయాలను చెప్పే వాటని "అద్భుత నవలలు" అంటారు. దేవతల కథలు ఎక్కువగా చదివిస్తే అవి పిల్లలను ఉద్రిక్తులను చేసి వారి ఊహాపోహలకు దోహదం ఉద్దేశ్యంతోనే తెలుగులో ఈ నవలలు వెలసినాయి. అద్భుత నవలల్లో వాస్తవికత ఉండదు. చాలా సందర్భాల్లో వాస్తవం చేదుగా ఉంటుంది. కల్పన ఆనందంగా, అద్భుతంగా ఉంటుంది. ఇలాంటి అద్భుతాలంటే పిల్లలు చాలా ఇష్టపడతారు ఈ అద్భుత నవలల్లో వాస్తవంకంటె విచిత్రమైన ఊహ ప్రధానం. ఈ నవలలో రాజకుమారులు. మంత్రులు. మాంత్రికులు మంత్ర తంత్రాలు, రాజభవనాలు, అంతఃపురాలు, ఎక్కువగా కనిపిస్తాయి. అన్నిటి కన్నా ఎక్కువగా సాహస ప్రవృత్తి కనిపిస్తుంది, మానవాతీత శక్తుల పాత్ర ప్రధానంగా ఉంటుంది. జానపద నవలల కల్పనకు ప్రాణసమానంగా ఉండే మూలాంశాలు ఈ అద్భుత నవలలో వందలకొద్దీ కనిపిస్తాయి. అక్కడక్కడ హాస్యంకనిపించినా మొత్తం మీద ఇవి గంభీరంగా ఉంటాయి. యక్షులు, గంధర్వులు దేవతలు, కిన్నెరులు, రాక్షసులు పిశాచాలు సర్వసాధారణంగా కనిపించే పాత్రలు. ఈ నవలలో కల్పనకు అవకాశాలుండే అన్ని అంశాలు కనిపిస్తాయి. ఈ నవలలోని సన్నివేశాలు కథారంగాలు ఒక ప్రదేశం నుండి ఇంకొక ప్రదేశానికి చాలా వేగంగా ప్రవేశిస్తాయి. జానపద నవలా ప్రపంచంలో ఈ అద్భుత నవలలకు చాలా ప్రాధాన్యం ఉంది. ఇవి పిల్లలను ఎక్కువగా ఆకర్షిస్తాయి

బాల సాహిత్య బ్రహ్మగా వినుతికెక్కిన చింతా దీక్షితులుగారు పిల్లలకు మొట్ట మొదటి సారిగా అద్భుత నవలల్ని" పరిచయం చేసినారు. వీరు వ్రాసిన "గోపి మోహిని లీలా సుందరి, శంపాలత" గొప్ప అద్భుత నవలలుగా పేరుపొందినాయి. వీరి రచనలో "గోపి మోహిని" (1955), చాలా ప్రసిద్ధమైన అద్భుత నవల.

శివనాయకుడు ఒక రాకుమారుడు. అతనికి ఇంద్రజాల విద్యలు నేర్చుకోవాలని ఆసక్తిగా ఉండేది. ఒకరోజు అతనికి ఒక ముసలివాడు కనిపించి హిమాలయ పర్వతాలో మంచు గుహల్లో ఒక ముని తపస్సు చేసుకుంటూ ఉంటాడు ఆతన్ని ఆశ్రయిస్తే శివనాయకునికి ఇంద్రజాల విద్యలు నేర్పగలడని చెబుతాడు ఆరాకుమారుడు అడవులను దాటి అనేక కష్టాలకోర్చి రాక్షసులను జయించి హిమాలయాలను చేరుకుని అన్ని విద్యలు నేర్చుకుంటాడు సమీప రాజ్యంలోని గోపిమోహినిని చెర విడిపించి వివాహం చేసుకోవడంతో నవల సుఖాంతమవుతుంది

పట్టుదల, శ్రద్ధ ఇవి రెండు ఉంటే ఏపనికైనా సునాయాసంగా సాధించవచ్చని ఈ నవల నిరూపిస్తుంది

చింతా దీక్షితులుగారి "లీలా సుందరి"[1] చిన్నపిల్లల మనస్తత్వాన్ని చిత్రించే చక్కని నవల. వనబాల (చీకటి జీమూతం) అనే రాక్షసి తన కుమార్తెను పోగొట్టుకున్న కనిపించిన ఆడపిల్లలందర్ని మాయోపాయంతో ఎత్తుకొనిపోయి వాళ్ళతో ఆడుకుని కొన్నాళ్ళకు వాళ్ళను చిలుకలుగ, గోరువంకలుగ, బాతులుగా, జింకలుగ మార్చేసి తన గుహలో ఉంచుకునేది. లీలాసుందరి అనే బాలికను ఎత్తుకొనిపోయి బంధిస్తుంది వివేకం గల లీలా సుందరి ఆ రాక్షసినుండి కొన్ని రహస్యాలు తెలిసికొని, ఆమెదగ్గర నున్న మాయాబంగారుకడీని అపహరించి, రాజమౌళి అనే రాకుమారుని సాయంతో తనతోటి బాలికలను విడిపించుకొని తలిదండ్రులను కలుసుకుంటుంది. రాజమౌళి లీలాసుందరుల వివాహంతో నవల సుఖాంతమవుతుంది.

బుద్ధి బలంతో ఎలాంటి కార్యాలయినా సాధించవచ్చని ఈ నవల నిరూపిస్తుంది నవలలోని భాష, భావం పసిపిల్లల హృదయాల్ని చక్కగా అంటుకొని నవలను చివరి వరకు చదివిస్తాయి.

చింతా దీక్షితులుగారి మరొక రచన "శంపాలత"[2]. ఒక ఊళ్ళో ఒక కాపువాడు అతని భార్య ఉండేవారు. వాళ్ళకి పిల్లలు లేరని చాలా బాధపడుతుండేవారు. ఒక రోజు కాపుభార్యకు కలలో మల్లిఖార్జునస్వామి కనిపించి, ఎవరైనా ఆమె కడుపున పుట్టడానికి ఒప్పుకుంటే ఆమెకు సంతానం కలుగుతుందని చెప్పి అంతర్థానమవుతాడు. భార్యాభర్తలిరువురూ దారిలో కనిపించిన వారినందరిని అడగ్గా చివరకు బ్రహ్మరాక్షసులు వారి కడుపున పుట్టడానికి ఒప్పుకుంటారు, ఫలితంగా వారికి శంపాలత, నీరద శ్యాముడు జన్మిస్తారు. ఒకరోజు తండ్రితో పొలంలో ఆడుకుంటున్న శంపాలత, నీరద శ్యాముడు మాయమవుతారు. వారికి ఒక నాగకన్య బంగారు, రత్నాలు ఇవ్వగాఅమ్మా, నాన్నలను వెతుక్కుంటూ శ్రీశైలం చేరుకుంటారు. పాతాళగంగ గట్టుమీద శంపాలతనుకూర్చుండబెట్టి నీరద శ్యాముడు తల్లిదండ్రుల కోసం నీటిలో మునిగిపోతాడు

---

1. త్రివేణి పబ్లిషర్స్, మచిలీపట్నం, 1953.
2. కల్చరల్ బుక్స్ లిమిటెడ్, మద్రాసు, 1956.

నాగకన్య నీరదశ్యాముణ్ణి నాగలోకానికి తీసుకు వెళ్తుంది. నాగకన్యకకు, నీరదశ్యామునికి వివాహం జరుగుతుంది. శంపాలత ఎంతో కాలం అన్నకోసం వెతుకుతూనే చిన్నపక్షిగా మారి శ్రీశైలం అడవుల్లో తిరుగుతూ "ఓఅన్నా! ఓఅన్నా" అని పిలుస్తూనే ఉంటుంది ఇప్పటికి ఆ శబ్దం వినబడుతుందని కొందరంటారు.

శంపాలత నవల లోని బొమ్మలు ఆకర్షణీయంగా ఉండి. పిల్లలను ఆకట్టు కుంటాయి.

గాత్రసుందరనే మత్స్యకన్య భూలోకంలో ఒకరాకుమారుణ్ణి ప్రేమించి అతని కోసం ప్రాణాలర్పించిన గాథే కె సభాగారి "మత్స్యకన్యలు"

మహా సముద్రానికి అట్టడుగున ఒక సుందరలోకంలో నడుముక్రింది భాగమంతా చేపతోక కల్గిన ఆరుగురు మత్స్యకన్యలుండేవారు. వాళ్ళందరిలోకి సౌందర్యవతి గాత్ర సుందరి ఒకరోజు ఆమె సముద్రంపైకి వచ్చి ఓడలో మునిగిపోతున్న రాకుమారుణ్ణి రక్షించి ఒడ్డుపైన పడుకోబెడ్తుంది కొంతమంది రాజకుమార్తెలు అతన్ని తీసుకువెళ్ళారు తనగాత్రాన్ని మంత్రగత్తెకు సమర్పించి, ఆమెసాయంతో మనిషిలాగా కాళ్ళను పొంది భూలోకంలో రాజకుమారుణి కల్సుకుంటుంది. కాని రాజకుమారునికి, అతడు ప్రేమించిన భూలోక సుందరికి వివాహం జరుగుతుంది. వివాహం జరిగిన మరుసటి ఉదయమే మంత్రగత్తె చెప్పిన విధంగా గాత్ర సుందరి మరణించి నురుగులో కలిసి పోతుంది.

ఈ నవల రాజకుమారుని కోసం తన సుందర గాలాన్ని పోగొట్టుకుని, శ్రావ్యమైన తనకంఠాన్ని మంత్రగత్తెకు సమర్పించి, తనవారినందరిని వదులుకొని భూలోకానికి వచ్చి, రాజకుమారుని సౌఖ్యంకోసం ప్రాణాలర్పించిన గాత్రసుందరి త్యాగబుద్ధి చిత్రితమైనది

శీతంరాజుగారి "ఒక రోజు రాజు"[1] చివరి వరకు ఉత్సుకతతో సాగిన నవల.

---

1 కవితా పబ్లికేషన్స్, విజయవాడ 1957

2. మారుతి పబ్లికేషన్స్, విజయవాడ, 1979.

భద్రగిరి నగరాన్ని అరుణసింగ్ పరిపాలిస్తూ ఉండేవాడు. అతని భార్య చందన సంతానం లేదని బాధనడుతుండేవారు. ఒకరోజు పంచకల్యాణి మీద విహారానికి వెళ్ళిన రాజుని మాయావి భైరవుడు బంధించి, భద్రగిరికి చక్రవర్తి అవుతాడు. రాజు భక్తి గల పంచకల్యాణి రాజముద్రికను భైరవునికి దొరకనీయకుండా, అరుణసింగ్ గురువైన పరబ్రహ్మమహర్షి చేర్చుతుంది. ఆయన విషయాన్నంతా గ్రహించి తాను పెంచిన సంజయుడనే బాలునికి రక్షాబంధం కట్టిపంపుతాడు. ముని కట్టిన రక్షాబంధం మహిమ వల్ల సంజయుడు ఎవరికి కనబడకుండా భైరవునికి కొలువులో ప్రవేసించి, తనదగ్గర రాజముద్రికఉందని, తనని ఒక రోజురాజుగ చేస్తే ఆ ముద్రికను ఇస్తానంటాడు. భైరవుడు రాజుని చేయగా, అతని మాయమంత్రాలకు కారణమైన ఎముకను లాక్కొని భైరవుని బంధించి; ఆ ఎముక సాయంతో అరుణసింగ్‌ని విడిపిస్తాడు, అరుణసింగ్ సంజయుని రాజుగా అంగీకరించి, కరుణ నిచ్చి వివాహం జరిగిపించండం ఇందలి ఇతివృత్తం.

ఈ నవల "దురాశ దుఃఖమునకు చేటు" అని నిరూపిస్తుంది. భైరవుని దురాశ అతని నాశనానికి కారణమవుతుంది.

విద్వాన్ దేవరకొండ చిన్నకృష్ణశర్మ గారు పిల్లలకోసం "ఆనందలహరి" అనే నవలను వ్రాసినారు

గిరి దుర్గాన్ని పాలించే బలవర్ధనుడు మనుమడి చేతడి తనకు మరణం సంభవిస్తుందని తెలుసుకుని కుమార్తె శ్రీదేవిని, ఆమె బిడ్డను పెట్టిలో పెట్టి సముద్రంలో వదిలేస్తాడు. ఆ పెట్టె సింహళ్ళ ద్వీప వాసియైన మత్స్యకేతువుకు దొరకగా, ఆబాలునికి హర్షవర్ధనుడని నామకరణం చేసి, యోధానుయోధాయనిగా తీర్చి దిద్దుతాడు. దురంతముఖి అనే రాక్షసిని చంపడానికి దేవి ఎదుట ఆత్మాహుతికి ప్రయత్నించగా, దేవి ప్రత్యక్షమై మహిమగల పాదుకలు, ఇత్తడి డాలు, కత్తి గల ఒక చర్మపు సంచి ప్రసాదిస్తుంది. పాదుకలు ధరించి ఆకాశంలో ప్రయాణిస్తూ సంధ్యాదేవి పుత్రికల ద్వారా విచిత్రపు తలపాగా పొంది రాక్షసి దురంతముఖిని సంహరిస్తాడు. తిరుగు ప్రయాణంలో జలభూతాలన్నుండి ఇందుముఖిని రక్షించి వివాహం చేసుకొని సింహళ ద్వీపం చేయు

---

1. ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్, విజయవాడ 1957

కుంటాడు. తన తాతగారిని గిరిదుర్గంలో కలుసుకుంటాడు. తన శక్తి సామర్థ్యాలు నిరూపించడంలో ప్రత్యర్థి కత్తి ముక్కలు చెయ్యగా, ఆ కత్తి ముక్క తగిలి బలవర్ధనుడు మరణిస్తాడు. హర్షవర్ధనుడు గిరిదుర్గానికి చక్రవర్తియై ప్రజానురంజకంగా పరిపాలిస్తాడు.

"ధైర్యేసాహసే లక్ష్మి" అని ఈ నవల నిరూపిస్తుంది. హర్షవర్ధనుడు ధైర్య సాహసాలతో తన మనో సంకల్పాన్ని నెరవేర్చుకుంటాడు.

గద్దెలింగయ్యగారు, రావూరి భరద్వాజగారు పిల్లలకోసం వ్రాసిన నవల "పరకాయ ప్రవేశం"[1]

నందుడనే రాకుమారుడు, శివశర్మ అనే బీద బ్రాహ్మణుడు ఒకే గురువు దగ్గర విద్య నభ్యసించినవారు. ప్రాణస్నేహితులు. శివశర్మ దారిద్ర్యబాధతో నందుడిని చూడడానికి వెళతాడు. వాళ్ళిద్దరూ పరకాయ ప్రవేశం ద్వారా ఒకరి శరీరంలో ఒకరు ప్రవేశించి మారి పోతారు. ఒకరి స్థానంలో మరొకరు కొన్ని నెలలపాటు అలాగే ఉండిపోతారు. శివశర్మ స్థానంలో ఉంటున్న నందుడికి దరిద్రసాగరాన్ని ఈదడానికి సాధ్యం కాలేదు. నందుడిరూపంలో ఉంటున్న శివశర్మకు ఆకట్టుబాట్లు నచ్చలేదు. రాజుకు పిచ్చిపట్టిందని శత్రురాజులు యుద్ధం ప్రకటిస్తారు. అది విన్న నందుడు రాజధానికి శత్రువులను ఓడించి తరిమేస్తాడు శివశర్మకు అంతులేని ధనరాసులిచ్చి ఇంటికి సాగనంపుతాడు

స్నేహబంధానికి అంతస్తులు అడ్డురావు అని ఈ నవల నిరూపిస్తుంది

బోసుబాబుగారి "రాజభక్తి"[2] లో విశాల దేశ రాజైన విక్రమసేనునికి సత్యవ్రతుడనే ముని దీవెనల వలన ప్రతాపుడనే పుత్రుడు ప్రమోద అనే పుత్రిక జన్మిస్తారు ప్రతాపుడు మంత్రి కుమారుడు చంద్రకాంతుడు ప్రాణస్నేహితులు వీరాధి వీరులు చంద్రకాంతుడు ప్రమోద ప్రేమించుకుంటారు భీషణకేతనే మాంత్రికుడు ప్రమోదను బంధిం

---

1. ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.
2. బాలజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ 1979

చగా ఆ నేరం చంద్రకాంతుని మీదకు వస్తుంది ప్రతాపుడు ప్రమోదను వెతుకుతూ పోతుండగా, సుడిగాలిలో ఇద్దరూ విడిపోయి, ప్రతాపుడు దేవకాంతల విమానం ద్వారా దేవలోకానికి చంద్రకాంతుడు భీషణకేతు గుహకు చేరుకుంటారు. చంద్రకాంతుడు ప్రమోదను రక్షించాలనుకుని భీషణకేతు శాపంతో శిలగా మారిపోతాడు మోహిని మాయాలు భీషణకేతుని మెప్పించి ప్రమోదను చంద్రకాంతుణ్ణిరక్షిస్తాడు అందరూ పుష్ప క విమానంలో విశాల దేశానికి చేరుకుంటారు దేవేంద్రుని కుమార్తె మోహిని ప్రతాపుల చంద్రకాంత ప్రమోదల వివాహంతో నవల సుఖాంతమవుతుంది.

'దుష్టశిక్షణ-శిష్టరక్షణ' అని ఈ నవలనిరూపిస్తుంది బోసుబాబుగారు 'ప్రభావతి పరి ణయం"[1] "అనే నవలను వ్రాసినారు విశాల దేశపు రాకుమార్తె ప్రభావతిని ఆమె చెలి కత్తె గిరిజను భీషణ కేతు మాంత్రికుడు అపహరిస్తాడు గిరిజ తప్పించుకుపోగా శార్దూ లకీ ద్వారా ఎక్కడుందేది కనిపెట్టి మంత్రదండంతో కోతిగా మార్చేస్తాడు చందన శాంతక యువరాజు మణిభూషణుడు ప్రచండుడు ప్రభావతిని అన్వేషిస్తూండగా భీషణకేతు బంధిస్తాడు ప్రచండుడు మణి భూషణుణ్ణి కలుసుకుని భీషణకేతు ప్రాణం మలయ పర్వ తప్రాంతంలో పంచాక్షి చెరువులో ఒక చిలుకలో ఉందని అది తేగల సమర్థుడు ఒక్క మణిభూషణుడే అని చెబుతాడు. భీషణకేతు ప్రాణం ఉన్న చిలుకను తెచ్చి చంపగానే మాంత్రికుడు మరణిస్తాడు. ప్రభావతిని మణిభూషణుడు గిరిజను ప్రచండుడు చంద నను గోపతి వివాహమాడడంతో నవల సుఖాంతమవుతుంది.

మంచివారికి విజయం దుష్టులకు అపజయం తప్పదని ఈ నవల నిరూపి ంది.

పండరీబోసుగారి "ఇద్దరు వీరులు"[2] చక్కటి పిల్లల నవల అవంతీదేశాన్ని అక్రమంగా ఆక్రమించుకుని రాజుగా ప్రకటించుకుంటాడు దండనాయకుడు విక్రమవర్మ రాజు ప్రభాకరుడు కోయగూడెంలో దలణుచుకొని తన కొడుకు దివాకరుని యోధాను యోధునిగా తీర్చిదిద్దుతాడు విక్రమవర్మ తన కూతురు విద్యవతికి స్వయం వరం చాటిం చగా, దివాకరుడు అన్ని పరీక్షల్లో నెగ్గి విద్యావతిచే వరింపబడతాడు దివాకరుడెవరో తెలుసుకొని విక్రమవర్మ బంధించేలోగా రాకుమారితో దివాకరుడు పారిపోతాడు రాకు మార్తెను మరాళ మాంత్రికుడు అపహరిస్తాడు దివాకరుడు తన సోదరుడునితో కలసి

---

1. బాలజ్యోతి పబ్లికేషన్, విజయవాడ, 1979

రాకుమార్తెను వెదుకుతూ బయలుదేరుతారు దారిలో ఒక ముని ఆగ్రహానికిగు సుధాకరుడు శిలగా మారిపోతాడు మరాళ మాంత్రికుడు శాకినీ క్షుద్ర శక్తి నాశించి బంధించిన నలభైమంది రాకుమార్తెలను దివాకరుడు విడిపించి మాంత్రికుని పట్టుకొడగొట్టి నాలుకను కోసేస్తాడు దివాకరుడు సుధాకరుడు కలిసి కోటను స్వాధీనం చేసుకుంటారు విద్యావతి దివాకరుల వివాహంతో నవల సుఖాంతమవుతుంది.

నమ్మిన వారిన ద్రోహం చేసినివారు ఎప్పటికైనా శిక్ష అనుభవిస్తారని ఈ నవల తెలుపుతుంది

అలెగ్జాండరుగారి బాలల బొమ్మల అద్భుత నవల "రత్నాల దీవి"[1] కళింగ దేశాన్ని పరిపాలించే చారుచిత్తుని వ్యాధికి రత్నాల దీవిలో ఉన్న మంత్రజలాన్ని తేవడానికి చారుచిత్తుని కుమారులు చారుదత్తుడు, ఉగ్రసేనుడు బయలుదేరుతారు. సముద్ర ప్రయాణంలో ఉగ్రసేనుడు చారుదత్తుణ్ణి సముద్రంలోకి తోసేస్తాడు. ఎలాగో బ్రతికి బయటపడి తమ్ముణ్ణి కలుసుకుంటాడు వాళ్ళిద్దరూ అడవిలో నిద్రపోతుండగా ఉగ్రసేనుడు వచ్చేస్తాడు. దారిలో మరుగుజ్జు కోపానికి గురై పిట్టగా మారి పోతాడు. చారుదత్తుడు ఆ మరుగుజ్జు సాయంతో రత్నాలదీవికి దారి తెలుసుకుని, మంత్రగత్తె బంధించిన మగధదేశపు రాకుమార్తెను రక్షించి మంత్ర జలంతో తిరిగి వచ్చేటప్పుడు మరుగుజ్జుకు మంత్రజలాన్నిచ్చి శాప విముక్తుణ్ణి గావించి, తమ్ముణ్ణి మామూలుగా మార్చుకుని వస్తూండగా, ఉగ్రసేనుడు అన్నను మోసగించి మంత్రజలాన్ని మార్చేస్తాడు. నిజం తెలుసుకోకుండా రాజు చారుదత్తుణ్ణి బంధిస్తాడు. మగధ దేశపు రాకుమార్తె రాకతో నిజం తెలుసుకుని ఉగ్రసేనుణ్ణి ఉరితీయించి, ఆమెతో చారుదత్తుని వివాహం జరిపించడం ఇందలి చివరి సన్నివేశం.

మోసం నాశనానికి దారితీస్తుందని ఈ నవల నిరూపిస్తుంది. ఉగ్రసేనుని మోసం అతని నాశనానికి దారి తీసింది.

శీతం రాజుగారి బాలల బొమ్మల అద్భుత నవల "వీరమల్లుడు సాహసాలు"[2]

---

1. ఐ.యస్.ఆర్. పబ్లికేషన్స్, నెల్లూరు
2. ఐ యస్.ఆర్. పబ్లికేషన్స్, నెల్లూరు

జయంతి నగరంలో గోపయ్య మల్లుడి కొడుకు వీరమల్లుడు. తండ్రి గారాబం వల్ల సోమరి పోతుగా ఆకతాయిగా తయారవుతాడు. ఒకరోజు రాకుమారుడు చేసిన అవమానం ఎగతాళితో తండ్రి మరణంతో అతనిలో పట్టుదల ప్రవేశిస్తుంది. తన తెలివి తేటలతో దేవి అనుగ్రహం వల్ల "వికాసిని" మణిని హస్తగతం చేసుకుంటాడు. ఆ మణి ప్రభావం వల్లన పండితుడవుతాడు. రాజధాని చేరి తనను అవమానించిన యువరాజుకు బుద్ధి చెప్పి జయంతి నగరానికి ఆస్థాన పండితుడవుతాడు. జగదీశ్వరిని వివాహమాడి ఆనందంగా ఉండడం ఇందలి ఇతివృత్తం.

ఎదుటి వ్యక్తి ఎలాంటి వాడయినా చులకన చేయగూడదు. పట్టుదల ఉంటే దేన్నయినా సునాయాసంగా సాధించవచ్చని ఈ నవల నిరూపిస్తుంది. ఆకతాయి వీర మల్లుని పట్టుదల అతన్ని మహాపండితుణ్ణి, మహావీరుణ్ణి చేసింది.

కిరణ్‌కుమార్ గారి "చందమామ రావే"1 బాలల బొమ్మల జానపద నవల. మహేంద్రవరాన్ని చంద్ర చూడుడనే రాజు పాలించేవాడు. చంద్రునివరం వల్ల చంద్రచూడునికి చంద్రపాలుడు, సూర్యుని వలన మంత్రికి సూర్యప్రతాపుడు జన్మిస్తారు. చంద్రపాలుడు పిరికివాడు. సూర్యప్రతాపుడు ధైర్యసాహసాలు గలవాడు. ఒక రోజు కేతువు అనే రాక్షసుడు చంద్రపాలుణ్ణి ఆ రాజ్యంలోని పిల్లలందర్ని అపహరించుకొని పోతాడు పిల్లలందరూ కలిసి చంద్రుణ్ణి "చందమామ రావె" అని చంద్రుణ్ణి ప్రార్థించగా, చంద్రుడు చంద్రపాలునికి అమిత ధైర్యసాహసాలు ప్రసాదిస్తాడు. చంద్రపాలుడు కేతువును, రాక్షసుల్ని వధించి తలిదండ్రులను చేరుకుంటాడు.

ధైర్యసాహసాలుంటే ఏపనినైనా సాధించవచ్చునని ఈ నవల తెలుపుతుంది

బాలబాలికలను ఆనంద లోకాల్లో విహరింప జేసే నవల శీతంరాజుగారి "రౌతు కొద్దీగుర్రం"2 చంద్రగిరి రాజు గుణవర్మ భార్య శీలవతి కుమారుడు విజయవర్మ విజయ వర్మ వల్ల అక్కలు చామంతి, ముద్దబంతి పూబంతి మాయమవుతారు అక్కలను వెతుక్కుంటూ బయలుదేరి ఒక యోగిని మెప్పించి దారపు ఉండను సంపాదించి అక్కలను చూడగలుగుతాడు రాగి కొండమీద తన పెద్దక్క, శాపవశాత్తు గ్రద్దరూపంలో ఉన్న

---

1. ఐ.యస్.ఆర్ పబ్లికేషన్స్, నెల్లూరు
2. మారుతి పబ్లికేషన్స్ విజయవాడ, 1979

భర్తతో, రెండో అక్క వెండికొండమీద ఎలుగుబంటి భర్తతో, చిన్నక్క బంగారు కొండమీద మొసలి రూపంలో ఉన్న భర్తతో ఉంటారు. విజయవర్మ తన బావలకు సూర్యకుమార్తె ద్వారా శాపవిముక్తి లభిస్తుందని తెలుసుకొని, వారిచ్చిన రుమాలు బంకసీసా సాయంతో సూర్యకుమార్తెను కలుసుకొని ఆమెను వివాహం చేసుకుంటాడు. కర్కోటక రాక్షసుడు సూర్యకుమార్తెను అపహరించుకుని పోతాడు. ఆమెను వెతుక్కుంటూ దారిలో మంత్రగత్తెను మెప్పించి గుర్రం సంపాదించి, తూర్పుసముద్రం చేరుకుని రాక్షసుని ప్రాణం వున్న బాతు గుడ్డును నాశనం చేసి, రాక్షసుణ్ణి చంపి సూర్యకుమార్తెను తీసుకొని తన బావలకు విముక్తి కలిగించి, చంద్రగిరి చేరుకుని రాజై రాజ్యపాలన చేస్తాడు.

జయశ్రీ మల్లిక్ గారి రచన "మంత్రాలయం"[1] మాళవ దేశాన్ని కిశోర సింహుడు పరిపాలిస్తు ఉండేవాడు. మంత్రి మణివర్మకు మాంత్రికుడు కావాలనే కోరిక ఉండేది. రాజ్యంలో కల్లోలం సృష్టిస్తాడు. మణివర్మ కేశపాలుడనే మాంత్రికుణ్ణి ఆశ్రయిస్తాడు. కేశపాలుడు తలపెట్టిన మారణహోమానికి వెయ్యి మంది పతివ్రతా స్త్రీలను బలిపెట్టాలి. చివరిగా మణివర్మ భార్య మేఖల అతని దృష్టిలో పడుతుంది. మేఖల కలలో నాగేంద్రుడు కనిపించి పారిపొమ్మంటాడు. మేఖల పారిపోయి ఒక మునిని ఆశ్రయించి ఆముని సాయంతో తన కొడుకు నాగేంద్రను అణిమాది, అష్ట సిద్ధులతో సిద్ధహస్తుడిగా తయారు చేస్తుంది. నాగేంద్రుడు మణివర్మను, కేశపాలుణ్ణి సంహరించి మాళవ దేశాన్ని చేరుకుంటాడు.

కుటిల స్వభావులకు నాశనం తప్పదని ఈ నవల తెలుపుతుంది.

సింగంపల్లి అప్పారావుగారి పిల్లల నవల 'సముద్రపు దొంగలు"[2] కేరళదేశాన్ని కులదీపుడు పరిపాలించేవాడు. ఆ రాజ్యంలో కృష్ణాపురం అనే ఊళ్ళో "రాజమల్లు" అనే బెస్తవాని కొడుకులు గోవర్ధనుడు, విశ్వనాథుడు. కూతురు అపరంజి. పెద్దవాడైన గోవర్ధనుడు మాధవ స్వామితో చేపలు పట్టడానికి సముద్రం పైకి వెళ్ళేవాడు. ఒక రోజు వాళ్ళకు సముద్రంలో ఒక సీసా కొట్టుకు రావడం కనిపిస్తుంది. ఆ సీసాలో కాగితపు పొట్లంలో కొన్ని వెంట్రుకలు ఉంటాయి. ఆ కాగితం మీద కాంచనరేఖ అనే

---

1. మారుతి పబ్లికేషన్స్, విజయవాడ, 1979.
2. బాలజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, 1979

మయూరి ద్వీప రాకుమారి పయనించే పడవ తుఫానులో చిక్కుకోగా తాను మాత్రం ఒక ద్వీపాన్ని చేరినట్లు, తనని రక్షించమని అందులో ఉంటుంది. గోవర్ధనుడు, మాధవస్వామి, విశ్వనాథుడు, అపరంజి ఒక పెద్ద పడవ అద్దెకు తీసుకొని రాకుమారిని వెదుక్కుంటూ బయలుదేరి, కనుక్కుంటారు. సముద్రపు దొంగల బారినుండి ఆమెను కాపాడి తండ్రి దగ్గరకు చేరుస్తారు. బాల్యంలో తప్పిపోయిన గోవర్ధనుడు కులదీపుని కొడుకని తెలుస్తుంది. గోవర్ధన, కాంచన రేఖల వివాహంతో నవల సుఖాంతమవుతుంది

ఆపదలో ఉన్నవారిని ఆదుకుంటే దేవుడు మనకు మేలు చేస్తాడని ఈ నవల నిరూపిస్తుంది.

ఆలూరి భుజంగరావుగారి బాలల బొమ్మల నవల 'అంతాగమత్తు'[1] తండ్రి చనిపోయే నాటికి రాముడికి పదేళ్ళు. తల్లి తప్ప ఇంకే సంపదా లేనివాడు. ఆ ఊరి రాజు సైన్యంలో చేరమని నిర్బంధిస్తాడు. ఆ రాజు నిరంకుశ పాలన రాముకు నచ్చదు. ఒకరోజు ఉన్న ఒక్క ఆవును గ్రామాధికారికమ్మి, అతనిచ్చిన మూడు విత్తనాలను భూమిలో పాతిపెట్టాడు. ఉదయం లేవగానే భూమిలోకి చొచ్చుకొని పోయిన మొల్చిన చెట్టును చూసి దాన్నెక్కి సొరంగంలోకి దిగిపోతాడు. అలా ప్రయాణించి ధూమ్రవర్ణుడను రాక్షసుణ్ణి కలుసుకుంటాడు. అక్కడనుండి ప్రయాణించి అన్ని అంగళ్ళు యంత్రాలతో నడిచే పటణాన్ని చేరుకుంటాడు. ఆ పట్టణంలో ఉంటున్న ఒకే ఒక బాలుడు సుధీర్‌తో బయలుదేరి స్వర్ణ దేహుడనే రాక్షసుణ్ణి చూస్తాడు. అ పట్టణంలో కొందరు ఒక మ్మాయిని వేలం పాడడం చూస్తారు. ఆ అమ్మాయి పేరు మల్లిక. ఏడిస్తే ముత్యాలు రాలుతాయి. మల్లికను రక్షించి అక్కడినుంచి ప్రయాణించి ఒక గమ్మత్తయిన నగరాన్ని చేరుకుంటారు. ఆ నగరంలో ప్రతిరాత్రి కొంతమందిని పాము కాటువేసి చంపుతుండేది. అదేమిటో కనుక్కోవాలని ప్రయత్నించిన రాముణ్ణి పాము కాటేస్తుంది. నిద్రాళుడి రాజ్యంలోని ఒక శివాలయ పూజారి మెడలోని మాణిక్యాన్ని తాకిస్తే రాముడు బ్రతుకుతాడని ఒక వృద్ధుడు చెబుతాడు సుధీరు అక్కడకు చేరుకుని నిద్రాళుడి రాజ్యంలో బందీ అవుతాడు. మల్లిక వెండి బెత్తం సహాయంతో సుధీర్‌ను విడిపించి, మాణిక్యాన్ని తెచ్చి రాముడుకు తాకించగా రాముడు బ్రతుకుతాడు. తల్లిని బాధించి అ ఇంటిని దోచు

1. శ్రీనివాస పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1962

కుంటున్న సమయంలో అందరూ అక్కడికి వస్తారు. రాజుని సొరంగంలో తోసి ప్రజలంతా సంతోషంతో ఆ సొరంగాన్ని పూడ్చిపెట్టి హాయిగా ఉంటారు

ప్రజల్ని బాధపెట్టిన రాజు తగిన శిక్ష అనుభవిస్తాడు ఈ బాలల నవలలో.

పిల్లలకు ఆసక్తి పుట్టించే అనేక విషయాలు, బోధిస్తూ పిల్లల కోసం పాయసం సుబ్రహ్మణ్యంగారు "శాంతిపావురం" 1 అనే నవలను వ్రాసినారు.

రాజు, మాధవి అనే మెరికల్లాంటి ఇద్దరు పిల్లలు అద్భుతమైన సాహస యాత్ర చేసి పాతాళంలోకంలో ఉన్న "శాంతిపావురాన్ని తెచ్చి విశాల భారత దేశపు వినీల గగనంలో ఎగుర వేస్తారు.

భారత దేశంలో అన్యాయాలు, అక్రమాలు, బానిసత్వం, దోపిడి, దౌర్జన్యం పెరిగి శాంతి నశించి పోయిందని రాజు, మాధవి అనే ఇద్దరు పిల్లలు తల్లి దండ్రులకు చెప్పకుండా శాంతి పావురం కోసం దేవమహర్శి దర్శనార్థం బయలుదేరుతారు. కొటికాపరి మల్లయ్య చెప్పిన వైనాన్ని బట్టి దెయ్యాల మర్రి దాటి, అమృత హృదయం గల "రుద్రపాలి" అనే రాక్షసి మహావిజ్ఞాన ఖనియైన "జాబాలి" అనే చిలుక సాయంతో ధేవమహర్మి దగ్గరకు చేరి, వారి సాయంతో పాతాళ లోకంలో ప్రవేశించి శాంతి పావురాన్ని విడిపించుకొని వచ్చి, వినీలగగనంలోకి ఎగుర వేస్తారు. తమ బిడ్డలు సాధించిన విజయానికి ఆ పిల్లల తలిదండ్రులు ఎంతో ఆనందిస్తారు.

దేశంలో శాంతి నెలకొనాలంటే చిన్నారి పాపలు తమ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహించాలని. ఈ పిల్లలే దేశభవిష్యత్తుకు బంగారు బాట వెయ్యాలని ఈ నవల ఉద్దేశ్యం. ఈ నవల ద్వారా పిల్లలకు విజ్ఞాన వినోదాలు లభిస్తాయి.

శ్రీ వాత్సవ గారి పిల్లల నవల "జిల్తారు జాబిలి" 2 బాబి, ఉమ స్నేహితులు. వీళ్ళతో పాటు చాల మంది పిల్లలు స్కూల్లో చదువుకుంటూ ఉంటారు. వీరందరికి ఇష్టమైన టీచరు అనసూయ, తోటమాలి జగ్గు. అందరి దగ్గర డాలి అనే కుక్క చను

---

1. చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘం, చిత్తూరు, 1979
2. కళ్యాణి పబ్లికేషన్స్, తెనాలి.

వుగా ఉంటుంది. వీరందరికి నేస్తం జల్తారు జాబిలి. జల్తారు జాబిలి ఊరికి అవతల కొండ దిగువ మరొక కొండలో ఉంటాడు. అతడు పిల్లల్లో కొత్త భావాలు కలిగించాలని వాళ్ళకు జాలి, ప్రేమ, ఐకమత్యం నేర్పిస్తుంటాడు. జల్తారు జాబిలి తన పిల్లన గోవితో.

"జల్తారు జాబిలి జతకూడగ రాచెలీ" అంటూ పాడుతూ పిల్లలందర్నీ "ఆనందపురి" అనే కొత్త లోకానికి తీసుకు వెళ్తాడు. ఆనందపురి రాజభవనంలో ఏడ్పులు విచారాలు ఉండవు. అందం. ఆనందం, శాంతి ఇవి తప్ప ఇంకేవి కనిపించవు. ఆనంద పురిలో బీద, గొప్ప తారతమ్యాలుకాదు, అందరూ ఒక్కటే. ఆనంద పురికి జగ్గాయ్ కొత్త ప్రధాని అవుతాడు. అనసూయ టీచరుకు, జగ్గాయ్‌కు వివాహం జరుగుతుంది. మళ్ళీ జల్తారు జాబిలి అక్కడనుండి ఇంకొక చోటుకి వెళ్ళిపోతాడు.

పిల్లల్లో కొత్త భావాలు, కొత్త ఆలోచనలు కలగజేయడం. వారిలో ప్రేమ నవ్వు, ఆప్యాయత. ఉండాలనుకోవడం. బీద, గొప్ప తేడా మరచి అందరూ ఐకమత్యంగా ఉండాలనేదే ఈ నవల ఉద్దేశ్యం ఈ నవలలో బాపుగారి బొమ్మలు పిల్లల్ని ఆకర్షిస్తాయి.

తెలుగు బాలబాలికల హృదయాలకు ఆహ్లాదం. ఆనందం, ఆశ్చర్యం కలిగే విధంగా తెలుగుల జీవితాలను, వారి ఆచార వ్యవహారాలను, నాగరికతా వైభవాన్ని ఇతి వృత్తాలుగా చేసుకొని, పిల్లలకు అర్థమయ్యే స్వచ్ఛమైన భాషలో అంతటి నరసింహం గారు పిల్లల కొరకే కొన్ని నవలలను వ్రాసినారు.

1. కోట వీరన్న సాహసం.
2. ఉదయగిరి పోలన్న ధైర్యం.
3. మంత్రాల రామన్న మొండితనం.
4. కవిగారి బాల్యం

---

1 సమతా సాహితి, విశాఖపట్నం, 1972

2. సమతా సాహితి, విశాఖపట్నం, 1961 ద్వి. ము. 1962, తృ. ము. 1965

3, 4, సమతా సాహితి, విశాఖపట్నం, 1965, ద్వి, 1972 చ, ము. 1972

ఈ నవలల్లో మన పాత చరిత్రను, భూగోళాన్ని, జంతువులను, వృక్షాలను గురించిన విజ్ఞానంతో పాటు మన సంఘ జీవన విధానాన్నికూడా సందర్భోచితంగా రచయిత వివరించినారు. ఒకనాడు మన సంఘంలో సర్వత్రా వ్యాపించి, ఈనాడు మటుమాయమైపోయిన మంత్ర, తంత్ర విద్యలు, క్షుద్రవిద్యలు దయ్యాలు, భూతాలు గురించి వివరంగా తన రచనల్లో చిత్రించినారు.

ఈ నవలల్లో కథానాయకులైన రామన్న, పోలన్న, వీరన్న చేసిన సాహసాలు, అద్భుతాలు, పిల్లలకు ఆశ్చర్యాన్ని కలుగ జేస్తుంది, ఆ కాలంలో క్షుద్ర విద్యల్ని అన్ని జాతులవారు అభ్యసించేవారు. దెయ్యాల్ని వశీకరణ మంత్రం ద్వారా వశపరచుకొనే వారు శక్తి ని ఆరాధించే సమయంలో జంతుబలులే గాకుండా పసిబిడ్డలను కూడా బలి యిచ్చేవాళ్ళు. మంత్రగాళ్ళు "మోడి" ని నిర్వహించే వాళ్ళు. "మోడి" అంటే మంత్రగాళ్ళు మంత్రాలతో తమ బలా బలాలు నిర్ణయించుకోవడం. ఆకాలంలో వేట చాల జోరుగా సాగుతుండేది. ఈ నవలా కాలం నాటికి "సేతబడి, కనుకట్టు విద్య" బాగా ప్రచారంలో ఉండేవి. కాటేరు మంత్రం స్త్రీలపైన ప్రయోగించేవారు, ఇటువంటి మన కథానాయకుడు రాముడు తప్పించి ప్రజలకు మంచిచేసేవాడు. పూర్వపు పల్లెటూళ్ళు ఎలా ఉండేవో అప్పటి జీవితం ఎలా ఉండేదో పిల్లలకు అర్థమయ్యే రీతిలో రచయిత చక్కగా చిత్రించినాడు.

ఈ నవలలు పిల్లల్లో విజ్ఞానంతో పాటు ఆనందం కలుగజేసి వారిని ప్రభా వితుల్ని చేస్తాయి

మంత్ర, తంత్ర, ఇంద్రజాల, మహేంద్ర జాల విద్యలతో బాలల మనసుల్ని రంజింపచేసే రసవత్తరమైన బాలల నవల చివుకుల పురుషోత్తం గారి "బంగారం ఎలా చెయ్యాలి[1]" రసవత్తరమైన ఈ బాలల నవల ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సీరియల్‌గా వెలువడి విశేష ప్రజాదరణ పొందినది,

బంగారం చెయ్యాలని మానవజాతి కలకాలంగా కలలు కంటున్నది. బంగా రం చెయ్యాలనుకుని చాలా మంది సన్యాసులయ్యారు. కాని నిజంగా బంగారం ఎలా

---

1 వాహిణీ పబ్లిషింగ్ హౌస్, విజయవాడ 1980

చెయ్యాలి? మంత్ర విద్యలతోనా? స్పర్శవేది చేతనా నిండా పన్నెండేళ్ళు నిండని రాము బంగారం ఎలా చెయ్యాలో తెలుసుకుంటాడు.

రాము ఎనిమిదో క్లాసు విద్యార్థి. ఒక రోజు రాము "మాయా మంత్రాలలోకం" సినిమా చూసి ఎట్లయినా బంగారం తయారు చెయ్యాలనుకుంటాడు. స్పర్శవేదితో బంగారం చెయ్యొచ్చని చదివి. మాలకొండ అడవులకు కుక్కరాజుతో సహా వెళతాడు. అక్కడ హిస్టరీ ప్రొఫెసర్ జనార్దనరావు, వారి అమ్మాయి నీరజతో పరిచయమవు తుంది. వారిద్దరూ కలసి పాడుబడిన మండపం చేరి, లోపలకు ప్రవేశించి లక్ష్మీదేవి విగ్రహం చేరుకుంటారు. అక్కడొక మానవ అస్థిపంజరం కనబడుతుంది. లక్ష్మీదేవి విగ్రహందగ్గర ఒక గుంటలో మట్టిపిడత కనిపిస్తుంది స్పర్శవేది దొరికిందని ఆనందపడు తుండగా దాన్ని కొండయ్య కాజేస్తాడు. చివరకు బాగా చదివి మంచి ఉద్యోగం సంపా దించి బంగారు కొనడం లేదా మైనింగ్ అండ్ మెటలర్జీ చదివి బంగారం యురేనియం డోరియం, వజ్రాలు భూగర్భంనుండి వెలికి తీయడం లాంటి మార్గాలతో బంగారం ఎలా తయారు చెయ్యాలో రాము తెలుసుకోవడంతో నవల ముగిసి పోతుంది.

రాము ధైర్యసాహసాలు, పట్టుదల, బాంబులు పేల్చి పులిని తరమడం అనేవి ఈ నవలల్లో పిల్లలకు మార్గదర్శకాలు.

కిష్టడనే కుర్రవాడు ఇల్లు వదలి పారిపోయి సిద్ధుడిగా మారడం మల్లాది అవధాని గారి "పారిపోయిన పిల్లవాడు" [1]అనే బాలల నవలలోని ఇతి వృత్తం.

చాలమంది పిల్లవాళ్ళు ఇటు విడిచి పారిపోవడం మనం నిత్యం చూస్తున్న విషయమే. అయితే అలా పారిపోయి చెడు సావాసాలు చేసి దేశదిమ్మరులుగా తయారై దొంగతనం మొదలైన నేరాలు చేసి చివరకు "సర్టిఫైడు స్కూళ్ళ" లో చేరుతుంటారు. ఈ నవలలో పారిపోయిన పిల్లవాడు తల్లిదండ్రులు లేని పదేళ్ల కిష్టడనే కుర్రవాడు. అలా వెళ్ళి పోయిన కిష్టడు అర్ధరాత్రి ఒక సాధువును కలుసుకుని అతని ద్వారా కొన్ని నిధులు సంపాదించి ధనవంతుడవుతాడు. కిష్టడికి పెళ్ళిరోజున ఆ సాధువు కనిపించి తనతో రమ్మంటాడు. సంపదలంతా చెల్లెలికి అప్పగించి సాధువుతో వెళ్ళిపోతాడు.

---

1 విద్యోదయ పబ్లికేషన్స్, కడప, 1962

ఆరోగ్యాన్ని రోగార్తులకు ధారపోసి, వయస్సును వైష్ణవ సాధువుకిచ్చి, శరీరాన్ని గురుదేవునికి కానుకగా ఇచ్చి చివరకు ఆత్మజ్ఞానం పొందుతాడు

ఈ నవలలో మహాపురుషులు పొందిన సిద్ధులు చూపిన అద్భుతాలు పిల్లలకు ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలుగజేస్తాయి

3. 1. 2. పశు పక్ష్యాదులు పాత్రలుగా గల జానపద బాలల నవలలు:

పక్షులకు జంతువులకు మానవ జీవన విధానాన్ని ఆపాదించి, నవలా లక్షణాలతో కొంతమంది నవలలు వ్రాసినారు. ఈ నవలలే కొంత కాలానికి నీతిని ప్రబోధించే నవలలుగా పరిణమించాయి. బాల సాహిత్యంలో నీతిని ప్రబోధించే నవలలకు సమున్నత స్థానం ఉంది. జంతువులు పాత్రలుగా గల నవలల్లో నీతి ప్రధానంగా ఉంటుంది "నీతి అనేది బ్రతుకులో ఒక చక్కనికీతికి మార్గం, నీతి లేని మనిషి బ్రతుకు నిరర్థకం" అన్నట్లు భారతీయ సంస్కృతిలో నీతికి అత్యధిక ప్రాధాన్యం ఉంది. నీతులు పిల్లల చేత వల్లె వేయించినంత మాత్రాన వాటిని పిల్లలు అనుసరించరు. పుస్తకరూపంలోనో నవలా రూపంలోనో నీతిని మిళితం చేసి అందిస్తే ఆ నీతి పిల్లల మనస్సులో బాగా హత్తుకుంటుంది ఈ నీతిని ప్రబోధించే నవలలు చదవడం వల్ల పిల్లల్లో లౌకిక జ్ఞానం, వ్యవహార దక్షత, అలవడుతుంది. ఈ నవల్లో మనుష్యులు, జంతువులు పక్షులు క్రిమికీటకాదులు కలిసి మెలసి మాట్లాడుకుంటాయి ఇలాంటి ఇతివృత్తాలు, గల నవలలంటే పిల్లలు అమితంగా ఇష్టపడతారు. వాటిని చదివి వారు మానసికానందాన్ని పొందుతారు. సత్ప్రవర్తనకు మూలకారణమైన నీతిని చిన్నప్పటినుండే పిల్లలు నేర్చుకోవాలంటే నీతిని ప్రబోధించే నవలలు వారిచేత చదివించాలి. జంతువులు, పక్షులు, క్రిమికీటకాదులు పాత్రలుగా గల నవలలు చదవడం వలన పిల్లల్లో ఎక్కువ కుతూహలం కలగడమే కాకుండా జంతువులపట్ల పక్షులపట్ల అభిమానం, సానుభూతి ఏర్పడుతుంది. ఈ నవలలు పిల్లలకు కేవలం వినోదాన్నేగాక, విజ్ఞానాన్ని, నీతిని సత్ప్రవర్తనను, ఉత్సాహాన్ని, ఊహాశక్తిని పెంపొందించి పిల్లలకు సందేశాన్ని కూడా అందిసాయి.

జంతువులు పాత్రలుగా గల నీతిదాయకమైన బాలల బొమ్మల నవల పాతూరి ప్రసన్నం గారి "సుఖీభవ" 1 మృగ వనాన్ని "సమవర్తి" అనే పేరు గల సింహరాజు

---

1. న్యూ స్టూడెంట్సు బుక్ సెంటర్. విజయవాడ. 1975

పరిపాలిస్తూ ఉండేవాడు. రాజు గారికి సంతానం లేదని. రాజు ముసలి వాడయిపోతు న్నాడని ఆ రాజ్యానికి సమర్థవంతుడైన మరొకరిని రాజుగా చెయ్యాలని కుటిలుడనే నక్క అడవంతా ప్రచారం చేస్తుంది. తన బూటకపు మాటలతో రాణి గారి ప్రాపు సంపాదించి గర్భవతియైన రాణి చావుకు కారణమవుతుంది. తోయలో పడిన రాణి పిల్లవాణ్ణి కని మరణిస్తుంది. ఆ లోయిలో గొర్రెల కాపరి సింహం పిల్లను చూసి ముచ్చటపడి తన గొర్రెలతో పాటు పెంచుతుంటాడు. కుటిలుడు రాజు మీద దండెత్త డానికి కల్లోలం లేవదీసే సమయంలో గూఢచారి పావురం యువరాజు బ్రతికి ఉన్నాడనే వార్త తీసుకొని వస్తుంది. వెంటనే రాజు మంత్రి భల్లూకపతి వెళ్ళి యువరాజును తీసుకు వచ్చి రాజ్యానికి పట్టాభిషిక్తుని చేస్తారు. ధర్మ బద్ధంగా యువరాజు పాలించే ఆ రామ రాజ్యంలో స్వార్థపరుడైన కుటిలుడు లాంటి వారికి స్థానంలేక పోయింది.

నీతిగా బ్రతికేవారికి మంచి జరుగుతుందని అవినీతి పరులకు కష్టాలు పనితప్ప ఈ నవల నిరూపిస్తుంది.

జంతువులు పాత్రలుగా గల మరొక నీతిదాయకమైన నవల యం ఫిరోజమగారి "ఉడుతా ఉడుతా హూత్,[1] అట్టమీద లోపలి బొమ్మలు పిల్లలకు ఆకర్షణీయంగా కన బడి ఉత్సాహాన్నిస్తాయి.

ఒక ఉడుత పిల్ల తన తల్లి మాట వినకుండా చెట్టు తొర్రనుండి బయటకొచ్చి దారి తప్పి అనేక కష్టాలనుభవించి తాబేలు, కుందేలు. ముంగిస, రామచిలుక కప్ప. సీతాకోక చిలుకలతో స్నేహం చేసి వాటి ద్వారా ప్రేమ ద్వేషాన్ని హరిస్తుంది. అహింస ముందు హింస అంతర్ధానమవుతుంది మంచితనంతో మంచి మాటలతో శత్రువును మిత్రునిగా మార్చుకోవచ్చు.

"అపాయం వస్తే ఉపాయంతో తప్పించుకోవాలి"

"ఒక దుర్మార్గుడైన మిత్రునికంటె ఒక సన్మార్గుడైన శత్రువు మేలు'

"దురాశ మానవుణ్ణి అదోగతి పాలు చేస్తుంది"

"ధైర్యంగా ఉంటే ఏ క్లిష్ట సమస్య వచ్చినా నిరాశ చెందక పరిష్కారానికి ప్రయత్నించాలి విజయం దానంతట అదే సిద్ధిస్తుంది"

---

1. 1. స్టూడెంట్సు బుక్ సెంటర్ విజయవాడ 1978

"కోపతాపాలతో కలహించు కోవడం వల్ల అన్ని పక్షాల వాళ్ళు నష్టపోతారు.

"అభ్యుదయానికి. విజ్ఞాన వికాసాలకు హృదయ పరిపక్వానికి. సుఖ జీవనానికి విద్య అత్యంత ముఖ్యం"

అనే నీతులు నేర్చుకొని, పెద్దల మాట వినని వాళ్ళు ఎలా కష్టాలు పాలవుతారో స్వయంగా తెలుసుకుని ఉడుత పిల్ల తల్లిని చేరుకోవడం ఇందలి ఇతివృత్తం.

పంచతంత్ర కథలు పుట్టినట్టే ఈ నవల కూడా ఒక ప్రయోజనాన్ని కాంక్షించి పుట్టిందనవచ్చు,

యుగంధర్ గారి బాలల బొమ్మల నవల"నక్క-జిత్తులు-కుందేలు" [1] ఎత్తులు జంతువులలో కెల్ల కుందేలు చాలా తెలివిగలదని ప్రతీతి. జిత్తుల మారి నక్క కుందేలును ఎల్లైనా పడగొట్టి తాను మంచి తెలివి తేటలు సంపాదించుకోవాలనుకుంటుంది. చాలా సార్లు ప్రయత్నించి భంగపాటు పడడం ఇందలి ఇతివృత్తం. ప్రతిసారి నక్క చేసే ప్రయత్నం, దాన్ని కనిపెట్టి కుందేలు వేసే ఎత్తులు, పిల్లల్ని కడుపుబ్బ నవ్విం చగలవు.

మంచి వాళ్ళ జోలికి పోయినా, వాళ్ళని చెరుపుదామని ప్రయత్నించినా ముప్పు తప్పదని ఈ నవల తెలుపుతుంది.

ఎ. సాయికుమార్ గారి రచన "వింత ఎలుగు" [2] గలిబిలి అనే జంతు రాజ్యాన్ని చిట్టిగారనే సింహరాజు పరిపాలిస్తుండేవాడు. మంత్రి నక్కా-రావు రాజ్యంలో అల్లర్లు లేపి, ఏనుగు ఈరయ్యకు, ముళ్ళపంది గిలికు, జీరావు చిన్నయ్యకు ఖడ్గ మృగం కనకయ్యకు పదవుల ఆశ చూపి తనపైపు తిప్పుకుని రాజుని అంతం చెయ్యాలని ఆలోచిస్తాడు, ఎలుగు నారిగాడికి సారాయి పోయించి రాక్షసుడి తలబొమ్మను ముఖానికి తగిలించి, ఒంటికి సున్నం పూయించి, "వింత ఎలుగు" గా తయారు చేయించి రాజ్యంలో అలజడి రేపిస్తాడు. కుందేలు వల్ల నిజం తెలుసుకున్న రాజు నక్కను అక్కడికక్కడే చంపేస్తాడు. మోసగాడయిన నక్క పీడ వదలి గలిబిలి రాజ్యం ఆనం దంగా ఉత్సవం జరుపుకుంటుంది.

---

1. యుగంధర్ బుక్స్, విజయవాడ
2. బొమ్మల బాల పబ్లికేషన్స్, మద్రాసు

మోసం ఎప్పటికి దాగదని, మోసగానికి దండన తప్పదని ఈ నవల నిరూపిస్తుంది.

ఎ. సాయికుమార్ గారి బాలల బొమ్మల నవల "గుడ్లగూబ వైద్యం"[1] 'జిగిబిగి' అనే పక్షిరాజ్యంలో పిచ్చుగ్గాడనే సోమరి ఉండేవాడు. తల్లి ఎంత బ్రతిమాలినా పని చేసేవాడు కాడు. కోయిలవ్వ ప్రకారం పిచ్చుక చచ్చినట్లు నటిస్తుంది.

తల్లికి వైద్యం చేయడానికి గుడ్లగూబ రాలేదు. గుడ్లగూబ దగ్గర వైద్యానికి ఎవ్వరిని పోవద్దని గుడ్లగూబకు వైద్యంరాదని ప్రచారం చేయిస్తుంది. ఆరాజ్యంలోని శత్రువులు గుడ్లగూబను బంధించి రాజుకు విషపు ఇంజక్షన్ ఇచ్చి చంపమని బెదిరిస్తారు పిచ్చుగ్గాడి వల్ల రాజకీయ కుట్రదారులంతా బంధీలవుతారు. గుడ్లగూబ ఆరోజునుంచి ఉన్నవాళ్ళకి, లేనివాళ్ళకి అందరికి వైద్యం చెయ్యాలనుకుంటుంది. పిచ్చుగ్గాడికి ఉద్యోగం దొరకడంతో నవల సుఖాంతమవుతుంది.

ప్రతి ఒక్కరూ మంచిగా ఉండాలని బీద, గొప్ప తారతమ్యంలేకుండా అందరిని సమానంగా చూడాలని ఈ నవల తెలుపుతుంది.

మధురాధర్ గారి బాలల బొమ్మల నవల "నక్కమావ"[2] అనగనగా ఒక అడవికి సింహరాజు రాజుగా ఉండేవాడు. అతని ఏలుబడిలో ఎన్నో జంతువులు హాయిగా ఉండేవి. ఎంత మోసం నేర్చినా నక్క బలంలో తక్కువదని జంతువులు దాన్ని చిన్నచూపు చూస్తుండేవి. ఎలాగైనా కష్టపడి జంతు జాతిని అదుపులోకి తెచ్చుకోవాలని బ్రహ్మను గూర్చి తపస్సు చేసి, అన్ని జంతువులను మించిన తెలివి తేటల్ని వరంగా పొందుతుంది. నక్క "జిత్తులమారిగా" టక్కరిగా నక్కజిత్తులు ప్రదర్శిస్తూ అడవిలోని జంతువులను ముప్పతిప్పలు పెట్టసాగింది చివరకు నక్కబాధ భరించలేని జంతువులు నక్కమామను తమలో కలుపుకొని జంతు ప్రపంచానికే తెలివిగల వీరునిగా సన్మానిస్తాయి.

ఎ. సాయికుమార్ గారి రచన "చిరుత మాంత్రికుడు" "గడబిడ" అనే జంతు

---

1 3. బొమ్మల బాల పబ్లికేషన్స్ మద్రాసు.
2. బుజ్జాయి పబ్లికేషన్స్, మద్రాసు.

వులు మాయమవుతాయి. చివరి మాంత్రికుడు జంతువులను మాయం చేస్తున్నాడని కుందేలు గాడు కనుక్కుంటాడు. తనేమైనా పరవాలేదని రాజ్యంలోని జంతువుల్ని కాపాడాలని కుందేలు చివరి మాంత్రికుని గురువైన డింపుభున్ని కలుసుకుంటుంది. డింపుభుడనే ఆ కోతి సాయంతో చివరి మాంత్రికుణ్ణి అతని పరివారం ఉన్న ఆ గుహను మాయం చేస్తుంది. కుందేలమ్మ కుందేలు పెళ్ళితో నవల సుఖాంతమవుతుంది.

మంచి మనస్సుంటే ఏదైనా సాధించవచ్చని ఈ నవల నిరూపిస్తుంది.

శ్రీమతి దుర్గావినోద్ బాబుగారి రచన "కుందేలల్లుడు"[1]. జంతువుల్లో తెల్ల కుందేలు తెలివి ంది. ఈ కుందేలు రెండు పక్కల అచ్చుగల నాణేన్ని పెట్టుకొని అడవిలో అందర్ని మోసగించి పందెం గెల్చుకుంటూ ఉంటుంది. సేనాని ఎలుగుబంటు కుందేల్ని బంధిస్తాడు. రాజుని మోసగించి తాము రాజు కావాలనుకునే మంత్రి నక్కని సేనాని ఎలుగు బంటును, ఒక సింహాన్ని మోసగించి ఒక గుహలోకి పంపి బలమైన రాయిని అడ్డుపెడ్తుంది. వాటిని మోసగించి సింహరాజుని కాపాడుతుంది.

"బుద్ధి బలంతో సాధించలేనిదేది లేదని" ఈ నవల నిరూపిస్తుంది.

జంతువులు, మనుషులు కలిసి మెలిసి జీవనం సాగించేటట్లు కొంతమంది రచయితలు నవలలను వ్రాసినారు. మనుషులు, జంతువులు కలిసి మాట్లాడు కోవడం కనిపిస్తుంది.

బాల ప్రపంచమనే కలువకొలను రచనా కలువలను వికసింప చేసి, బాల మనసులను ఆహ్లాదపరచి పసి హృదయాలలో సదా ఆనంద తరంగాలు నింపిన కలువకొలను సదానందగారి "బంగారు నడిచిన బాట"[2] చక్కని నీతి దాయకమైన నవల. ఈ నవలకు సదానందగారే పిల్లలను ఆకట్టుకునే, సులభగ్రాహ్యమైన అందమైన బొమ్మలు వేయడం మరింత ప్రశంసనీయమైన విషయం. ఈ నవల 1966 వ సంవత్సరం కేంద్ర ప్రభుత్వ ఉత్తమ నవలా బహుమతిని పొందినది.

---

1. బుజ్జాయి పబ్లికేషన్స్, మద్రాసు.
2. పద్మశ్రీ అండ్ కో. చిత్తూరు, 1965.

బంగారు ఒక సజ్జనుడు. అతని ప్రపంచం అడవి అతని నీతి బోధలకు తలఒగ్గి అడవి ప్రాణులు ఉత్తమ జీవితాన్ని గడుపుతుండేవి. మురళి, ఆవులు అతని ఆస్తి మనుషుల్లో లాగానే అడవి ప్రాణుల్లోనూ స్వార్థజీవులు, హింసోన్మత్తులు ఉండేవి. ఈ జాతికి చెందినవే టక్కుటమారమనే నక్క, సర్వమంగళ మనే పులి. అడుగడుగునా నెయ్యం కోరిన బంగారు మంచిని గుర్తించక పులి హత్యలకు, అత్యాచారాలకు ఒడిగు తుంది. బంగారు ఆవుల్ని నాశనం చేస్తుంది. అలుగ నేరని అజాత శత్రువు అలిగిననాడు శత్రువుల గుండెలు బ్రద్దలు కాక మానవన్నట్లు నక్క, పులి, పీడవదలి, అడవిలోని ప్రాణులంతా హాయిగా ఉండేటట్లు చిత్రించడం ఈ నవలలోని విశేషం.

తన మాటలు పాటలుగా, కథలుగా, నవలలుగా అల్లి తెలుగు బాలబాలికలకు ప్రేమాస్పదుడైనాడు నార్ల చిరంజీవి. పిల్లల్ని అలరించి, ఆనందింప చేయడానికి సాహి త్యాన్ని సాధనంగా చేసిన నార్ల చిరంజీవి కలం నుండి వెలువడిన నవల "పేను పెసర చేను"[1] పిల్లల్ని అలరించి, ఆనందింప చేసే నవల.

అదొక అడవి. ఆ అడవిలో ఒక పేను నివసిస్తుండేది. దానికొక కుటుంబం. చాలా మంది స్నేహితులుండేవారు. ఆ పేను పెసర చేను వేస్తుంది. దాని వలన అడవి లోని జంతువులకు ఆనందం చేకూరుతుంది. కాని ఆ దేశాన్నేలే రాజు దురహంకారం తో దుష్టబుద్ధితో ఆ చేను పాడు చేస్తాడు. అల్ప జంతువైన ఆ పేను అధైర్య పడక అందరినీ కూడగట్టుకుని ఉపాయంతో రాజును ఓడించి శాంతిని కాపాడుతుంది.

కిరీటాలను ధరించే రాజులకు ఈ భూమి మీద జీవించడానికి ఎంత హక్కుందో జంతువులన్నింటికి అంతటి హక్కుందని పేను పాత్రద్వారా ఈ నవలలో నిరూపితం.

శ్రీమతి ధనం గారి బాలల బొమ్మల నవల "అమ్మేకావాలి"[2] శ్రీనివాసయ్య గారు కిన్నెర్లలో ఒక బంగళాలో తన భార్య జానికమ్మ, పిల్లలు లత, రాజు, పెంపుడు

---

1. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, ప్ర. ము. 1958
ద్వి. ము. 1977
2. న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్, విజయవాడ. 1978

పిల్లలు రాణీ, జానీ, సోనీ. చెప్పుల పిల్లలు సీత, రాధలతో టైగర్ అనే కుక్కతో నివసిస్తూ ఉంటాడు. ఒకరోజు శ్రీనివాసయ్య ఒక ఎలుగుబంటి పిల్లని తీసుకొస్తాడు. దానికి "బ్లాకీ" అని పేరుపెట్టి ముద్దుగా పెంచుతుంటాడు. అమ్మ మీద దిగులుతో బ్లాకీ ఏమీ తినేది కాదు. రాణీ, జానీ, సోనీ, బ్లాకీ స్నేహితులవుతారు. తనకు అమ్మ కావాలని బ్లాకీ ఏడుస్తుంది. స్నేహితులు ఓదార్చుతారు. ఇంతలో సీత, రాధ కూడా వచ్చి చేరుతారు. ఒకరోజు బ్లాకీతో రాజు సర్కస్ చేయిస్తాడు. అది బాగా చెయ్యలేదని దాన్ని బాదబాదుతాడు. బ్లాకి లేవలేని స్థితిలో ఉంటుంది. డాక్టర్‌కు చూపించడానికి తీసుకువెళ తుంటే తల్లి పిలుపు విన్న బ్లాకీ దెబ్బలతోనే జీప్‌నుంచి దూకి తల్లిదగ్గరకు వెళ్ళిపోతుంది

అమ్మకు దూరమైన బ్రతుకు, బ్రతుకు కాదని, ఎన్ని ఉన్నా అమ్మకు సాటి రావని బ్లాకీ పాత్ర ద్వారా ఈ నవలను బట్టి తెలుసుకోవచ్చు

గద్దెలింగయ్య, రావూరి భరద్వాజలు కలిసి రచించిన నవల "రతనాల లోయ"[1] వివిధ కాలాల్లో, వివిధ సమయాల్లో జరిగిన సంఘటనలను, అటు పూర్వ సాహిత్యం లోనూ, ఇటు ఆధునిక సాహిత్యంలోనూ ఉన్న కమనీయ సన్నివేశాలను ఆధారం చేసుకుని ఈ నవల వ్రాయబడింది. బాల బాలికల మనస్సును ఆకట్టుకుని, వారిలో పఠనా శక్తిని పెంపొందించడం ద్వారా, వాళ్ళలో విజ్ఞానాన్ని, వినోదాన్ని సమకూర్చడమే ఈ నవల ముఖ్యోద్దేశం

ఒక అడవిలో కొన్ని కోతులు హరిదత్తుడనే బాలుణ్ణి పెంచి పెద్ద చేయడం ఇందలి ఇతివృత్తం

రామోజీ మనుమడు హరిదత్తుడు. హరిదత్తుని తలిదండ్రులు విజయ గుణవర్మలు విధివశాత్తు చిన్నప్పుడే తప్పిపోయిన హరిదత్తుణ్ణి కోతులు తీసికొని పోయి పెంచుతాయి హరిదత్తుణ్ణి వెతుక్కుంటూ వెళ్ళిన రామోజీకి హరిదత్తు కోతుల మధ్యలో కనిపిస్తాడు హరిదత్తుణ్ణి సంస్కరించి కోతుల సాయంతో రతనాల లోయలో బంగారు రత్నాలను వెలికి తీసి తన రాజ్యాన్ని గెలుచుకుని ఆనందంగా రాజ్యపాలన చేయడంతో నవల సుఖాంతమవుతుంది

---

1. ఆదర్శ గ్రంథ మండలి, విజయవాడ. 1956

హరిదత్తుడు రాజునూ రాణిల్ని విడిచి పోకుండా ఒక అందమైన భవనంలో ఉంచి సర్వసౌఖ్యాలు కల్పిస్తాడు

### 3.1.3 జానపద బాలల వినోద నవలలు :-

వినోదమంటే పెద్దలు పిల్లలు ప్రతిఒక్కరు ఇష్టపడతారు. ఆరోగ్య ప్రదమైన హితౌషధం హాస్యం. ఆ హాస్యంలో వినోదం లాస్యం చేస్తూ ఉంటుంది హాస్యం ప్రధానంగా ఉండే నవలలంటే పిల్లలు చెవి కోసుకొంటారు. అది వారి ప్రవృత్తి. బాల సాహిత్యంలో ఈ వినోద నవలల పాత్ర చాలా తక్కువ. ఈ వినోదాత్మక మైన నవలలు సంక్షిప్తంగా సరళంగా, హాస్యం ప్రదానంగా ఉంటాయి. వీటిలో మానవాతీత అంశాలు చాలా తక్కువగ ఉంటాయి. అప్పుడప్పుడు పశుపక్ష్యాదుల, రాక్షసుల పాత్రలు కనిపిస్తుంటాయి. ఈ నవలల్లో సోమరిపోతులు. మూర్ఖులు, మోసగాళ్ళు దొంగలు ముఖ్య పాత్రలుగా ఉంటారు. అప్పుడప్పుడు ఈ నవలల్లో వినోదానికి తోడు నీతికూడా మిళితమై ఉంటుంది. ఈ నవలలు చదవడం వల్ల పిల్లలు ఆనందాన్ని, మానసిక వికాసాన్ని పొందుతారు.

అవసరాల రామకృష్ణరావుగారి "కేటూ-డూప్లికేటూ"[1] పిల్లల వినోదనవల. ఇందులో రాజు-రంగడి మోసాలు పిల్లల్ని కడుపుబ్బ నవ్విస్తాయి.

రాజు-రంగడు స్నేహితులు. వాళ్ళిద్దరూ దొంగలు, మోసగాళ్ళు. ఒకరోజు ఇద్దరూ రాజుగారిని మోసగించి ఇరవై వేల బంగారు కాసులు సంపాదించగా, అది రాజు తీసుకుని వెళ్ళిపోతాడు. అప్పటి నుండి ఒకర్ని ఒకరు మోసం చేసుకోవడం మొదలు పెట్టారు. రాజు ఆ డబ్బుతో ఏటిఒడ్డున పడుకొని నిద్రపోతుంటాడు. రంగడు కనిపెట్టి రాజు ఆ ఏట్లో బండకింద దాచిన డబ్బు కాజేసి గుర్రమెక్కి పారిపోతూ రాజు పక్కన-

"రాత్రి చీకటెరుగు
రాజు మోసమెరుగు

---

1. బుడుగు బుక్స్, విజయవాడ, ప్ర. ము. 1967 ద్వి. ము. 1972

నీరుపల్లమెరుగు

నిజము రంగడెరుగు"        వ్రాసి పారిపోతాడు.

నిద్ర లేచిన రంగడు విషయం కనుక్కొని, రంగడి దగ్గర ఆడబ్బు కాజెయ్యాలని రంగడు ప్రయాణించే దారిలో ఒకజోడు, మైలు తర్వాత మరొక జోడు పడేస్తాడు. రంగడు ముందుకెళ్ళి మళ్ళీ జోడుతో వెనక్కి తిరిగి వచ్చేటప్పుడు డబ్బు మూటని చెట్టు కింద పెట్టాడు. రాజు ఆ డబ్బు మూటను ఎత్తుకొని పారిపోతూ ఒక చీటి అక్కడ పెడతాడు.

"కాలికి జోడే, కళ్ళకు కారం

వీడిన జోడే. వేసిన గాలం

కుక్క కాటే గొప్పదైతే

చెప్పుదెబ్బ చేతకానిదిః"

ఇది చదివిన రంగడు డబ్బు సోధన మళ్ళీ మొదలెడతాడు. ఇలా ఒకరినొకరి మోసం చేసుకుంటూ చివరకు బుద్ధి తెచ్చుకొని ఆ డబ్బును సరిసమానంగా పంచుకొని న్యాయంగా వ్యాపారం చేసుకుని ఒకే మేడలో ఆనందంగా ఒకరినొకరు కేటుడూప్లికేటూ అని పిల్చుకుంటూ సుఖంగా జీవించడంతో నవల సుఖాంతమవుతుంది.

"భగవంతుడి సృష్టిలో అందరూ తెలివైన వాళ్ళే ఉండరు. అమాయకుల్ని ఆదరించాలిగాని అన్యాయం చేయకూడదు. నువ్వు మోసకారివైతే నిన్ను మించిన మోసగాడు మరొకడు ఉండచ్చు. అయినా, దొంగతనం, మోసగించడం మంచి బ్రతుకులు కావని" ఈ నవల ద్వారా తెలుసుకోవచ్చు.

సింగంపల్లి అప్పారావుగారి "పిచ్చివాడి అదృష్టం"[1] లో నరేంద్రుడి తెలివి తేటలు వినోదాన్ని కలగ జేస్తాయి.

---

1. బాలజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, 1979

చందనగడ్ రాజ్యాన్ని విక్రమ వర్మ పరిపాలిస్తూ ఉండే వాడు. అతనికి పిల్లలు లేనందున ఒకరోజు ఒక సాధువు రాణికి మంత్రించిన మామిడిపండు ఇస్తాడు. రాణికి "చంద్రకళ" జన్మిస్తుంది. చందనగడ్‌కి సమీప గ్రామం "లహర్‌పూర్" గ్రామంలో లక్ష్మీబాయి. కుమారుడు నరేంద్రుడు నివసించేవారు. నరేంద్రుడు పదహారు సంవత్స రాల వాడయ్యాడుకాని బుద్ధి మాత్రం వికసించలేదు. అందరూ నరేంద్రుని "మూర్ఖశిఖా మణి" అనేవారు. నరేంద్రుడు చేసే అవకతవక పనులకు లక్ష్మీబాయికి లాభం కలుగ కపోగా, ఆమెకన్నీకష్టాలే కలుగ జేస్తాడు. చివరికి తన మూర్ఖత్వంతో ఇల్లు కాల్చేస్తాడు ఆమె కోపంతో నరేంద్రుణ్ణి ఇంటి నుండి తరిమేస్తుంది. ఇంటి నుండి తెచ్చుకొన్న రొట్టెలు తిందామని ఒక బావిదగ్గర కూర్చుని ఉన్న నరేంద్రునికి భయపడి, ఆ బావిలో నివసిస్తున్న రాక్షసులు బంగారు కాసులు కురిపించే షరాయి, దేగిసా ఇస్తారు. నరేంద్రుడు లక్ష్మీబాయి, ధనవంతులవడమే కాకుండా, నరేంద్రుడు విద్యాబుద్ధులు నేర్చుకుంటాడు విజయపురి రాజు చందనగడ్ మీదికి దండెత్తి రాగా, నరేంద్రుడు తన దేగిసా సాయం తో విపరీతంగా సైన్యాలను రప్పించి, విక్రమవర్మకు విజయం చేకూర్చుతాడు. చంద్ర కళకు, నరేంద్రునికి వివాహం జరగడంతో నవల సుఖాంతమవుతుంది.

ఎలుక ఎక్కిరించిందని ఇల్లు కాల్చడం, అమ్మకష్టపడి కొట్టిన పెదుళ్ళను ఏట్లో పడెయ్యడం, చాకలిదాని బట్టలు కాల్చెయ్యడం, గంజికుండచెట్టుకి కట్టి కింది నుండి తాగడం, లాంటి నరేంద్రుని చేష్టలు పిల్లలకు వినోదాన్ని కలిగిస్తాయి.

ఆపదలో ఉన్న వారిని ఆదుకుంటే మనకు మంచి జరుగుతుందని ఈ నవల తెలుపుతుంది. ఆపదలో ఉన్న మహారాజును ఆదుకున్న అమాయకుడైన నరేంద్రుడు చందనగడ్ రాజ్యానికి మహారాజు అయ్యాడు.

దేవేంద్రబాబుగారి బాలల బొమ్మల వినోద నవల "త్రాగుబోతు దెయ్యం' [1] ఈ నవలలోని సంభాషణలంతా వంటకాలతో సాగి వినోదాన్ని కలిగిస్తుంది.

అమోమయ రాజ్యాన్ని నలభీమరాజుగారు పరిపాలిస్తుండేవారు. ఆ రాజుగారు పాకశాస్త్ర ప్రవీణులు. నీలాంబర రాజుగారి ఏకైక కుమార్తె పులిహోరను పెళ్ళిచేసు

---

1. బుజాయి పబ్లికేషన్స్, మద్రాసు

కోవాలనుకుంటాడు. ఆ యువరాణి రాజును ఒక ప్రశ్న అడుగుతుంది. "నలభీమా? భీమనలులలో ఎవరు గొప్ప వంటగాడు? సరైన జవాబు చెప్పకుంటే నీపని బొ-బొ-బొబ్బట్లు" అనగానే నలభీమరాజు "నలుడని" చెప్పి పులిహోరను వివాహమాడతాడు. వాళ్ళిద్దరి కొడుకు "అప్పచ్చి". యువరాజుకు తిండిమీద చాలా మోజు, ప్రీతి. ఎండు మిరపకాయతో చేసిన చట్నీ కంటే, పచ్చిమిరపకాయతో చేసింది నోటికి హితవుగా వుంటుందని తల్లితో వారాల తరబడి వాదించేవాడు. అప్పచ్చిగారిని దెయ్యం ఆవహించడంతో భూతవైద్యుడు ఆ దెయ్యాన్ని భూస్థాపితం చేయిస్తాడు. ఆ దెయ్యం సారాయి తాగితాగి చచ్చిందని తెలుసుకుని రాజ్యంలో మధ్యపాన నిషేధాన్ని అమలు చేస్తాడు. దొంగతనంగా సారాయి అమ్మడం ఎక్కువ అవడంతో మరల దయ్యాన్ని తవ్వితీసి, దొంగసారాయి తాగమంటాడు. ఈ విధంగా తాగుబోతు దెయ్యం సాయంతో చాలా సుఖంగా రాజ్యపాలన చేస్తాడు

ప్రతి ఒక్కరూ దేశం బాగుకోసం పాటుపడాలని, మన దేశంలో మధ్యపాన నిషేధాన్ని అమలు పరచాలని, ప్రజలు త్రాగుడ వ్యసనాన్ని మరచి పోవాలని ఈ నవల ప్రబోధిస్తుంది.

ప్రకాష్ గారి బాలల వినోద నవల "చీకటి రాకాసి"[1]

పిలక రాజ్యానికి రాజు మల్లిగాడు. వాడి ప్రాణస్నేహితుడు మసగ్గాడు. ఒక రాకాసి గబ్బిలం ఆ రాజ్యంలోని మనుష్యుల పిలకల నంతా తెంపుకుని పోతుండడంతో ఆ గబ్బిలాన్ని చంపడానికి మల్లిగాడు, మసగ్గాడు బయలుదేరుతారు. ఒక అడవిలో "కుతంత్రన్" అనే అరివ రాక్షసుడు, వాడి భార్య సింగి నివసిసూ ఉంటారు. వారి అనుచరుడే రాకాసి గబ్బిలం. సింగి నవరం కోసం అందరి పిలకలు మాయమవుతున్నాయని కనుక్కుంటారు ఆ రాక్షసుడికి, సింగికి వాళ్ళల్లో వాళ్ళకి రచ్చలు పెట్టి గబ్బిలం ప్రాణమున్న జాగీని నాశనం చేసి చంపుతారు. రాక్షసుడి ప్రాణం వాడి బొడులో ఉందని కనుక్కొని రాక్షసుణ్ణి చంపి రాజ్యం చేరుకుంటారు.

బాలల జానపద వినోద నవలలు చాలా తక్కువ సంఖ్యలో వెలువడినాయి

---

1. కుమారి పబ్లికేషన్స్, మద్రాసు.

వీటన్నిటిలోకి అద్భుత నవలలు అధిక సంఖ్యలో వెలువడినాయి.

### 3.1.4. బాలల జానపద నవలల్లోని వివిధాంశాలు :-

జానపద నవలా స్వరూప స్వభావాల్ని తెలుసుకోవాలంటే, జానపదనవలల్లోని వివిధాంశాల్ని పరిశీలించాలి. మామూలు నవలలలాగే అన్ని అంశాలతో బాటుగ, జానపద నవలల్లో కొన్ని ప్రత్యేకాంశాలు ఉన్నాయి. ఇవి జానపద నవలా నిర్మాణానికి చాలా ముఖ్యమైనవి. ఈ జానపద నవలల్లో మూలాంశము, మాదిరి, సమానాంశాలు, సన్నివేశాలు, పాత్రచిత్రణ, మొదలైనవి ముఖ్యాంశాలుగా పేర్కొనవచ్చు. జానపద నవలల రచనా విధానాన్ని పరిశీలిస్తే పై అంశాలే ముఖ్యమైనవిగా కనిపిస్తాయి.

#### 3.1.4.1. మూలాంశము :- (Motif)

జానపద సాహిత్యంలో ముఖ్యంగా కథల్లో నవలల్లో ముఖ్యపాత్ర వహించేది మూలాంశము. దీనిని ఆంగ్లంలో Motif అంటారు. దీనిని "కథనఘటకము" అని అనవచ్చునని డా॥ జి.యస్. మోహన్‌గారు తన "జానపద విజ్ఞాన వ్యాసావళి" లో పేర్కొన్నారు. కన్నడంలో ఈ Motif అనే పదానికి ఆశయ" "ప్రేరక" "కథన ఘటక" అనే శబ్దాలు వాడుకలో ఉన్నాయి. కథా రచనల్లో ఇది కనిష్ఠాంశము కాబట్టి దీనికి "మూలాంశము" అనే పేరు వచ్చిందనుకోవచ్చు. Stith Thompson Folk tale అనే పుస్తకంలో Motif ను గురించి క్రింది విధంగా తన అభిప్రాయాన్ని వ్యక్తీకరించినారు. **'The smallest element in a tale having the power to persist in oral tradition'**[1]

జానపద సాహిత్యంలో మూలాంశాలకు అధిక ప్రాధాన్యం ఉంది. ఈ మూలాంశాల వల్లనే పిల్లలకు జానపద నవలల్ని చదవాలనే ఆసక్తి కలుగుతుంది. మామూలుగా జరిగే వాటికన్నా భిన్నమైనవి, అద్భుతమైనవి మూలాంశాలు. ఇవి జానపద నవలల్లో అడుగడుక్కీ కనిపిస్తాయి. ఇవి పిల్లలకు ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించి వాళ్ళ మనసుల్లో హత్తుకు పోతాయి. ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క మూలాంశము వాడుకలో ఉంటుంది. సంప్రదాయాల ననుసరించి కూడా మూలాంశాలుండవచ్చు ప్రపంచ

---

1. Stith Thompson, Folktale, P, 415, 1946.

జానపదసాహిత్యంలో ఉన్న మూలాంశాలను ఒక్కచోట చేర్చి స్టిత్ థామ్సన్ "మోటివ్ ఇండెక్స్ ఆఫ్ ఫోక్ లిటరేచర్" అనే పేరుతో బృహత్సంపుటాలను తయారుచేసినాడు. దీనిద్వారా ప్రపంచంలో ఏ ప్రాంతంలో ఏ మూలాంశాలు వాడుకలో ఉన్నాయో సులభంగా కనుక్కోవచ్చు. ఈ మూలాంశాలు పాత్రలు, సంఘటనలు, వస్తువులు అని మూడు విధాలుగా ఉంటాయి.

కొన్ని జానపద నవలల్లో బ్రహ్మరాక్షసి లాంటి పాత్రలు ప్రముఖ పాత్ర వహిస్తాయి. పాయసం సుబ్రహ్మణ్యంగారి "శాంతి ప్రాకారం" నవలలో నవల మొదటి నుండి చివరి దాకా ముఖ్యపాత్రలైన పిల్లలకు "రుద్రపాలి" అనే రాక్షసి అండగా ఉండి ఆ పిల్లల మనోవాంఛితాన్ని నెరవేరుస్తుంది. సింగపల్లి అప్పారావు గారి "పిచ్చివాడి అదృష్టం" లో కథానాయకుడు నరేంద్రుడికి రాక్షసులు సహాయపడి అతడు గొప్పవాడు కావడానికి సహకరిస్తారు. కొన్ని సమయాల్లో ఈ రాక్షసులు మనుషులకు అపకారం తలపెడతారు. మదనగోపాల్ గారి "చిత్రధవళుడు" లో కాలనేమి అనే రాక్షసుడు దుర్మార్గుడు.

మాంత్రికుడు ప్రతి జానపద నవలలో కనిపించడం జరుగుతుంది. ఒక్కొక్క చోట మంత్రగత్తె, మాంత్రికురాలు ఉండడం జరుగుతుంది. బోసుబాబుగారి "ప్రభావతీ పరిణయం" "రాజభక్తి", లో "భీషణకేతు" అనే మాంత్రికుడు, పండిరి బోసుగారి ఇద్దరు వీరులు లో వరాళమాంత్రికుడు, విద్వాన్ దేవరకొండ చిన్నకృష్ణశర్మగారి "ఆనంద లహరి" లో "దురంతముఖి" అనే రాక్షసి, కె. సభాగారి మత్స్యకన్యలు లో మంత్రగత్తె, చింతాదీక్షితులుగారి "లీలాసుందరి" లో చీకటి జీబూతం అనే రాక్షసి, జయశ్రీ మల్లిక్ గారి "మంత్రాలయం" లో కేశపాలుడనే మాంత్రికుడు పిశాచాలు, అలెగ్జాండరు గారి "రత్నాల దీవి" లో మంత్రగత్తె, మరుగుజ్జు, శీతంరాజుగారి "వీర మల్లుడి సాహసాలు" రాక్షసుడు, మంత్రగత్తె, మదనగోపాల్ గారి "చిత్రధవళుడు" లో కాలనేమి అనే రాక్షసుడు, వీరి రచన అయిన "భైరవస్వామి" లో భైరవస్వామి అనే మాంత్రికుడు, గాయత్రిగారి "కాపాలికుడి రహస్యం" లో కాపాలికుడనే మాంత్రికుడు, పాయసం సుబ్రహ్మణ్యం గారి "శాంతి ప్రాకారం" లో జాబాలి అనే చిలుక, జయశ్రీ మల్లిక్ గారి "మంత్రాలయం" లో పాము (నాగేంద్రుడు), శీతంరాజుగారి ఒకరోజు రాజులో పంచకళ్యాణి గుర్రం, శీతంరాజుగారి "రౌతుకాడి గుర్రం" లో వింత గుర్రం కూడా మూలాంశ పాత్రలే.

జానపద నవలల్లోని మూలాంశ వస్తువులన్నీ పరిశీలిస్తే, ఇవి అద్భుతమైన వస్తువులుగా ఉంటాయి. చింతా దీక్షితులుగారి "లీలాసుందరి" లో మనుషుల్ని జంతువులుగా, జంతువుల్ని మనుషులుగా మార్చే బంగారుకడ్డి శీతంరాజుగారి "ఒకరోజు రాజు" లో భైరవుని మాయలకు మంత్రాలకు మూలమైన "ఎముక" విద్వాన్ దేవర కొండ చిన్నకృష్ణ శర్మగారి "ఆనంద లహరి" లో ఆకాశంలో పయనించే మహిమ గల పాదుకలు, ఇత్తడిడాలు, కత్తి గల చర్మపు సంచి, విచిత్రపు తలపాగా, బోసు బాబుగారి "రాజభక్తి" లో మంత్రదండం, మాయాదర్పణం, పుష్పక విమానం, మాయా ఉంగరం, శీతంరాజుగారి "రౌతుకొద్దీ గుర్రం" లో బంగారు భరిణి, చేతి రుమాలు, మాయాదారపుఉండ, కుమారి గాయత్రిగారి "కాపాలికుడి రహస్యం" లో కాపాలికుని మనోదర్పణం", దేవి వరప్రసాదమైన దివ్యమణి, దివ్యాంగుళీయం, మదనగోపాల్‌గారి చిత్రధవళుడు: "మాయాతల్పం" కిరణ్ కుమారిగారి "కపాల రాణి' లో అంజనం డబ్బి, మదన్‌గోపాల్ గారి "ఇంద్రజాలం" లో ఆకాశ మార్గంలో పయనించే విమానం, మదనబాబుగారి "కనకచక్రవర్తి" లో ఎగిరే గుర్రం, శీతంరాజు గారి "వీరమల్లుడి సాహసాలు" లో వికాసిని అనే పేరుగల మంత్రపు మణి మొదలైనవి మూలాంశ వస్తువులు.

సంఘటనలు :-

కొన్ని సంఘటనలు కూడా మూలాంశాల రూపాల్లో ఉండవచ్చు. కథా నాయకుడు సప్త సముద్రాలను అవలీలగా దాటడం. ఎంతవాడినైనా, ఎంత మందినైనా అవలీలగా ఓడించడం, కొండలు, నదులు, సముద్రాలు దాటి వెళ్ళడం. ప్రతి నాయకుని ప్రాణాలు తీండయ లాంటి సంఘటనలెన్నో మూలాంశాల రూపంలో ఉంటాయి. ఈ సంఘటనలు గురించి పక్క పేజీలలో వివరంగా వ్రాయడం జరిగింది.

3.1.4.2 మాదిరి (టైప్) :-

మాదిరి నవలా నిర్మాణ పద్ధతికి సంబంధించినది. ఇది స్వతంత్రంగా, స్వయం సంపూర్ణంగా ఉంటుంది. ఒక మూలాంశమునుగాని, అనేక మూలాంశములుగాని ఒక మాదిరిగా ఉండవచ్చు. ఇది ఈ ప్రమాణంలో ఉంటుందని చెప్పడానికి వీలులేదు. చిన్నదిగాను ఉండవచ్చు. లేక పెద్దదిగాను ఉండవచ్చు. ఒక మాదిరిలో ఒక మూలాంశము

ఉండచ్చు అని చెప్పినంత మాత్రాన అన్ని మూలాంశాలు ఒక్కొక్క మాదిరి అవుతాయనుకోకూడదు.

3.1.4.3 సమానాంశాలు :-

జానపదనవలల్ని పరిశీలించినపుడు ఈ నవలఅన్ని ఒక క్రమంలో ఉంటాయని తెలుస్తుంది. దాదాపు కొన్ని మార్పులతో ఇతివృత్తం కూడా ఒకేలాగ ఉంటాయి. జానపద నవలలన్నింటిలో ఎన్నో పోలిక కలిగిన అంశాలు ఉంటాయి. ఈ అంశాలన్ని టిని క్షుణ్ణంగా పరిశీలిస్తే జానపద నవలల్లో ఉన్న మతపరిణామక్రమం, నమ్మకాలు, శకునాలు, ఆచారాలు, కట్టుబాట్లు, నియమాలు తెలుస్తాయి.

కధానాయకుడు వీరుడిగా ఉంటాడు. ఇతడి జననం అనేక రకాలుగా ఉంటుంది

కథానాయకుడు సామాన్య మానవుడిలా జన్మించడు. అతని జన్మకు అతని తల్లిదండ్రులు చేసే తపస్సు కావచ్చు. లేదా ఒక మహాపురుషుడో, భగవంతుడో పండు విభూతి లాంటివి ప్రసాదించడం వల్ల కథా నాయకుడు జన్మించవచ్చు.

బోసుబాబుగారి "రాజభక్తి" నవలలో విశాల దేశ ప్రభువు విక్రమసేన మహారాజుకు సత్యవ్రతుడనే ముని దీవెనల వలన ప్రతాపుడు జన్మిస్తాడు. గాయత్రిగారి "మాయా ద్వీపం" లో చండీ అనుగ్రహం వల్ల లభించిన మామిడి పండు వల్ల విజయవర్ధనుడు జన్మిస్తాడు. ఇతడు కారణ జన్ముడు. మదన్‌బాబుగారి "మహామాయ" లో యోగి ఇచ్చిన మామిడిపండు వల్ల కథానాయకుడు రాజవర్ధనుడు జన్మిస్తాడు. ఒక ప్రతిభావం తుని ప్రాణం అతని శరీరంలో ఉండక పువ్వు, చెట్టు, పుట్ట, చిలుక, తుమ్మెద లాంటి వాటిలో నిక్షిప్తమై ఉంటుంది. మామూలుగా జానపద నవలల్లో మాంత్రికులు, మంత్ర గత్తెల ప్రాణం వేరే వస్తువులలో గాని, అతని శరీరంలో ఒక భాగంలో గాని ఉండడం జరుగుతుంది.

బోసుబాబుగారి "ప్రభావతీ పరిణయం" లో భీషణకేతనే మాంత్రికుని ప్రాణం మలయపర్వత ప్రాంతంలో పంచాక్షి చెరువులో పంజరంలో బంధింపబడి ఉన్న ఛిలుకలో ఉంటుంది

"శితంరాజుగారి "శాతుక్షొద్ధి గుర్రం" లో రాక్షసుని ప్రాణం తూర్పు సముద్రంలో ఉండే బాతు పొట్టలోని గుడ్డులో ఉంటుంది. ఆ వస్తువుకు హాని కలిగించినపుడు అతడు మరణించడం జరుగుతుంది".

"గాయత్రిగారి "రత్నాలదీవి" లో రాక్షసుని ప్రాణం "ఎత్తైయిన కొండలు లోతైన నల్లోయల్లు ఉన్నాయి. ఓ లోయలో మాయతో నిర్మింపబడిన భవనం ఒకటి ఉంది. ఆ భవనంలో రాక్షసుని విగ్రహం ఉంటుంది. అది శిలా విగ్రహం. ఆ విగ్రహాన్ని బ్రద్దలు కొడితే దానిలో ఒక దంతపు పెట్టె వుంటుంది. పెట్టెలో వుండే తేనెటీగ లో రాక్షసుని ప్రాణం నిక్షిప్తం చేసి ఉంది."

ఇలాంటి అంశాలు జానపద నవలలలో మామూలుగా కనిపిస్తాంటాయి.

జానపద నవలలలో పరకాయ ప్రవేశం ఉండడం విశేషం. గద్దె లింగయ్యగారు రావూరి భరద్వాజగారు కలిసి రచించిన "పరకాయ ప్రవేశం" లో నందుడనె రాకుమారుడు శివశర్మ అనే బీద బ్రాహ్మణుడు పరకాయప్రవేశం విద్య ద్వారా ఒకరి శరీరంలో ఒకరు ప్రవేశించి మారి పోతారు.

మదనగోపాల్ గారి రచన "భైరవస్వామి" లో శూర సేనుడనే రాకుమారుడు పరకాయ ప్రవేశ విద్య ద్వారా గోమాంగ్ అనే ఆటవికుని శరీరంలో భద్రపరుస్తాడు. అయితే తమ పూర్వ శరీరాలు చాలా జాగ్రత్తగా ఉంచుకోవాలి. శత్రువు యొక్క మాంత్రిక శక్తి వల్ల అసలు రూపం చెడి జంతురూపమో, శిలా రూపమో లభిస్తుంది.

"బోష్టుబాబుగారి "ప్రభావతీ పరిణయం" లో మాంత్రికుడైన భీషణకేతు గిరిజ అనే చెలికత్తెను కోతిగా మార్చుతాడు.

మదన్ గోపాల్ గారి "భైరవస్వామి" లో రాకుమార్తె ఇందుమతిని రామచిలుకగా మార్చి తనతో తీసుకు పోతాడు.

ముఖ్యమైన పాత్రలు తమ ఇష్టసిద్ధికై దేవి ఎదుట తలనుగాని, తమ శరీరంలోని ఒక భాగాన్ని ఖండించుకోవడం గాని జరుగుతుంది. దేవి వెంటనే ప్రత్యక్షమై అతని

కోరిక తీర్చడమేకాక అతనికి తన పూర్వ శరీరం కూడా లభింప జేస్తుంది.

విద్వాన్ దేవరకొండ చిన్నికృష్ణశర్మగారి "ఆనంద లహరి" లో హర్షవర్ధనుడు (కథానాయకుడు) దురంత ముఖి అనే రాక్షసిని సంహరించడానికి బయలుదేరుతూ తనకు సాయపడమని దేవిని ప్రార్థిస్తాడు. ఆ దేవి పలక లేదని తాను ఆత్మ హత్యకు పాల్పడగా, దేవి ప్రత్యక్షమై అతనికి కత్తి, డాలు, ఆకాశంలో పయనించడానికి అనువైన పాదుకలను ప్రసాదిస్తుంది.

"కుమారి గాయత్రిగారి "కాపాలికుడి రహస్యం" లో కాపాలికుడనే మాంత్రి కుడు కాళిక ఎదుట తన ఎడమ చేతిని నరికి మంటల్లో పడేసి, వెంటనే తలను కూడా నరకడానికి సిద్ధపడగా, వెంటనే కాళికాదేవి ప్రత్యక్షమవుతుంది.

పిశాచాలను, క్షుద్ర శక్తులను లొంగ దీసుకుని వాటిని ఇతరులపై ప్రయోగించడం జరుగు తుంది. మామూలుగా ప్రతి జానపద నవలలో మాంత్రికులు క్షుద్ర శక్తులను లొంగ తీసుకుని ప్రత్యర్థిపై ప్రయోగిస్తుంటారు.

జానపద నవల్లోని కథానాయకుడు నాగలోకానికి, దేవలోకానికి వెళ్ళడం, అక్కడి కన్యలను వివాహమాడడం జరుగుతుంది.

బోసుబాబుగారి "రా [illegible] " నవలలో కథానాయకుడు ప్రతాపుడు దేవలోకం వెళ్ళడం, దేవేంద్రుని కుమార్తెను వివాహమాడడం జరుగుతుంది. "చింతా దీక్షితులుగారి "శంపాలత' లో నీరదశ్యాముణ్ణి నాగకన్య నాగలోకానికి తీసుకు వెళ్ళి అతణ్ణి వివాహమాడుతుంది'

జానపద నవలా ఇతివృత్తం కలిగిన అద్భుత నవలల్లో ఇలాంటివి మామూలుగా జరుగుతుంటాయి.

కథానాయకుడు సామాన్య మానవుడిలాకాకుండా, ఎటువంటి కష్టాలనైనా సునాయాసంగా భరించి, చివరికి విజయం సాధిస్తాడు. తాను ప్రేమించిన స్త్రీని ఎన్ని కష్టాలనైనా ఎదుర్కొని వివాహమాడుతాడు.

చింతా దీక్షితులుగారి "గోపిమోహిని" లో శివనాయకుడు అనేక కష్టాలకోర్చి, అడవులను దాటి, రాక్షసులను జయించి విజయం సాధించి, గోపిమోహినిని చెరవిడిపించి వివాహం చేసుకుంటాడు.

శీతం రాజుగారి "ఒకరోజు రాజు" లో సంజయుడు భైరవుణ్ణి ఓడించి కరుణని వివాహము చేసుకుంటాడు.

విద్వాన్ దేవరకొండ చిన్నకృష్ణ శర్మగారి "ఆనంద లహరి" లో కథానాయకుడు హర్షవర్ధనుడు ఎన్నో కష్టాలకోర్చి చివరకు అనుకున్నది సాధించి ఇందుమతిని వివాహం చేసుకుంటాడు. బోసుబాబుగారి" "రాజభక్తి "లో ప్రతాపుడు "ప్రభావతి పరిణయం" లో మణిభూషణుడు. పండిరీబోసుగారి "ఇద్దరు వీరులు" లో దివాకరుడు లాంటి కథానాయకులు ఎన్నో కష్టాలకోర్చి విజయం సాధిసారు కథానాయకునికి ఓటమి అనేది ఉండదు. ఇంతేకాక ప్రతి నాయకుని దురంతాలను దుర్మార్గాలను అరికట్టి అతనితో తలపడే ఏకైక శక్తి సంపన్నుడుగా ఉంటాడు.

మాంత్రికులు తమ ఇష్టసిద్ధి కోసం రాకుమార్తెలను, కన్యలను, పిల్లలను దేవికి బలియివ్వడం జరుగుతుంటుంది. సమయానికి కథానాయకుడు రావడం మాంత్రికుని సంహరించి వారిని విడిపించడం జరుగుతుంటుంది.

పండరీబోసుగారి "ఇద్దరు వీరులు" లో మ్హరాళ మాంత్రికుడు తన ఇష్ట సిద్ధి కోసం నలభై మంది రాకుమార్తెలను సముద్రం మధ్యలో ఒంటిస్తంభం మేడలో బంధిస్తాడు. సమయానికి దివాకరుడు రావడం మాంత్రికుని సంహరించి రాకుమార్తెలను విడిపించడం జరుగుతుంది.

బోసుబాబుగారి "రాజభక్తి " లో రాకుమార్తె ప్రమోదను దేవికి బలి ఇవ్వడానికి భీషణకేతనే మాంత్రికుడు బంధించగా, రాకుమారుడు ప్రతాపుడు విడిపిస్తాడు.

శీతం రాజుగారి "వీర మల్లుడు సాహసాలు" లో అవ్వరూపంలో ఉన్న మంత్రగత్తె తొంభైతొమ్మిది మంది బాలురను బలి యిచ్చి, నూరవ బాలుడు వీరమల్లుని బలి యివ్వడానికి ప్రయత్నిస్తుంది. వీరమల్లుడు మంత్రగత్తెనే సంహరిస్తాడు.

గాయత్రిగారి "కంకాళ దుర్గం" లోమంత్రగత్తె విశంబి తనకు ఆయుష్షు వేయి సంవత్సరాలు కావాలని, తిరిగి యవ్వనం కావాలని దేవికి పన్నెండుమంది కన్యలను బలియివ్వడానికి పూను కుంటుంది.

గాయత్రిగారి "కాపాలికుడి రహస్యం" లో కాపాలికుడనే మాంత్రికునికి సర్వ సిద్ధులు వశమవ్వాలని, అందుకు పదకొండు మంది క్షత్రియ కన్యలను బలి యివ్వడానికి పూనుకుంటాడు.

జానపద నవలా ఇతివృత్తం గలిగి, ఈ నవలల్లో ఒక వర్గానికి చెందిన జంతువులు పాత్రలుగా గల నవలల్లో జంతువులకు, పక్షులకు మానవ జీవిత విధానాన్ని ఆపాదించి వ్రాసిన నవలల్లో కూడ ఇలాంటి అంశాలే ఉంటాయి.

3.1.4.4 సన్నివేశాలు :-

ఏ నవలకైనా సన్నివేశ కల్పన ముఖ్యాంగం. సంఘటనలు, పాత్రల ప్రవర్తనలు సన్నివేశ కల్పనలతో ముడివడి ఉంటాయి. మామూలు నవలల్లోకన్నా జానపద నవలల్లో సన్నివేశాలు చాలా విచిత్రంగా ఉంటాయి. సాంఘిక నవలల్లో పల్లెలు, పాఠశాలలు, చెట్ల నీడలు, ఏటిగట్లు, తోటలు, పొలాలు, పార్కులు కాలేజీలు, ఆఫీసులు బీచ్‌లు, మొదలైన ప్రదేశాల్లో సన్నివేశాలు కల్పించబడతాయి. ఇవి వాస్తవానికి దగ్గరగా ఉంటాయి. జానపద నవలల్లోని సన్నివేశాలు ముల్లోకాల్లో జరుగుతుంటాయి రాజ భవనాలు, అంతఃపురాలు, కొండగుహలు, అడవులు, కాళికా ఆలయాలు, ఉద్యానవనాలు, మొదలైన స్థలాల్లో సన్నివేశ కల్పన చేయ బడుతుంది. జానపద నవలల్లో చిత్రితమైన కొన్ని సన్నివేశాల్ని పరిశీలిద్దాం.

జానపద నవలల్లోని సన్నివేశాలు ముల్లోకాల్లో జరుగుతుంటాయి బోసుబాబుగారి "రాజభక్తి" విశాల దేశ యువరాజు కథానాయకుడైన ప్రతాపుడు దేవలోకానికి వెళ్తాడు. అక్కడ దేవేంద్రునితో పరిచయంకావడం, అతని కుమార్తె మోహినిని ప్రేమించడం జరుగుతుంది. ఇలాగే నాయకుడు ఏలోకానికైనా సునాయాసంగా పోయి రాగలిగే శక్తి కలిగి ఉంటాడు.

పాయసం సుబ్రమణ్యంగారి "శాంతి పావురం" లో రాజు, మాధవి అనే ఇద్దరు పిల్లలు సునాయాసంగా పాతాళలోకానికి వెళ్తారు. పాతాళ లోకంలో కొన్ని సన్నివేశాలను చిత్రించడం జరిగింది.

* జానపద నవలల్లో కొన్ని సన్నివేశాల్లో కొన్ని వస్తువులకు చాలా ప్రాధాన్యం కలిగి ఉంటుంది.

మంత్రదండం :-

* జానపద నవలల్లో "మంత్రదండం" అనే వస్తువును మాంత్రికులు, మంత్రగతెలు ఉపయోగిస్తుంటారు. ఈ మంత్రదండంలో అనేక శక్తులు నిక్షిప్తమై ఉంటాయి ఈ మంత్ర దండాన్ని ఉపయోగించి మనుషులను రాళ్ళుగా, జంతువులుగా పక్షులుగా మార్చవచ్చు.

బోసుబాబుగారి "ప్రభావతీ పరిణయం" లో భీషణ కేతు వద్దనున్న మంత్ర దండంతో గిరిజను కోతిగా మార్చేస్తాడు.

"భీషణకేతు ఆగ్రహంగానే "ఓం శార్దూలినీ. గిరిజ ఎక్కడున్నదీ చూపించు అంటూ తన మంత్ర దండాన్ని పులినాలుక మీద ఆడించాడు.

గిరిజ అడవిలో పరుగెత్తుతున్నట్లుగా పులి నాలుక మీద కన్పించింది. "ఓం శక్తి మాతా" అంటూ తన మంత్రదండాన్ని నుదుటికి అద్దుకుని 'కోతిగా మారి పోగాక" అని శపించాడు. వెంటనే గిరిజ కోతిలా మారి పోయింది (ప్రభావతీ పరిణయం, పు. 46)

కుమారి గాయత్రి గారి "రక్తచండి" లో దూమలోచనుడనే మాంత్రికుని దగ్గర మొసలి ఆకారంలో నున్న మంత్రదండంతో దూమ్రాక్షున్ని రాతి కన్నా హీనమైన మరమనిషిలా మార్చేస్తాడు. కొండ చిలువ ఆకారంలో ఉన్న మంత్రదండాన్ని "రక్తచండి" దరించి ఉంటుంది. కాళీవిగ్రహం పాదాల వద్ద నున్న తన మంత్రదండాన్ని అందుకున్నాడు భీషణకేతు. వీడితో ఎప్పటికైనా

ప్రమాదమే అని తెలుస్తూ తన మంత్రదండంతో చంద్ర కాంతుని శిలా విగ్రహం గా మార్చివేశాడు భీషణకేతు. (రాజభక్తి, పు. 48)

జయశ్రీ మల్లిక్‌గారి గారి "మంత్రాలయం" లో

"ఆదెంత సేపు" అమోఘమంత్ర, తంత్ర, శక్తియుక్త పరులం. ముల్లోకాల్లోని అణువణువునూ నా మంత్రదండం మీకు చూపించగలదు అంటూ జై అంబికా! అంటూ మంత్ర దండం గాలిలో ఊపాడు కేశపాలుడు.

మామూలుగా ప్రతి జానపద నవలలో ఈ మంత్రదండం ప్రశక్తి ఉంటుంది.

మాయాదర్పణం:- మాయాదర్పణం మాంత్రికులకు చాలా ఉపయోగకరంగా వుంటుంది. ఎంత దూరంలోని వస్తువుల్ని చూడాలన్నా, వాళ్ళ మనస్సులో అనుకున్నవారిని చూడాలన్నా ఈ మాయాదర్పణం ద్వారా చూడవచ్చు.

భీషణకేతు ఆగ్రహంగానే "ఓం శాలర్దూస్" గిరిజ ఎక్కడ ఉన్నది చూపించు అంటూ తన మంత్ర దండాన్ని పులి నాలుక మీద ఆడించాడు. గిరిజ అడవిలో పరుగెత్తుతున్నట్లు పులినాలుక మీద కన్పించింది.

(బోసుబాబుగారి ప్రభావతీ పరిణయం, పు. 46)

గాయత్రిగారి "మాయా ద్వీపం' లో మకరకేసిని అనే మాంత్రికురాలు దగ్గర నున్న మాయా దర్పణంతో తన శత్రువుల్ని తెలుసుకుంటుంది.

"వెంటనే ఆ మందిరంలో మరో వేపున వున్న మాయాదర్పణం కేసి నడిచిందామె. తను కుడిచేతిని ముందుకు చాపి, ఆ మాయా దర్పణాన్ని తాకింది. కళ్ళు మూసుకొని ఏవో మంత్రాన్ని పఠస్తూ తెరలుతెరలుగా ఏవో దృశ్యాలు కనిపించినయ్"

(మాయా ద్వీపం, పు. 32)

తనకు అడ్డు రాబోయే శత్రులేవో తెలుసుకోవాలన్న ఉద్దేశ్యంతో మాయాదర్పణం దగ్గ

రకు అడుగులు వేసాడతను. (కుమారి గాయత్రి, కాపాలికుడి రహస్యం. పు. 23)

మామూలుగా ప్రతి జానపద నవలల్లో మంత్రదండం, మాయాదర్పణం, ఉంటాయి. ఇవిగాక ఇంకా ఉంగరం, మహిమగల పాదుకలు, పుష్పక విమానం, లాంటివి ఎంతో ప్రాధాన్యం కలిగి ఉంటాయి.

జానపద నవలలు చాల వరకు సుఖంతాలుగానే ఉంటాయి విషాదాంతాలు చాలా తక్కువ. అసలు లేవనే చెప్పాలి. పెండ్లి చివరి సన్నివేశంగా ఉంటుంది.

"దుష్టులకు శిక్ష, శిష్టులకు రక్ష—విజయం" ఈ నవల ముఖ్యోద్దేశం. ప్రతి జానపద నవలలో మంచివారికి న్యాయం, ధర్మం, నీతి ఆచరించే వాళ్ళకి విజయం కలుగుతుంటుంది. దుర్మార్గునికి అపజయం, లేదా మరణం సంభవిస్తుంది.

జానపద నవలలు ఒకానొక కాలంలో అనగనగా ఒకరాజు, లేదా ఏదో ఒక దేశానికి ఒకరాజు పరిపాలించేవాడు అని మొదలై అనేకమైన అద్భుతాలతో, చిత్ర విచిత్రాలైన సన్నివేశాలతో నవలలు సుఖాంతంగా ముగుస్తాయి.

3.1.4.5 బాలల జానపద నవలల్లో పాత్రచిత్రీకరణ :-

జానపద నవలల్లోని పాత్రలు కల్పనా సాహిత్యం నుండి పుట్టినవి. ఉదాత్త కల్పిత సాహిత్యానికి పాత్రచిత్రణ పునాది లాంటిది. ఈ నవలల్లో ప్రధాన అప్రధాన పాత్రలుంటాయి. సాధారణంగా నవలా రచయిత ప్రధాన పాత్రలను ఎక్కువ ఆకర్షణీయంగా చైతన్యవంతంగా తీర్చిదిద్దుతాడు. ఈ ప్రయత్నంలో రచయిత కొన్ని అప్రధాన పాత్రల సహాయాన్ని స్వీకరిస్తాడు. ఈ అప్రధాన పాత్రల కార్యకలాపాలు ప్రధాన పాత్రల వ్యక్తిత్వానికి దోహదం చేసాయి. అప్రధాన పాత్రలు దుష్ట, హాస్య పాత్రలుగా ఉంటాయి. నవలలో అప్పుడప్పుడు చిన్న చిన్న సన్నివేశాలకు, ఒక కొత్త సన్నివేశ కల్పనకు గాని, కొన్ని పాత్రలు ప్రవేశపెట్టబడతాయి. ఆ సన్నివేశం ముగిసిన వెంటనే ఆ పాత్రల నిష్క్రమణ జరుగుతుంది. ఇలాంటి పాత్రలకు ఎలాంటి ప్రాముఖ్యత ఉండదు.

బాలల సాహిత్యంలో జానపద నవలలకు చాలా ప్రాముఖ్యత ఉంది. పాత్రలు

చాలా మంచివాళ్ళయినా కావాలి. చాలా చెడ్డవాళ్ళయినా కావాలి. చాలా తెలివిగల వాళ్ళయినా కావాలి, వట్టిమూర్ఖులైనా కావాలి, చాలా అందంగానైనా ఉండాలి, లేదా వికారంగానైనా ఉండాలి. ఓ మాదిరి మంచి, సుమారైన తెలివి, ఎటూగాని అందం ఈ నవలల్లోని పాత్రచిత్రణకు అవసరం. ఇటువంటి తేడాలుంటే పిల్లలకు పాత్రయొక్క స్వభావం, గుణశీలాదులు బాగా అర్థమవుతాయి. పాత్రల్లో ఇలాంటి భేదాలుండడం వల్ల పిల్లలకు పాత్రలు క్షుణ్ణంగా అర్థమవుతాయి.

జానపద నవలల్లో పాత్రల వర్ణనలు ఉంటాయి. ఈ వర్ణనలు బట్టి మనం పాత్రల ఆకృతిని ఊహించు కోవచ్చు. ఈ నవలల్లో కన్పించే ప్రధాన ఉపప్రధాన. దుష్ట పాత్రలు. సైనికులు గూఢచారులు. చెలికత్తెలు మొదలైన అన్నిరకాల పాత్రలు కల్పిత పాత్రలు. జానపద నవలలలో కన్పించే కొన్ని పాత్రలను గురించి చర్చిద్దాం.

1. నాయికా నాయకులు
2. మాంత్రికుడు
3. రాక్షసులు
4. భూతాలు
5. చెలికత్తెలు
6. జంతువులు
7. క్షుద్రదేవతలు

కథానాయకుడు :-

కథానాయకుడు రాజకుమారుడుగ ఉంటాడు. జానపద కథానాయకుడు ధీరోదాత్తుడు. కథానాయకునికి అన్నిలోకాలతో సంబంధం ఉంటుంది. కథానాయకుడు కార్యార్థమై మునుల దీవెనలవల్లగాని, దేవుని వరం వల్ల గాని జన్మిస్తాడు.

బోసుబాబు గారి, "రాజభక్తి" లో విశాలదేశ యువరాజు సత్యవ్రతుడనే ముని దీవెనలవల్ల జన్మిస్తాడు. కుమారి గాయత్రిగారి "మాయాద్వీపం" లో సింధూర దేశాన్ని పాలించే రాజవర్ధనుడికి చండీ అనుగ్రహించిన మామిడి ఫలం వల్ల విజయవర్ధనుడు

జన్మిస్తాడు. ఇతడు కారణ జన్ముడు. మకరకేళిని వధించడానికి జన్మించినవాడు. కథానాయకుడు ధైర్యసాహసాలు గలవాడు, శక్తి సంపన్నుడు. కథానాయకుడు తిరుగు లేని వీరుడేగాక, గుణవంతుడుగా ఉంటాడు. ఆపదల్లో ఉన్న వారిని ఆదుకొనే స్వభావం గలవాడు. అనుకున్న పనిని సాధించే వరకు నిద్రపోని స్వభావం గలవాడుగా ఉంటాడు ఇతనిలో క్షమ, ఓర్పు, సహనం, భూతదయ, జాతి, దాన గుణాలు ప్రధానంగా ఉంటాయి. నీతి, ధర్మం, న్యాయానికి కట్టుబడి ప్రవర్తిస్తాడు. కథానాయకునికి దివ్యశక్తులు కూడా తెలిసి ఉండడం జరుగుతుంది. వాళ్ళ గురువులు గంధర్వుని ద్వారానో, యక్షుని ద్వారానో అభ్యసించిన దివ్య శక్తుల్నికథానాయకునికి మాత్రమే నేర్పించడం జరుగుతుంది. ఆకాశగమనవిద్య, జలస్తంభన విద్య, అదృశ్య శక్తి మొదలైన విద్యలు తెలిసిన వాడుగా ఉంటాడు. కథానాయకుడు తనకు ఎదురైన ప్రమాదాన్ని శక్తితోగాని, యుక్తితోగాని ఎదిరించి తన్నుతాను కాపాడుకునే ప్రతిభాశాలి ఇష్టసిద్ధికోసం ప్రాణాలైనా అర్పించడానికి వెనుదీయడు. కథానాయకునికి జంతువుల దేవతల సహాయం లభిస్తుంది. ఇతడు నిగర్వి, వినయశీలుడు. తాను ప్రేమించిన స్త్రీని ఎన్నికష్టాలనైనా ఎదుర్కొని పెళ్ళాడతాడు. ఒక్కొక్క సారి దేవకన్యలను, నాగ కన్యలను కూడా వివాహమాడడం జరుగుతుంది. కథానాయకుడు కొందరికి శాపవిముక్తి కలుగ జేసే శక్తి సంపన్నుడు. ప్రతి నాయకుని ఎదిరించి పోరాడగలిగి, వానిని సంహరించ గలిగిన ఏకైక శక్తి సంపన్నుడు.

కథానాయిక :-

మామూలుగా కథానాయిక రాకుమార్తెగ ఉంటుంది. కొన్ని సమయాల్లో కథా నాయిక దేవకన్యగాని, నాగకన్యగాని, దేవతల కుమార్తెలు కూడా ఉండవచ్చు. కథా నాయికలు కొందరు యుద్ధవిద్యలలో, వేటలో ఆరితేరి ఉండడం జరుగుతుంది. ఈమె త్రిలోక సుందరిగా ఉంటుంది తన మనస్సులో అనుకున్న వాడితోనే వివాహం జరగాలని కోరుకుంటుంది. అట్లా జరగకుంటే ప్రాణత్యాగానికైనా సిద్ధపడుతుంది. నాయికలు ఉత్తములు, ధైర్యసాహసాలుగల వీరవనితలు.

పండరీబోసుగారి "రాజభక్తి" లో కథానాయిక మోహిని దేవేంద్రుని కుమార్తె జగదేక సుందరి. మొదటి చూపులోనే ప్రేమించిన యువరాజు ప్రతాపుడు మానవుడైనా అతణ్ణి వివాహమాడుతుంది.

శీతంరాజుగారి 'రౌతుకొండ్డీగుర్రం' లో కథానాయిక సూర్యవి కుమార్తె, చంద్రగిరి యువరాజు విజయవర్మను వివాహమాడుతుంది.

కుమారి గాయత్రిగారి మాయాద్వీపంలో కథానాయిక గంధర్వకాంత చారుమంజరి, విజయవర్ధనుడనే రాకుమారుని వివాహమాడుతుంది.

ఈ నవలలలోని నాయికలు పురుషులతో సమానంగా అస్త్ర, శస్త్ర విద్యలను అభ్యసిస్తారు ఒక్కొక్కసారి రాజులతో పాటు, సమర్థవంతంగా, రాజ్యాలను పాలించే రాణులుగ ఉంటారు. వీరికి నృత్య, సాహిత్య, సంగీతాది లలిత కళలలో ప్రవేశం ఉంటుంది. మొత్తంమీద జానపద నవలలలోవి కథానాయిక ఆదర్శప్రాయమైనయువతి.

మాంత్రికుడు :—

ప్రతి జానపద నవలలో మాంత్రికుని పాత్ర ఉంటుంది. ఇది దుష్టపాత్ర. స్వార్థపరత్వం, మోసం, అవినీతి మొదలైన దుష్టభావాలకు ఈ పాత్రలు ప్రతీకలు. ఈ మాంత్రికుడు కాళికాదేవి ఉపాసకుడు. ఇతడు క్షుద్రవిద్యలలో ఆరితేరినవ్యక్తి. కొన్ని క్షుద్రశక్తులు, మంత్రశక్తులు మాంత్రికుల ఆధీనములో ఉండి ఎదుటివారికి అపకారం చేస్తుంటాయి. దెయ్యాలు భూతాలు, పిశాచాలు కూడా వీరి అధీనంలో ఉంటాయి. మాంత్రికుని దగ్గర మహిమగల వస్తువులు కొన్ని ఉంటాయి.

ఉదా : మాయాదర్పణం :

ఈ దర్పణం మాంత్రికుని ఆదేశంతో భూత, భవిష్యత్, వర్తమానకాలాలలోని విషయాలను చూపిస్తుంది. తన బలికి కావలసిన వ్యక్తుల్ని ఇందులో చూపి నిర్ణయించుకుంటాడు. తన బందీలు ఎవరైనా తప్పించుకు పారిపోతే ఈ దర్పణం ద్వారా కనిపెట్టి శిక్షిస్తాడు.

మంత్రదండం :

తనకు యిష్టం కాని వ్యక్తుల్ని తన కార్యక్రమానికి ఆటంకం కలిగించే వ్యక్తులను ఈ మంత్రదండంతో జంతువులుగా, పక్షులుగా, మారుస్తుంటాడు. ఒక్కొక్కసారి మాంత్రికుని మహిమలన్ని ఈ మంత్రదండంలో నిక్షిప్తమై ఉంటాయి.

బోసుబాబుగారి "ప్రభావతీ పరిణయం" లో "శార్దూలకీ" అనే పేరు గల మాయాదర్పణం మీద మంత్రదండంతో కొట్టగానే గిరిజ తప్పించుకోవడం జరుగుతుంది. వెంటనే మంత్రదండంతో కోతిగా మార్చేస్తాడు.

మదన్‌గోపాల్ గారి "అగ్నిగుండం" లో

"దూరదర్శినీ నాకు అవసరానికి ఉపయోగపడగల
మహావీరుడు ఎవరు ? ఎక్కడున్నాడు ?" ఖంగుమంది
రుద్రసింహుని కంఠం    పు. 42

దూరదర్శినీ పేరుగల మాయాదర్పణంతో తనకు కావలసిన యువకుని చూడడం జరుగుతుంది.

"విశాలాక్షీ, నాకో సుందరాంగిని చూపాలి"
వెంటనే రాతి పలక పారదర్శకంగా మారి
దృశ్యాలు గజిబిజిగా కదిలిపోవడం ప్రారంభించాయి.... .... ....
.... .... ....ఆమె రూపం స్పష్టంగా మాయాదర్పణంలో
ప్రతిబింబించింది   (పు. 36)

మాంత్రికుల ప్రాణం వాళ్ళ శరీరంలో వుండదు. చెట్టులోనో, పుట్టలోనో, పూవులోనో, చిలకలోనో, ఒక సరస్సులోని కలశంలోనో ఉంటుంది. కొన్ని సమయాలలోఆ మాంత్రికుని శరీరంలో ఏదో ఒక భాగంలో నిక్షిప్తమై ఉంటుంది. ఆ చోటు కనుక్కొని వాటికి నాశనం కలిగించినపుడు వానికి మరణం సంభవిస్తుంది.

బోసుబాబుగారి "ప్రభావతీ పరిణయం" లో బీషణకేతనే మాంత్రికుని
ప్రాణం 'మలయపర్వత ప్రాంతంలో పంచాక్షి చెరువులో ఒక చిలుక
లో బంధింపబడి ఉంటుంది. కుమారి గాయత్రిగారి 'రక్త చండి' లో
దూమలోచనుడనే మాంత్రికుడి ప్రాణం చండీ విగ్రహంలో దాచి
ఉంచాడు.... .... .... ఒక్క వ్రేటుతో ఆ విగ్రహనాభిస్థానాన్ని బద్దలు
చేయ గలిగితే మరణిస్తాడు.   (పు. 52)

మాంత్రికుడు తన ఇష్టసిద్ధికోసం స్త్రీలను, ప్రత్యేకించి కన్యలను అపహరించుకొని వచ్చి దేవికి బలి యిస్తుంటాడు.

> పండరీబోసుగారి ఇద్దరు వీరులు లో మరాళుడు రాకుమార్తెలను బలి ఇవ్వడానికి అపహరించుకొని వచ్చి బంధిస్తాడు.
> "కేశపాలుడు సాగిస్తున్న మారణ హోమానికి వెయ్యిమంది పతివ్రతా స్త్రీలను బలియివ్వాలి. అట్లా బలి ఇచ్చినట్లయితే అతను ప్రపంచసార్వభౌము త్వం సంపాదించగలడు" (పు. 30)

దురాశాపరులు, ఇతరుల జీవితాలను నాశనం చేయాలని ప్రయత్నించే వారూ జీవితంలో ఎప్పుడూ బాగు పడలేరన్న సత్యాన్ని మాంత్రికుని పాత్ర ద్వారా తెలుసుకో వచ్చు. ఈ మాంత్రికుని పాత్ర వల్ల ప్రధాన పాత్రధారి నాయకుని గుణశీలాలు ఇంకా మెరుగులు దిద్దుకుంటాయి.

రాక్షసులు ;

మామూలుగా ప్రతి జానపద నవలలో రాక్షస పాత్రఉంటుంది. రాక్షస పాత్రలో మంచివాళ్ళు, చెడ్డవాళ్ళు రెండు రకాలుగ ఉంటారు. మంచిపాత్రలు కథానాయకునికి ఇతరులకు సహాయంగా ఉండి మంచిపేరు సంపాదించుకుంటారు. దుష్టపాత్రలు అందరికీ అపకారం తలపెట్టి ప్రాణాలు పొగొట్టుకుంటాయి. కార్యార్థం వెళ్లే ప్రధాన పాత్రలకు సహాయకులుగా వుండి దూర ప్రదేశాలకు తీసుకువెళ్ళడం లాంటివి చేస్తుంటారు. ఈ రాక్షసుల ప్రాణం కూడా వాళ్ళ శరీరంలో ఉండక రహస్య ప్రదేశాలలో నిక్షిప్తమై ఉంటుంది. రాక్షసులు సుమారు పదివేల సంవత్సరాల ఆయుష్షు కలిగి ఉంటారు.

సింగంపల్లి అప్పారావుగారి "పిచ్చివాడి అదృష్టం" లోరాక్షసులు నరేంద్రుడి కి బంగారు నాణేలు కురిపించే షరాయి, సైన్యాలు ఉత్పత్తయ్యే డేగిసా ఇస్తారు,

"శాంతిపావురం" లో ఇద్దరు చిన్నపిల్లల పాతాళలోక యాత్రకు అమృత హృదయం గల రుద్రపాణి అనే రాక్షసి సహాయం చేస్తుంది.

భూతాలు ; సాధారణంగా ప్రతి జానపద నవలలో భూతాలు దెయ్యాలు ప్రసక్తి తప్పక

ఉంటుంది. ఇవి పాడుబడిన ఆలయాన్నిగాని, పాడుబడిన బావినిగాని, కీకారణ్యంలోని ఒక దట్టమైన చెట్టునుగాని ఆశ్రయించి ఉంటాయి. వీటికి మనుష్యుల్ని ఏడిపించటం, హింసించి ఆనందించడం, ఒక్కొక్కసారి చంపెయ్యడం కూడా సరదాగా ఉంటుంది. సాధారణంగా ఇవి ఎవ్వరికీ అపకారం చెయ్యవు. కోరుకున్న రూపం ధరించగల కామ రూపశక్తి భూతాలకు ఉంటుంది. మంచి రూపాలలో వచ్చి మనుషుల్ని ఏడిపించి మోసగిస్తూ వుంటాయి. ధైర్యవంతుల్ని, దివ్యశక్తులు మంత్రతంత్రాలు తెలిసిన వాళ్ళను ఈ భూతాలు ఏమి చెయ్యలేవు. అగ్నిని చూ_ ఈభూతాలు భయపడుతాయి.

కొన్ని భూతాలు మానవులకు సహాయం చేసే ఉద్దేశ్యంతో ధనం ఇవ్వడం, నిధుల ఆచూకీ చూపడం, రాజుగారి కూతుర్ని ఆవహించడం. తాము సహాయం చెయ్య గలవానిని చూడగానే వదిలి వెళ్ళిపోవడం లాంటివి చేస్తుంటాయి.

కుమారి గాయత్రి "రత్నాల దీవి" లో చిలిపి భూతాల చిత్రీకరణ చాల చక్కగా జరిగింది.

చెలికత్తెలు :

జానపద నవలల్లో రాణుల పాత్రలను లేక రాజకుటుంబాలను ఆధారం చేసుకుని చెలికత్తెల పాత్రల్ని చిత్రిస్తుంటారు. నవలలో ఈ పాత్రల ప్రయోజనం ఎక్కువగా కనిపించదు. చెలికత్తెలు అంతఃపురాలలో రాణులకు సేవచేస్తూ జీవితం గడుపుతుంటారు. రాణులకు వస్త్రభూషణాదులు ధరింపజేయడం, అలంకరించడం, వారికి కావలసినవి సమకూర్చడం, వినోద పరచడం లాంటివి చేస్తుంటారు. కొందరు రాణులకు అత్యంత సన్నిహితంగా వుండి వారి మనస్సు ననుసరించి ప్రవర్తిస్తూ వుంటారు రాణి ఎక్కడికి వెళ్ళినా చెలికత్తెలు వెంట ఉంటారు. రాణితో బాటు ఉద్యానవనాలలో విహరించడం, వ్యాహ్యాళికి వెళ్ళడం, ఆటలలో పాల్గొనడం లాంటివి చేస్తుంటారు. రాణులు ఏదైనా ఆంతరంగిక వార్తలను చెలికత్తెల ద్వారా పంపేవారు.

బోసుబాబుగారి "ప్రభావతి పరిణయం" లో చందన, గిరిజలు మదనబాబుగారి "అదృష్టవంతుడు" లో మంజరి, నాగమంజరిలో

చండి, వంటి చెలికత్తెల పాత్రలు జానపద నవలల్లో ఎక్కువగా కనిపిస్తాయి. వీరినే దాసీలని కూడా వ్యవహరిస్తారు.

జంతువులు ;

జానపద నవలలలో జంతువులు ఒక్కొక్కసారి ప్రధాన పాత్రలకు సహాయ కారులుగా ఉంటాయి. జయశ్రీ మల్లిక్ గారి "మంత్రాలయం" లో ముఖ్యపాత్ర; రాజజన్ముడైన నాగేంద్రవర్మను ఒక మహాసర్పం పుట్టినప్పటినుండి కాపాడి, సహాయకారిగా ఉంటుంది.

"రతనాలలోయ" లో హరిదత్తుడు "ఒకరోజు రాజు" లో సంజయుని లాగ ఒక్కొక్క సారి అడవిలో తప్పిపోయిన పిల్లల్ని పెంచి పెద్ద చేస్తాయి.

"శాంతిపావురం" లో ముఖ్యపాత్రధారులయిన రాజు, మాధవికి జాబాలి అనే చిలుక సహాయకారిగా వుంటుంది.

జానపద నవలల్లో ఒక వర్గానికి చెందిన జంతువులు, పశుపక్ష్యాదులు పాత్రలుగా గల నవలల్లో జంతువులే పాత్రలుగా ఉంటాయి. ప్రధాన, అప్రధాన పాత్రలు, గూఢచారులు, చెలికత్తెలు, సైనికులు అన్ని జంతువులుగానే ఉంటాయి.

పాతూరి ప్రసన్నంగారి 'సుఖీభవ" లో సింహారాజు సమవర్తి, మంత్రి ఛిల్లాకపతి, గూఢచారి పావురం, ఆంతరంగిక వ్యవహారాల మంత్రి, ఎలుగుబంటు, ఎ సాయికుమార్ గారి "వింత ఎలుగు" లో జంతు రాజయిన సింహరాజు. మంత్రి నక్కారావు, సదానందగారి "బంగారు నడిచిన దాట" లో సర్వమంగళమనే పులి, టక్కుడమారమనే నక్క పాత్రలు ఇలాంటివే.

క్షుద్ర దేవతలు :-

ప్రతి జానపద నవలలో క్షుద్ర దేవత పాత్ర కనిపిస్తుంది. మాంత్రికులు ఈ క్షుద్ర దేవతల్ని ఆరాధిస్తుంటుంటారు. ఈ క్షుద్ర దేవతలు అనేక పేర్లతో పిలువ బడుతుంటారు. కపాల కుంభిణి. చండి, అంబికా, దేవి, ప్రచండభైరవి, మహాకాళి

కాత్యాయని, రక్తాక్షి, రక్తనేత్రి, భైరవి, శాకినీ, లాంటి వివిధ పేర్లతో పూజింపబడుతుంది. ఒక్కొక్క సారి ప్రధాన పాత్రకు సహాయకారిగా కూడ ఉంటుంది. ఈ క్షుద్ర దేవతలు భయంకర స్వరూపం కలిగి ఉంటారు.

> "ఎర్రటి నాలుకను ముందుకు చాపుకుని
> నిలువెత్తుతో, ఎనిమిది చేతులతో, రకరకాల
> ఆయుధాలు చేతుల్లో ఉంచుకుని, చూపరులకు
> భయాన్ని కలిగిస్తూ ఉన్న భయంకర స్త్రీ విగ్రహం"
>
> (రక్తచండి-పు 7)

> "నాలుగు చేతులు, నాలుగు చేతుల్లో రకరకాల
> ఆయుధాలు, నెత్తిన వెలుగుతున్న నిప్పుల
> కుంపటి, మెడలో కపాల హారం. పొడవుగా
> నున్న కోరలు వికృతంగా అగుపిస్తూ భయంకరంగా
> ఉందా విగ్రహం"
>
> (కాపాలికుడి రహస్యం, పు 3, 4 )

మాంత్రికుల మనో వాంఛితాన్ని నెరవేర్చడానికి బలిని కోరుతుంటాయి. పై పాత్రలే గాక ఇంకా దేవతలు, కిన్నెరులు, కింపురుషులు, మత్స్యకన్యలు, గంధర్వులు, నాగకన్యలు, మరుగుజ్జులాంటి పాత్రలెన్నో జానపద నవలల్లో కనిపిస్తాయి.

3 1.4.6 బాలల జానపద నవల స్వరూపం :-

జానపద నవల ఏకాలానికి సంబంధించినదో నిర్ణయించి చెప్పలేము. ఈ నవలల్లోని రాజుల పేర్లకు, కొన్ని ప్రదేశాల పేర్లకు చరిత్రతో సంబంధం ఉండదు. ఈ నవలల్లో ప్రాచీన నిర్మాణపద్ధతి కనిపిస్తుంది. ఈ నవలలకు నియమిత స్వరూపం ఉండదు. సాధారణంగా జానపద నవలల్లోని ఇతివృత్తం ఒకటిగానే ఉంటుంది. కాని పలువురి చేత అనేక రకాలుగా మార్పు చెందుతుంది.

"రాజభక్తి" "ప్రభావతీ పరిణయం", విచిత్రకవచం, "మంత్రాలయం" "ఇద్దరు

వీరులు". మొదలైన నవలలు ఇంకా ఇప్పుడు విరివిరిగా వెలువడుతున్న బాలల బొమ్మల జానపద నవలలు కొన్ని మార్పులతో ఒకటే ఇతివృత్తాన్ని కలిగినటువంటివి. జానపద నవలలు కర్మకాండలను, ఆచార వ్యవహారాలను, దేవతల మాహాత్మ్యాలను వివరంగా తెలుపుతాయి.

జానపద నవలలు ముఖ్యమైన క్రియతో ప్రారంభం కావు. ఉన్నట్లుండి ముగిసి పోవు. ఈ నవలలకు సంబంధించి ప్రారంభం, ముగింపు రెండూ ఫలానా విధంగా ఉండాలనే నియమాలేవి లేవు. ఒక నవలలో చెప్పబడిన పాత్రల పేర్లు, సన్నివేశాలు, వర్ణనలు, అనేక సార్లు ఇతర నవలల్లో కూడా ఉండవచ్చు.

"రాజభక్తి" లో "ప్రభావతీపరిణయం" లో మాంత్రికుల పేర్లు "భీషణకేతు" ఈ రెండు నవలల్లో ఒకే ఆకారంతో వర్ణింపబడింది. విభిన్న పాత్రల కలయిక కనిపిస్తుంది. నాయకుడు - ప్రతినాయకుడు, శిష్టులు-దుష్టులు మామూలుగా జానపద నవలల్లో కథానాయకుడు, అతనికి ప్రతినాయకుడుగా మాంత్రికుడుండడం సహజం.

"ప్రభావతి పరిణయం" లో నాయకుడు మణిభూషణుడు. ప్రతినాయకుడు భీషణకేతనే మాంత్రికుడు. ఇతడు దుష్టుడు, ఇతని అనుచరులు శిష్టపాలుడు, రణకేతు దుష్ట పాత్రలు. మణిభూషణుని స్నేహితుడైన ప్రచండుడు, వీరిద్దరికి అడుగడుగున సాయం చేసిన ముని, వందన, గిరిజలు శిష్టపాత్రలు. "ఇద్దరు వీరులు" దివాకరుడు నాయకుడు, మరాళ మాంత్రికుడు ప్రతినాయకుడు.

"రత్నాల దీవి" లో చారుదత్తుడు, ఉగ్రసేనుడు సోదరులు. ఈ విధంగా ఒకే రకమయిన పాత్రలు రెండు ఉన్నట్లయితే ఒకరు అశక్తులుగా ఉంటారు. ఉగ్రసేనుడు అశక్తుడుగా చిత్రింపబడినాడు. పాత్రచిత్రణ, శైలి సరళంగా, ఆసక్తికరంగా ఉంటుంది

జానపద నవలల్లో పాత్రచిత్రణ పిల్లలకు ఆసక్తి కలిగించే విధంగా ఉంటుంది. దేవతలు, జంతువులు, మనుషులు, రాక్షసులు, పక్షులు, పాత్రలుగా ఉంటాయి. జంతువులకు, పక్షులకు, మానవ జీవిత విధానాన్ని ఆపాదించి నవలలు వ్రాయడం పశుపక్ష్యాదులు మనుషులులాగా మాట్లాడడం పిల్లలకు ఆనందం కలిగిస్తుంది.

సదానంద గారి "బంగారు నడచిన బాట" పాతూరి ప్రసన్నం గారి "సుఖీభవ" నార్ల

చిరంజీవి గారి "పేను_పెసరచేను" లో జంతువులు మనుషులతో కలసి ఉండటం, మనుషుల్లాగా మాట్లాడడం, "శాంతిపావురం" "జావాలి" అనే చిలుక రాజు, మాధవి అనే పిల్లలతో స్నేహం చేసి వాళ్ళకి సాయం చెయ్యడం లాంటివి పిల్లలు బాగా ఇష్ట పడతారు. ఈ నవలలో శైలి సరళంగా అందరికి అర్థమయ్యే రీతిలో ఉంటుంది.

3.1.4.7 బాలల జానపద నవలల ప్రాశస్త్యం :-

జానపద నవలలు బాలబాలికల్ని ఎక్కువ ఆకర్షిస్తున్నాయి. వీటిలోని అవాస్త వికత, మాంత్రిక శక్తి ప్రదర్శన, భయానక అద్భుత సంఘటనలు ప్రధానంగా పిల్లల్ని ఆకర్షిస్తాయి. ఈ నవలల్లో ఆత్మారాధన, గూతారాధన, దేవతలు, దెయ్యాలు, బ్రహ్మరాక్షసుల వంటి మానవాతీత, మానవేతర పాత్రలు కనిపిస్తాయి. దేవతలు రాక్షసులు, మాంత్రికులు, అతీత శక్తులుగల నవలలు. గడిచిపోయిన యుగాలకు సమాజానికి సంబంధించిన ఈ జానపద నవలలు బాలసాహిత్యంలో ప్రముఖస్థానాన్ని కలిగి ఉన్నాయనడంలో అతిశయోక్తి లేదు. ఈ నవలల్లో వాస్తవికతకు చోటులేక పోయినా వీటిని చదివి పిల్లలు అమితంగా ఆనందిస్తారు. మనస్తత్వశాస్త్ర దృష్ట్యా పరిశీలిస్తే ఈ జానపద నవలలు పిల్లల్ని బాగా ఆకట్టుకుంటున్నాయని తెలుస్తున్నది. ఇవి పిల్లలకు మానసిక ఉల్లాసాన్ని కలిగించడమేగాకుండా, ముందేమి జరుగుతుందో అనే కుతూహలాన్ని రేకెత్తించి ఆ నవలా ధ్యేయాన్ని హృదయానికి హత్తుకునేటట్లు చేస్తాయి.

రాక్షసులను మనుషులు జయించడం, ధనికులను వాళ్ళ సేవకులు ఓంగపరచడం, అతి సామాన్యమైన వ్యక్తులలో అసాధారణ శక్తులుండడం లేదా వారి-కవి లక్ష్యం కావడం లాంటి ఇతి వృత్తాలున్న జానపద నవలలు చాలా ఉన్నాయి. వాస్తవ సంప్రదాయానికి ఎదురువేళ్ళే ఈ నవలల్ని చదవడం వల్ల దొంగలభయం, దెయ్యాల భయం లాంటివి పిల్లలనుండి దూరమవుతాయి. ఈ నవలలో చిత్రవిచిత్రాలైన సంఘటన లుండడం వల్ల, బొమ్మలు ఆసక్తి దాయకంగా ఆకర్షణీయంగా ఉండడం మూలాన పిల్లలు ఆసక్తిగా శ్రద్ధగా చదువుతారు. మామూలుగా జానపద నవలల్లో మంచివారికి విజయం, దుర్మార్గులకు అపజయం, కలగడం జరుగుతుంది. ఈ నవలలు చదివి పిల్లలు మంచిగా ప్రవర్తించాలనే అభిప్రాయాన్ని కలిగి ఉంటారు. చిన్ననాడు మనసులో నాటుకున్నవి కలకాలం నిలిచి ఉంటాయన్నట్లు, ఈ నవలలు చదవడం

వల్ల పిల్లలు నీతిని సత్ప్రవర్తనను కలిగి ఉంటారనడంలో అతిశయోక్తి లేదు. ఈ జానపద నవలలు పిల్లలకు కేవలం వినోదాన్నేగాక, విజ్ఞానాన్ని నీతికుశలతను, ధైర్య సాహసాల్ని, ఉత్సాహాన్ని, ఊహాశక్తిని, సందేహాల్ని పెంపొందింప జేస్తాయి. మానసికనైతికాభివృద్ధికి తోడ్పడతాయి. పరనాశక్తిని పెంపొందింప జేస్తాయి.

తెలుగులో బాలల జానపద నవలల కృషి ఇంకా జరగాల్సుంది ఈ నవలల్లో కొత్తదనం రావాలి. పిల్లలకు ఆనందాన్ని కలిగించి, వారికి ఆదర్శప్రాయమైన నవలలు రావడానికి రచయితలు కృషి చేస్తారని ఆశిద్దాం.

బాలల జానపద నవలా ఇతివృత్తానికి చెందిన అద్భుత నవలలు, పశుపక్ష్యాదులు పాత్రలుగాగల నవలలు, వినోద నవలల్ని గురించి జానపద నవలల్లోని వివిధాంశాల్ని గురించి ఈ అధ్యాయంలో చర్చించడం జరిగింది, బాలల అనువాద, సాంఘిక, పౌరాణిక, చారిత్రక నవలల పరిశీలన తరువాతి అధ్యాయంలోని విషయం.

ఆధునిక కాలంలో తెలుగులో చిన్నవి పెద్దవి ఎన్నో రకాలైన నవలలు బాలలకోసం వెలువడుతున్నాయి. జానపద నవలల్ని గూర్చి క్రిందటి అధ్యాయంలో చర్చించడమైంది. ఇతివృత్త వైవిధ్యాన్ని బట్టి బాలల నవలల్ని వర్గీకరించి అనువాద నవలలు, స్వతంత్ర నవలల్ని గూర్చి చర్చించడం ఈ అధ్యాయంలోని విషయం. మొదట నవలలకు మూలాధారాలైన అనువాద నవలల్ని గురించి పరిశీలిద్దాం.

### 3.2 బాలల అనువాద నవలలు :-

తెలుగులో నవల వెలువడడానికి కారణం ఆంగ్ల సాహిత్య ప్రభావమే. ఈ ఆంగ్ల సాహిత్య ప్రభావం వల్లనే తెలుగులో అనేక ప్రక్రియలు వెలువడినాయి. తెలుగు బాల సాహిత్య రచనకు ప్రోత్సాహకరమైన సాహిత్యం ఆంగ్లేయ బాల సాహిత్యమే, మొట్టమొదట తెలుగులో ఆంగ్లసాహిత్య ప్రేరణతోనే బాలల రచనలు ప్రారంభమైనాయి తెలుగులో పిల్లలకు "నవల" పరిచయం కావడం ఆంగ్లసాహిత్య ప్రభావమే. తెలుగు సాహిత్యంలో మనకు మొట్టమొదట ఎక్కువ నవలలు లేవు. మన మొట్టమొదటి నవలగా ప్రచారం పొందిన వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్ర కూడా ఒక రకంగా అనువాదమే అనుకోవచ్చు. తెలుగులో బాలల నవలలు చాలా తక్కువ. ~~బాలల నవలా~~

సాహిత్యంలో అనువాదనవలలే ఎక్కువ సంఖ్యలో ఉన్నాయని చెప్పవచ్చు. తెలుగులో బాలసాహిత్యంలో నవలా ప్రక్రియకు సరైన ఆదరణ, ప్రోత్సాహం లేదు.

"పిల్లలకు పనికివచ్చే సాహిత్యము మన తెలుగు భాషయందు వెలువడిన సాహిత్యమును పాశ్చాత్య బాలసాహిత్యముతో పోల్చి చూసిన యెడల చాలా పరిమితమని చెప్పాల్సివుంటుంది"[1] అని పిల్లల నవలల్ని గూర్చి వివరిస్తూ శ్రీ సోమనాద్ గారు ప్రవంతి మాస పత్రికలో పేర్కొన్నారు. నిజానికి తెలుగులో నవలలకన్నా అనువాద నవలలేఎక్కువ. గిడుగు సీతాపతిగారు, చింతా దీక్షితులుగారు, శ్రీవాత్సవగారు, నార్ల చిరంజీవిగారు, న్యాయపతి రాఘవరావుగార్లు, నోరి నరసింహ శాస్త్రిగారు, వేదుమళ్ళ కామేశ్వర రావుగార్లకి ఆంగ్ల సాహిత్యం కొంత ప్రోత్సాహమిచ్చి ఉంటుంది. ఇంకా ఆద్యులైన వీరేశలింగం పంతులుగారు మొదలైన పెద్దలుకూడా ఆంగ్ల సాహిత్య ప్రేరణలోనే బాలల రచనలు ప్రారంభించి ఉంటారనుకోవచ్చు. శ్రీ నండూరి రామ మోహన్ గారు, విశ్వాత్మల నరసింహమూర్తి గారు, 1950 ప్రాంతంలో అనువాదాలకు చక్కటి ప్రయత్నం చేసినారు. ఉట్ల కొండయ్య గారు ఆండర్సన్, గ్రిమ్స్ రచనలు అనువదించినారు. రాను రాను వింతో మరిది హాస్యపార ప్రకటనకర్తల కోరికపై ఆంగ్లం నుండి బాలల నవలల్ని అనువదించినారు. శ్రీ యుతులు యస్.కె. వెంకటాచార్యులుగారు, కరభరపాటి రామగోపాల కృష్ణశాస్త్రిగారు, చిత్రకన్యగారు, లతానాద్ గారు, డా|| వి.యస్. శర్మగారు, ఉప్పల లక్ష్మణరావుగారు మొదలైనవారు ఆంగ్లానువాదాలు చేసి బాలల నవలా సాహిత్యానికెంతో ప్రోత్సాహమిచ్చినారు. తెలుగులోని పిల్లల నవలలకన్నా, అనువాదనవలలే ఎక్కువసంఖ్యలో ఉన్నాయి. ఈ అనువాదాలు అన్ని భాషల నుండి తెలుగులోకి అనువదింపబడినాయి. మొట్టమొదట ఆంగ్లం నుంచి, ఆంగ్లం నుంచే కాకుండా ప్రెంచి, భాషనుండి ఆంగ్లంలోకి మొదట అనువదించబడి, ఆ ఆంగ్లానువాదాలు తిరిగి తెలుగులోకి అనువదింపబడినాయి. ఇవి కాకుండా ఇంకా తమిళం, ఉర్దూ, రష్యన్, ఇటాలియన్, బెంగాలీ భాషలనుండి కూడా తెలుగులోకి పిల్లల నవలలు అనువదింపబడినాయి. మొత్తంమీద తెలుగులోకన్నా, ఇతర భాషలనుండి తెలుగులోకి అనువదించబడిన అనువాద నవలలే

---

1. శ్రీసోమనాద్, "బాలలవాఙ్మయము-దానిపుట్టుపూర్వోత్తరాలు" ప్రవంతి, సాహిత్యమాసపత్రిక, ఆగష్టు, 1961.

ఎక్కువ సంఖ్యలో ఉన్నాయని చెప్పవచ్చు. ఆంగ్ల నవలల అనువాదాలను "ఆంధ్ర పత్రిక" ఎక్కువగా ప్రోత్సహించింది. దీనిలో వచ్చిన అనువాదాలన్ని అనువాదపద్ధతికి గీటురాళ్ళు. ఈ అనువాదకులలో ముందు పేర్కొనవలసిన రచయిత నండూరి రామ మోహనరావుగారు. ఆయన పిల్లల కోసం అనువదించిన మార్క్‌ట్వైన్ అనే అమెరికన్ హాస్య రచయిత నవలలు "టామ్‌సాయర్" "హకల్ బెర్రీఫిన్" ఆబాలగోపాలాన్ని రంజింప చేసిన నవలలు. "ప్రిన్స్ అండ్ ది పాపర్" కు "రాజు-పేద" అను పేరుతో చేసిన అనువాదం, "మిస్టీరియస్ స్ట్రేంజర్"కు "విచిత్రవ్యక్తి" పేరుతో చేసిన అనువాదం "ట్రెజర్ ఐలండ్" కు "కాంచన ద్వీపం" అనే అనువాదం ప్రపంచ ఖ్యాతి పొందినాయి ఇవి బాలసాహిత్యంలో మరపురాని మధురమైన నవలలు.

అనువాద నవలలు పరిశీలిస్తే ఎక్కువ ఉన్నాయనడంలో సందేహం లేదు. ఇవి సాహిత్యానికి సేవ చేయడమేగాకుండా పిల్లలలో పఠనాశక్తిని పెంపొందింపడానికి ఎంతగానో తోడ్పడినాయి. పిల్లల అనువాద నవలల్లో ముఖ్యమైన కొన్ని నవలల్ని గురించి ఇక్కడ చర్చిద్దాం.

నండూరి పిల్లలకోసం అనువదించిన "మార్క్‌ట్వైన్" అనే అమెరికన్ హాస్య రచయిత నవలలు "టామ్‌సాయర్" "హకల్ బెర్రీఫిన్" "ప్రిన్స్ అండ్ ది పాపర్" "ట్రెజర్ ఐలండ్" "మిస్టీరియస్ స్ట్రేంజర్" నవలలు బాలసాహిత్యంలో చెప్పుకో దగినవి.

1835 సంవత్సరంలో అమెరికాలోని మిస్సోరి రాష్ట్రంలో జన్మించిన మార్క్‌ట్వైన్, ప్రపంచ సాహిత్యాన్ని పునీతం చేసిన ఒక మహా రచయిత. అమెరికన్ సాహిత్యానికి అబ్రహాం లింకన్ వంటివాడు. ఇతనిని తెలుగు పాఠక లోకానికి మొట్టమొదటి సారి పరిచయం చేసింది నండూరి రామమోహనరావుగారు. మార్క్‌ట్వైన్ ఆవేదనలను ఆదేశాలను సరిగా అర్థం చేసుకుని నండూరిగారు మూలానికి న్యాయం చేకూర్చినారు. ఈ అనువాదాలు 1950-53 మధ్యకాలంలో ఆంధ్ర పత్రికలో వస్తున్న రోజుల్లో ఆబాల గోపాలాన్ని విశేషంగా ఆకర్షించి అలరించినాయి. మార్క్‌ట్వైన్ రచనల్లో హాస్యం వ్యంగ్యం మిరపకాయబజ్జీల్లో నిమ్మరసంలా చురుక్కుమనిపిస్తుంది.

అమెరికన్ సాహిత్యంలో ఎన్నటికీ పాతబడని నవల "టామ్‌సాయర్". అదే

పేరుతో రామమోహనరావుగారు అనువదించినారు. 1950-51 సంవత్సరంలో ఆంధ్ర పత్రికలో వెలువడి అందరిని అలరించిన నవల "టామ్‌సాయర్"[1] కథాస్థలం అమెరికా లోని మిసిసిపీనది ఒడ్డున సెంట్ పీటర్స్ బర్గ్ అనే గ్రామం. కథాకాలం 19వ శతాబ్దపు ప్రథమార్థభాగం. కథానాయకుడు "టామ్‌సాయర్" అనే అమెరికన్ బాలుడు. ఇందులో కథానాయకుడు ఆశ్చర్యపడేటట్లు ఏవోగొప్పఏసాహసాలు చేయాలి, తోటి బాలురకంటె గొప్పవాడై పోవాలనే మనస్తత్వం కలవాడు. ఈ నవలలో టామ్‌సాయర్ బాల్య జీవితానికి సంబంధించిన చిత్రవిచిత్రమైన చర్యలు చిత్రించ బడినాయి. టామ్‌సాయర్ అల్లరిపనులు, అడ్డదిడ్డమైన ఆలోచనలు, వింత అభిరుచులు, ఇందు చక్కగా వర్ణింప బడినాయి.

మార్క్ ట్వేన్‌గారిమరొకనవల "హకల్ బెరీ ఫిన్"[2] అదే పేరుతో నండూరి గారు తెనిగించినారు. నవల కథాస్థలం అమెరికాలోని మిసిసిపీనది ఒడ్డున పీటర్ బర్గ్ అనే గ్రామం. కథాకాలం 19వ శతాబ్ది. కథానాయకుడు హకల్ బెరీఫిన్ అనే బాలుడు. మరో ఇద్దరు సావాసగాళ్ళు టామ్‌సాయర్, జిమ్‌లతో కలిసి చేసిన సాహసాలు ఇందలి ఇతివృత్తం. హకల్ బెరీఫిన్ తమ స్వజాతి సిద్ధాంతాలకు వ్యతిరేకంగా తమ బానిసైన "జిమ్" స్వేచ్ఛా స్వాతంత్ర్యం కొరకు అడుగడుగునా పడిన కష్టాలు. అతడనుభవించిన అంతర్మథనం ఇందలి కథావస్తువు అనాటి అమెరికన్ సహజ స్వరూప స్వభావాలను ముఖ్యంగా నీగ్రోజాతి పట్ల వారి విశృంఖల ప్రవర్తన ఈ నవలలో చక్కగా వివరంప బడినాయి. నీగ్రో జాతీయుల మనస్తత్వాన్ని ముఖ్యంగా స్వేచ్ఛాస్వాతంత్ర్యాలపట్ల వారికి గల అపారమైన ప్రేమాభిమానాలను రచయిత చక్కగా చిత్రించినారు. మనుషు ల్లోవి మంచితనాన్ని ప్రేమించడం, వారి అమాయకత్వాన్ని ఆరాధించడం, "మార్క్ ట్వేన్" రచనల్లో కనిపిస్తుంది. టామ్‌సాయర్, హకల్ బెరీఫిన్‌ల పాత్రలు ప్రపంచ సాహిత్యంలో అజరామరమైనవి, వీరిద్దరూ చిరంజీవులు. భగవద్గీత చెప్పిన మీసాల కృష్ణుడికంటె వెన్నదొంగలించిన బాలకృష్ణుడంటేనే అందరికి ఇష్టం, అందుకే వీరిద్దరి లీలలు బాలబాలికల్ని ఎంతో మురిపిస్తాయి

---

1. నవోదయపబ్లిషర్స్. విజయవాడ, గుంటూరు, 1982
2. నవోదయపబ్లిషర్స్. విజయవాడ. గుంటూరు. ప్ర. ము. 1952
   ద్వి. ము. 1978

మార్క్‌ట్వేన్ మరొక రచన "ప్రిన్స్ అండ్ ది పాపర్". "రాజు-పేద"[1] అనే పేరుతో నండూరి తెనిగించినాడు. ఒక రాచబిడ్డ మరొకడు నిరుపేద. ఇద్దరూ ఒకే పోలిక. వారిద్దరూ ఒకరి స్థానాన్ని ఒకరు మార్చుకుంటే? ఈ విచిత్రసన్నివేశాన్ని ఆధారంగా చిత్రించిన కథే "రాజు-పేద" నవల.

1547 సంవత్సరంలో ఆంగ్ల దేశాన్నేలిన ప్రభువులకు సంబంధించిన కథ. ఒకే ముహూర్తంలో బక్కింగ్‌హాం పేలెస్‌లో జన్మించిన రాజకుమారుడు, ఒక మురికి కూపంలో జన్మించిన పేదపిల్లవాడు (టామ్‌కాంటి) ఒకరి దుస్తులు ఒకరు మార్చుకుని ఆ వాతావరణంలో ఇమడలేక వారిద్దరూ మానసికంగా చాలా బాధలు అనుభవిస్తారు. ఆంగ్ల ప్రజలు రాజుల ఏలుబడి క్రింద జీవించిన విధానం, వారి ఆచార వ్యవహారాలు వారు జీవించిన నికృష్ట జీవితం ఇందు వర్ణించబడింది. రాచనగరులోని సంప్రదాయాలను వ్యంగ్యంగా, మురికి వాడలలో జీవితాలను సానుభూతితో విమర్శిస్తూ, రెండింటిలో నివసించే మానవుల ఔన్నత్యాన్ని, నీచత్వాన్ని రచయిత చక్కగా చిత్రించినారు.

మార్క్‌ట్వేన్ గారి "మిస్టీరియస్ స్ట్రేంజర్స్" ను నండూరిగారు "విచిత్రవ్యక్తి" గా తెనిగించినారు. ఒక రోజు నికొలస్ బామన్, సెప్పీవోల్మియర్, తియొడోర్ ఫిషర్ అనే ముగ్గురు మిత్రులు ఊరి బయట కొండ మీద కూర్చుని సరదాగా కబుర్లు చెప్పుకుంటుండగా, ఆకస్మికంగా చెట్లమధ్యనుండి ఒక అందమైన యువకుడు వారివద్దకు నడిచి వస్తాడు తన పేరు సైతాన్ అని, తాను దేవతనని చెప్పి, ఎన్నో చిత్రవిచిత్రమైన మహిమలు చేసి చూపడం ఇందలి ఇతివృత్తం.

తమిళంలో ఎస్. అబ్దుల్ ఖాదర్ రచించిన "వలరమ్‌చుడర్" అనే నవలను మధురాంతకం రాజారామ్‌గారు "ఆకాశదీపం"[2] అనే పేరుతో తెనిగించినారు. 1965 సంవత్సరం దక్షిణ భాషాపుస్తక సంస్థ బాల సాహిత్యపు పోటీలో బహుమతి పొందిన నవల.

చైనా సేనలు మన దేశం మీద దాడి జరిపిన తరుణంలో మన సరిహద్దులలోని

---

1. నవోదయపబ్లిషర్స్, విజయవాడ' గుంటూరు. ద్వి.ము. 1979
2. విశ్వప్రభ ప్రచురణలు, పాకాల, 1967

ఒక గ్రామంలో ఒక బాలుడు జరిపిన వీర సాహస చర్యల కథే ఈ నవలా ఇతివృత్తం

కథానాయకుడైన ప్రేమ్ ఒక సైనికుని కుమారుడు. చైనా సిపాయిల స్థావరంలో చొరబడి వాళ్ళ రహస్యాలు మన సైనికులకు అందచేయడంలో సాయపడతాడు ప్రేమ్. ప్రేమ్‌కు టైగర్ అనే కుక్క కుడి భుజంగా ఉంటుంది. చైనా సిపాయిల ఆయుధ సామగ్రంతా ఒక చోట ఉండడం చూసిన ప్రేమ్ వాటిని ధ్వంసం చేస్తే వాళ్ళ కోరలు తీసిన పాములవుతారని ఒక బాంబును ఆయుధాల గుట్టమీద వేసి వాటిని ధ్వంసం చేస్తాడు. శత్రువులు ప్రేమ్‌ని చుట్టుముట్టి తూటాలతో గాయపరుస్తారు. ప్రేమ్ ఏ మాత్రం చలించని ధైర్యంతో "సింగపు పిల్ల గుంటనక్కల వైపు చూసినట్టుగా" తృణీకారంగా చూస్తాడు. గాయాలతో ప్రేమ్ శరీరం పూచిన కడిమిచెట్టుగ మారిపోతుంది. తన మాతృభూమికి ఉడతాభక్తిగా సాయపడినాననే సంతోషంతో టైగర్‌తో సహా ప్రేమ్ మరణిస్తాడు.

ప్రేమ్ ధైర్య సాహసాలు, మాతృదేశంపై ఆతనికి గల భక్తి పిల్లలకు మార్గదర్శకాలు.

ప్రముఖ భారతీయ నవలాకారుడు శ్రీకిషన్ చందర్ ఉర్దూలో వ్రాసిన "దాదర్ పుల్‌కె బచ్చె" అనే నవలకు జ్ఞానేంద్ర అనువాదం "దాదర్ వంతెన పిల్లలు"[1]. భగవంతుడు మానవావతారమెత్తి, పిల్లవానిగా ఏర్పడి దివినుండి భువికి దిగివచ్చి తను సృష్టించిన లోకంలో జరుగుతున్న ఘోర, దుర్భర, దుష్ట కార్యకలాపాలను స్వయంగా పరిశీలించడం ఈ నవలా ఇతివృత్తం ఇందులో రచయిత కూడా పిల్లవాడే, భగవంతుడీ రచయిత అయిన పిల్లవానితో పరిచయం చేసుకుని, ఇద్దరు బొంబాయి నగరాన్ని గాలిస్తారు. రచయిత అయిన బాలుడు భగవంతునికి ప్రస్తుత సమాజ వ్యవస్థలోని కొన్ని నగ్నసత్యాలను తెలియబరుస్తాడు.

కిషన్‌చందర్ ఉర్దూలో వ్రాసిన "ఉల్టాదరఖ్త్" కు జ్ఞానేంద్ర అనువాదం "అదోముఖ వృక్షం"[2]. ఈ నవల బాలసాహిత్యంలో సరికొత్త పోకడ

---

1. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1974.
2. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1974.

యూసుఫ్ ఒక చెప్పులుకుట్టేవాని కుటుంబంలో జన్మించి ఇటు రాజు గారికి, ఆయన కుమార్తెకు, గ్రామపెద్దకు ఉన్నది కాస్తా ధారవోసి, వారి మాయలకు మోసపోయి పాతాళ లోకంలో ప్రవేశిస్తాడు. అక్కడ రాక్షస పరిపాలనను, బలవంతుడు, బలహీనుని చేసే అన్యాయాలను, ఘోరదురంతాలు, ఆధునిక మానవ సమాజంలో యంత్రాల ప్రవేశం వలన మానవాళికి కల్గే చేటు, దోపిడీ విధానానికి మూలకారణమైన స్వార్థం, పేరాశలాంటి రాక్షస గుణాలను, మాంత్రికులనబడే నేటి రాజకీయ నాయకులు ఆచరించే మోసపుటెత్తుగడలను కనులార చూచి విశేష అనుభవం గడించిన ఒక అమాయక, పేద బాలుని సాహసోపేత గాథ ఇందలి ఇతివృత్తం.

పాతాళలోకంలోకి వెళ్ళిన యూసుఫ్ విశేష అనుభవం గడించి, మిత్రులతో తల్లిని చేరుకోవడంతో నవల అంతమవుతుంది.

"ఫుల్టన్ ఔర్స్లర్" "విల్ ఔర్స్లర్" రచించిన "ఫాదర్ ఫ్లాగన్ ఆఫ్ బాయిస్ టౌన్" అనె రచనకు శ్రీ ఎస్. ఆర్. చందూర్ గారి తెలుగు అనువాదం "బాలరాజ్యం"

జోసఫ్ ఫ్లానగన్ రోమన్ కాథలిక్ మత గురువు. ఇతడు పోలీసులు, న్యాయస్థానాలు నిర్దాక్షిణ్యంగా విడిచి పెట్టిన దిక్కులేని, దీనులైన పిల్లలను చేరదీసి, వారు నివసించడానికి మంచి వసతిని కల్పించి, విద్యాబుద్ధులు నేర్పించి, సంఘంలో ఆ పిల్లలు గౌరవ ప్రదమైన జీవితంగడపడానికి తోడ్పడుతుండేవాడు. ఈ బాలాపరాధులు తమ తప్పులను గ్రహించి, సక్రమమైన మార్గం వెంట నడవడానికి, గౌరవ ప్రదంగా, బ్రతకడానికి అన్నిచోట్ల ఏర్పాట్లు చేయడం ఇందలి ఇతివృత్తం.

ఈ నవల బాలబాలికల విచిత్రమనస్తత్వాన్ని, వారి వింత అభిరుచులను తెలిపే చక్కనిరచన పాదర్ ఫ్లానగన్ కుల, మత, వర్గ, భాషా, ప్రాంతీయ భావాలను పాటించక, అనాథ బాలలకు దయార్ద్ర బుద్ధితో, మానవతా దృక్పథంతో చేసిన త్యాగం ఈ నవలలో చక్కగా చిత్రించబడింది.

లూయి కెరోల్ గారి "అలైస్ యిన్ వండర్ లాండ్" నవలను వి. దుర్గాప్రసాద

---

1. కుబేర ప్రింటర్స్ లిమిటెడ్, మద్రాసు, 1949

రావు గారు "అల్లీ బిల్లీ లోకంలో అమ్మాయి కథ"1 అనే పేరుతో తెనిగించినారు. ఆంధ్ర సచిత్ర వార పత్రికలో సీరియల్‌గ వెలువడి పాఠకుల ఆదరాభిమానాలను చూరగొన్న నవల.

ఒక పాప కలగనడం, ఆ కలలో విచిత్రమైన లోకాన్ని చూడడం, ఆలోకంలో ఎన్నో అద్భుతాలు చూడడం, ఇందలి ఇతివృత్తం. ఈ నవలలోని వింతలు, తమాషాలు అద్భుతాలు పిల్లల్ని విశేషంగా ఆకర్షించగలవు.

ఫ్రెంచి నవలా రచయిత జూల్‌వర్న్, రచించిన "అరౌండ్ ది వరల్డ్ యిన్ ఎయిటీడేస్" అనే నవలకు శ్రీ కె. రమేష్ గారి అనువాదం "ఎనభై రోజులలో విశ్వ విహారం".

చార్లెస్ డికెన్స్ వ్రాసిన "ఆలివర్ ట్విస్ట్"2 ను అదే పేరుతో ఎస్. కె వెంకటాచార్యులుగారు తెనిగించినారు చిన్నప్పుడే తలిదండ్రులను పోగొట్టుకున్న ఆలివరు ట్విస్టు పడిన బాధలు ఈ నవలా ఇతివృత్తం. ఈ నవలనే అగ్నిహోత్రం రంగాచార్యులు కూడా తెనిగించినారు.

హెన్రీ (క్) సింకీవి (క్) జ్ నవలను శ్రీరాంచంద్‌గారు 'స్థిరంలేని జీవితం3 పేరుతోఆంధ్రీకరించినాడు, పెనామాకు సమీపంలో ఉన్న ఆస్పిన్ వాల్ లోని లైట్ హౌస్ కీపర్‌గా స్వానివిస్కీ అనే వృద్ధుడు నియమింపబడతాడు. అంతకుముందు ఆ వృద్ధుడు ఒకచోట స్థిరంలేక అనేకచోట్ల తిరిగి అక్కడికి వచ్చి స్థిరపడినట్లే అనుకుంటాడు ఒకరోజు స్వానివిస్కీ తన మాతృభూమిని గూర్చి ఆలోచిస్తూ లైట్ హౌస్ మీద లైట్ వెలిగించడం మర్చిపోతాడు. ఆ రోజుతో స్వానివిస్కీ ఉద్యోగం ఊడిపోతుంది అతడు మరల ఉద్యోగాన్ని వెతుక్కుంటూ వెళ్ళిపోవడం ఇందలి ఇతివృత్తం.

స్కాని విస్కీ బాధామయ జీవితం ఈ నవలలో చక్కగా చిత్రించబడినది.

---

1. ఆంధ్ర గ్రంథమాల, మదరాసు.
2. మారుతిరామా అండ్ కో. విజయవాడ, 1955.
3. జనతా ప్రచురణాలయం, విజయవాడ.

ఆర్.డి. బ్లాక్ మోర్ రచించిన "లోర్నాడూన్"[1] నవలను అదే పేరుతో ఉదయ శంకర్‌గారు తెనిగించినారు. ఇంగ్లాడుంలో సోమరెట్ కౌంటీలోని 'ఓర్' గ్రామ వాసి "జాన్‌రిడ్" యొక్క ప్రణయగాథ ఈ నవలా ఇతివృత్తం.

చార్లెస్ డికెన్సు వ్రాసిన నవలలకు బొడ్డపూడి రాధాకృష్ణమూర్తి గారి అనువాదం "జీవిత నౌక"[2] దక్షిణ స్కాట్లండులోని ఎస్పెన్‌డన్ నివాసియైన "దేవి" యొక్క జీవితగాథ ఈ నవలా ఇతివృత్తం. దేవి చిన్నప్పుడే తల్లిదండ్రులను పోగొట్టుకొని పినతండ్రి ఏనెన్‌జక్ డాల్బర్‌ను ఆశ్రయిస్తాడు. అక్కడ అనేక కష్టాలనుభవించి చివరకు ఆస్తి కలిసివచ్చి కెట్రియోనాతో వివాహం జరగడంతో నవల ముగుస్తుంది.

జాన్ రస్కిన్ వ్రాసిన "గోల్డెన్ వాలి" నవలను "బంగారు లోయ"[3] అనే పేరుతో యస్. కె వెంకటాచార్యులుగారు తెనిగించినారు. సిరియా దేశంలోని ఒక సారవంతమైన బంగారు లోయకు ష్వార్టు, హాన్సు, గ్లర్ అనే సోదరులు అధికారులు మొదటి ఇద్దరూ దురాశాపరులు పెద్దవాళ్ళిద్దరు తన తమ్మునికి ఎప్పుడు ద్రోహం తల పెట్టినా గ్లర్ సోదరప్రేమతో వారిపట్ల ప్రేమానురాగాలతో ప్రవర్తించేవాడు. దురాశ పరులైన సోదరులిద్దరూ తోటివాళ్ళకు సహాయం చెయ్యక సువర్ణప్రవాహ ప్రభువు శాపంతో శిలలుగా మారిపోతారు. గ్లర్ ఆ ప్రభువు దీవనలతో బంగారులోయకు అధిపతి కావడంతో నవల సుఖాంతంగా అంతమవుతుంది.

"దురాశ దుఃఖమునకు చేటు" అని ఈ నవల నిరూపిస్తుంది.

ఇంగ్లీషులో "హారియట్ బీషర్‌స్టోవే" రచించిన "అంకుల్ టామ్స్‌కేబిన్" ను రంగనాయకమ్మగారు "టామ్ మామఇల్లు"[4] అనే పేరుతో పరిచయం చేసినారు.

ఈ నవల రచనా కాలం 1851. అమెరికాలోని నీగ్రోబానిసల జీవితాలు చిత్రించిన

---

1. ఉదయశంకర్ పబ్లిషర్స్, విజయవాడ, 1961
2. మనోరమా పబ్లికేషన్స్, గుంటూరు, తెనాలి, 1956
3 మారుతిరామా అండ్‌కో, విజయవాడ, 1955. (ద్వి)
4. స్వీట్ హోమ్ పబ్లికేషన్స్, హైదరాబాదు, 1979

నవల. ఈ రచయిత్రి ఈ నవల రాసేనాటికి దక్షిణ అమెరికాలో బానిస విధానం తీవ్రంగా ఉండేది. ఈ నవల ప్రతి దేశంలోను, బానిసత్వాన్ని వ్యతిరేకించే విధంగా ప్రజల్ని ప్రభావితం చెయ్యడంలో గొప్ప పాత్ర నిర్వహించింది అమెరికాలోని నీగ్రో బానిసత్వాన్ని ప్రపంచం దృష్టికి తెచ్చిన మొట్టమొదటి నవల.

ఈ నవలలో నీగ్రో బానిసల జీవితాలను, వారి బాధలను రచయిత్రి హృదయ విదారకంగా చిత్రించినారు. అమెరికా లోని నీగ్రో బానిసత్వానికి మాత్రమే సంబంధించినదిగా గాకుండా ఏజాతి ప్రజలైనా, ఏరంగు ప్రజలైనా వలస దేశాలలో అణచబడే ప్రజలందరి మనోభావాలకు ఈ నవల ప్రతిబింబం బానిస యజమానుల హృదయ పరివర్తనకీ, శాసనాల పరివర్తనకి ఈ నవల ఎనలేని సేవ చేసింది.

అలెగ్జాండరు డ్యూమా రచించి తెలుగులో వెంకటాచారిగారి అనువాదం "ముగ్గురు యోధులు"[1] పదమూడవ లూయి ఫ్రాన్సు దేశాన్ని పరిపాలించే సమయంలో జరిగిన కథ.

ఎథోసు, పోర్థోసు, ఆరమిసు అనే ముగ్గురు వీరుల గాధ 'ముగ్గురు యోధులు' ఈ ముగ్గురు యోధులు ఫ్రాన్సు దేశంలో అనేక వీరోచిత కార్యాలు చేయుడం ఇందలి ఇతివృత్తం. ఈ ముగ్గురు వీరులు చేసిన వీరోచితకార్యాలు పిల్లల్ని ఆకర్షించి ఉత్తేజితుల్ని చేస్తాయి.

పై నవలలేగాకుండా అనేక భాషల నుండి తెలుగులోకి అనువదింపబడిన ఎన్నో నవలలున్నాయి. కొన్ని భాషలనుండి కొన్ని నవలల్ని పరిచయం చేస్తాను.

అనువాద నవలాకర్తలలో ముఖ్యమైన యస్.కె. వెంకటాచార్యులుగారు కొన్ని నవలలను తెనిగించినారు. గోల్డ్ స్మిత్ రచించిన ఆమె" ఐవన్‌హో వ్రాసిన "ఇద్దరు" థామస్ హ్యూగో "టామ్‌బ్రౌన్" లూయి స్టీవెన్సన్ డాక్టర్ జెకిల్ అండ్ మిషర్ హైడ్: రాబిన్‌సన్ క్రూసో "విచిత్రవీరుడు", షెర్లీ లీసీ అరోరా వ్రాసిన "వాట్ ది రామన్" అనే నవల "రాము భవిష్యత్తు" అనే పేరుతో తెలుగులోకి అనువదింపబడింది. చార్లెస్ డికెన్సు వ్రాసిన ఒకానొక పిల్లల నవలకు తెలుగు అనువాదం బద్దెపూడి

---

1. మారుతిరామా అండ్ కో, విజయవాడ, 1955 (ద్వి)

రాధాకృష్ణమూర్తి గారి "చిట్టితల్లి" (1955).

జాన్ స్టెయిన్‌బెక్ నవల "దిరెడ్ పోనీ" కు బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారి తెలుగు అనువాదం "ఎర్ర గుర్రపు పిల్ల" (1957). ఇది ఆంధ్రవారపత్రికలో సీరియల్‌గ వెలువడింది. 1957 లో పుస్తక రూపంలో వెలువడిన ఈ నవలను రిపబ్లిక్ పిక్చర్స్ వారు టెక్నికలర్ చలన చిత్రంగా తీసినారు.

ఆర్. కె. నారాయణన్‌గారు వ్రాసిన "రాజా అండ్ ది పైనన్" ను అద్దేపల్లి వివేకానంద దేవిగారు "రాజా–అడవి ఎనుము" (1959) పేరుతో తెనిగించినారు. ఈమె వెమొలెట్ సెర్నొసెక్ "పెయిత్ దత్ డ్రైవ్స్ అవుట్ ఫియర్" అనే నవలను కూడా "భయాన్ని పారద్రోలే భికి విశ్వాసాలు" అనే పేరుతో తెనిగించినారు.

1938 లో మార్జోనీ కిన్నన్ రాలింగ్స్ వ్రాసిన "ది ఇయర్ లింగ్" నవలకు తెలగు అనువాదం జూచిన రామరాజుగారి "జింకపిల్ల" (1968) టాల్‌స్టాయ్ నవల "హౌ మచ్ లాండ్ ఏ మాన్ రిక్వైర్స్" కు తెలుగు అనువాదం "మనిషికెంత భూమి కావాలి?".

రష్యన్ నవల "స్కూల్ బాయిస్" నవలను 1956లో 'బడిపిల్లలు' అనే పేరుతో మట్టెగుంట రాధాకృష్ణరావు గారు తెనిగించినారు. ఇటాలియన్ లో కార్‌లొరెంజని నవల పినొకియో (Pinocchio) ను నార్ల చిరంజీవి గారి అనువాదం "కీలుబొమ్మ" మళయాళంలో "మాలి" వ్రాసిన "సర్కస్" అనే నవలను టి. వి. రంగాచార్యులుగారు "జంతువులు ఆడిపే వింత సర్కస్" (1962) అనే పేరుతో తెనిగించినారు.

తమిళంలో అళియప్ప వ్రాసిన నవలల్ని చల్లారాధాకృష్ణ శర్మగారు "చిట్టికి చిరుగంట" అనే పేరుతో మదురాంతకం రాజారాం గారు "మృగాలతో మూడు గంటలు" అనే పేరుతో అనువదించినారు.

కల్కిగోపాలకృష్ణగారి నవలను "స్వప్నలోకంలో అణు అమ్మాయికథ" అనే పేరుతో పి. సభాపతిగారు తెనిగించినారు.

యల్.యల్. శబరి రాజన్ గారి నవలను 'కడుపులో గారడి" అనే పేరుతో

చల్లా రాధాకృష్ణశర్మగారు తెనిగించినారు. పూ'జేహూశ్కి గారి నవలకు జి.వి సింగరా చార్యగారి తెలుగు అనువాదం "నాగన్న నాట్యం". కె. జె రామనారాయణ గారి నవలకు మధురాంతకం రాజారాంగారి అనువాదం "వీరసింహుని విజయ యాత్ర".

బెంగాలీలో బంకిం చంద్ర, రవీంద్రనాథ ఠాగూరు మొదలైనవారు వ్రాసిన నవలలు తెలుగులోకి అనువదించబడినాయి. చాగంటి శేషయ్యగారు వ్రాసిన "రాధారాణి" (1921) నవలకు మూలం బంకించంద్రగారి నవల. బెంగాలీలో ఠాగూరు వ్రాసిన ఒకానొక నవలకు రమేష్ గారి అనువాదం "ఉపాధ్యాయుడు" (1960) అనే పిల్లల నవల.

ఇంకా బాబూరావుగారి "సిండరిల్లా" నాయని సుబ్బారావు గారి "నిధి ద్వీపం". డి.వి. సుబ్రమణ్యం గారి "పగడపు దీవి", లతానాధ్ గారి తండ్రీకొడుకు" మొదలైనవి ఈ అనువాద నవలలన్ని ఎక్కువగా 1950_60 సంవత్సరాల మధ్య ప్రచురింపబడినవి. ఈ నవలల్ని మౌలికమైన ఎన్నో నవలలకన్నా ఉత్తమ సాహిత్య గౌరవాన్ని పొందాయన్ని, పొందడానికి అర్హమైనవని చెప్పవచ్చు. ఈ అనువాదకులందరూ తెలుగు బాలలకు విశ్వసాహిత్యంలోని మంచి నవలలను అందించి, తెలుగు బాలల నవలా సాహిత్యానికెంతో సేవ చేసినారు.

పైన చెప్పిన అనువాద నవలలేగాక కొన్ని స్వతంత్ర నవలలుకూడా ఉన్నాయి. ఈ స్వతంత్ర నవలల్ని ఇతివృత్త వైవిధ్యాన్ని బట్టి వర్గీకరించి పరిశీలిద్దాం.

### 3.3 బాలల స్వతంత్ర నవలలు :-

తెలుగులో బాలలకు అనువాద నవలలేకాకుండా కొన్ని స్వతంత్రనవలలు కూడా వెలువడినాయి ఈ స్వతంత్ర నవలల ఇతివృత్తాన్ని బట్టి కొన్ని వర్గాలు విభజించవచ్చు నవలా రచనకు కేంద్రం ఇతివృత్తం. "ప్లాట్" అనే ఆంగ్ల పదానికి సమానార్థం ఇతివృత్తం. ఇతివృత్తం ఎంత బాగుంటే నవల అంత ప్రజాదరణ పొందుతుంది. ఇతివృత్త వైవిధ్యాన్ని బట్టి బాలల నవలల్ని 1. పౌరాణికాలు, 2. చారిత్రకాలు, 3. సాంఘిక నవలలుగా విభజించవచ్చు. బాలల నవలల్లోని ఇతివృత్త వైవిధ్యాన్ని పరిశీలిద్దాం.

### 3.3.1 పౌరాణిక బాలల నవలలు :-

సభ్యతకు, సంస్కారానికి, ధర్మికాదర్శాలకు మన భరత ఖండం పేరుగాంచింది. మన పురాణాలు, వేదాలు హైందవ సంస్కృతిని చాటి చెప్తున్నాయి. భావి భారత పౌరులైన పిల్లలు సంస్కారంతో పెరగాలంటే మన సంస్కృతి గొప్పదనం వాళ్ళకు తెలియాలి మన సంస్కృతి గొప్పదనం వాళ్ళకు తెలియనంత కాలం వారెన్ని విద్యలు నేర్చుకున్నా, ఎంత చదువులు చదివినా ప్రయోజనముండదు. మనజాతి గర్వకారణమైన మహాపురుషుల, మహాపతివ్రతల గాధలు పిల్లలకు అనువైన రీతిలో తెల్పాలి. వారి నుంచి మనం ఏ ఆదర్శం నేర్చుకోవాలి" అనే విషయాన్ని తెలియచెప్పాలి. ఇలా చెప్పగలిగితే పిల్లలకు మనమెంతో సంస్కృతీ, సంస్కారమిచ్చిన వారమవుతాము.

పురాణాల్లోని ఒక సంఘటననో, ఒక పాత్రనో, లేదా ఒక ఉపాఖ్యానాన్నో ప్రధానేతి వృత్తంగా తీసుకొని నవల రూపంలో చిత్రించడం పౌరాణిక నవల. మన జాతి సంస్కృతికి, మూలకారణాలైన రామాయణ, భారత, భాగవత, పురాణాలను ఆధారంగా తీసుకొని బాలలకు అర్థమయ్యే రీతిలో సులభశైలిలో రచించిన నవలలే బాలల పౌరాణిక బాలల నవలలు. రామాయణ, భారత, భాగవత, పురాణాలను పెద్దవారు చదివి అర్థం చేసుకోగలరు. కాని పిల్లలకు మన పురాణాలను గురించి తెలియచెప్పాలనే ఉద్దేశ్యంతో కొంతమంది రచయితలు, తేలికైన భాషలో పురాణేతి వృత్తాలను పిల్లల నవలలుగా మలచినారు. ఈ నవలలు పిల్లలకు మన పురాణాలను గురించి, తెలిసి చెప్పడమేగాకుండా సన్మార్గానికి, సత్ప్రవర్తనకు మార్గదర్శకులుగా ఉంటున్నాయి.

ప్రహ్లాదుడు "కన్నుదోయికి నన్యకాంత లడ్డం
బైన మాతృభావము చేసిమరలువాడు"

ఇలాంటి సత్ప్రవర్తన, నైతిక విలువలు మూర్తీభవించిన మన పురాణాలు, ఆదర్శ బాలలైన ప్రహ్లాద, ధృవుని లాంటివారిని గూర్చి పిల్లలు తప్పక తెలుసుకోవాలి. ఇలాంటివి తెలుసుకోవడం వల్ల పిల్లల్లో నైతిక విలువలు, సంప్రదాయ విజ్ఞానం పెంపొందుతుంది కాని తెలుగులో పిల్లలకు పౌరాణిక నవలలు ఎక్కువగా లేవు. ఇవి కొద్దిసంఖ్యలోనే ఉన్నాయి. ఈ పౌరాణిక బాలల నవలల్ని రామాయణ, భారత,

భాగవత, ఇతర పురాణాల నుండి వెలువడ్డ నవలల్ని వేరుచేసి పరిశీలించడం జరిగింది. రామాయణ, భారత భాగవతాదులకు సంబంధించిన నవలలన్నిటిలోకి భారతానికి సంబంధించిన నవలలు ఎక్కువగా ఉన్నాయి.

3.3.1.1 రామాయణానికి సంబంధించిన బాలల నవలలు :-

రామాయణం సమస్త లోకాలకు పూజనీయమైన పవిత్ర గ్రంథం. శ్రీరాముడు మానవలోకానికి ఆదర్శపురుషుడు, పూర్ణ పురుషుడు. తను భగవంతుడే అయినా, మానవుల్లో పుట్టి మానవులకోసం, మానవుడిలాగే లౌకిక జీవనాన్ని గడిపి ఆచరణలో మహోన్నత ఆదర్శాలను మనకందించిన మహనీయుడాయన. ఒకేమాట ఒకే బాణం, ఒక్కతే భార్య అనే ఆ మహాపురుషుడి ఆచరణ పిల్లలకు ఆదర్శం కావాలి. తండ్రిమాట నిలబెట్టడానికి అడవులు పాలయిన మహా త్యాగి శ్రీరామచంద్రుణ్ణి గూర్చి మన పిల్లలు తెలుసుకోవాలి.

మొదట రామాయణాన్ని వాల్మీకి వ్రాసినాడు. తరువాత కొంతమంది అనేక పేర్లతో రామాయణాన్ని వ్రాసినారు. ఈ రామాయణాన్ని చిన్న చిన్న వాక్యాలతో, పిల్లలకర్థమయ్యే రీతిలో బాలల బొమ్మల రామాయణము", బాలల బొమ్మల సంపూర్ణ రామాయణము" అనే పేర్లతో పిల్లలకోసం కొంతమంది రచయితలు రాసి ప్రచురించినారు. రామాయణంలోని గాథలు కొన్ని బాల నాటికలుగా కూడా వచ్చినాయి. కాని సేకరించిన పిల్లల నవలల్లో రామాయణానికి సంబంధించిన పిల్లల నవలలు లేవు. రామాయణంలో పిల్లల మనస్సులనాకర్షించే ఇతివృత్తాలు, ఉపాఖ్యానాలు లేక పోవడం వల్ల ఇందులోని గాథలు పిల్లల నవలలుగా రాలేదనిపిస్తుంది. రామాయణంలో కుశలవోపాఖ్యానం తప్పించి మిగతా కథంతా పిల్లలకు ఆసక్తి కలిగించదు. కొన్ని బాలల మాసపత్రికలు రామాయణాన్ని పిల్లల కర్థమయ్యేరీతిలో బొమ్మలతో సహా సీరియల్‌గా ప్రచురించినారు. 1925 సంవత్సరం నుండి కొన్ని సంవత్సరాలు 'చందమామ" రామాయణాన్నిరంగు రంగు బొమ్మలతో పిల్లలకు సీరియల్‌గా ప్రచురించింది ఇందులో బాలకాండ మొదలు ఉత్తర కాండ వరకు ప్రచురింపబడింది.

బాలకాండము :- దశరథుని రాజ్యపాలన. రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల జననం, విశ్వామిత్రునితో రామలక్ష్మణులు వెళ్ళి తాటకాసురుని వధించుట, సీతా

రాముల కల్యాణం.

అయోధ్యాకాండము :- శ్రీరాముని పట్టాభిషేకానికి ఏర్పాట్లు, కైకేయి వరాలు దశరథుని మరణం, పాదుకాపట్టాభిషేకం, దండకారణ్య ప్రవేశం.

అరణ్యకాండము:- శూర్పణఖ పరాభవం, బంగారు లేడి, జటాయువు సాహసం, శబరి ఆతిథ్యము.

కిష్కింధా కాండము :- హనుమంతునితో పరిచయం, వాలి, సుగ్రీవుల యుద్ధం, వాలి వధ, సుగ్రీవపట్టాభిషేకం, సీతాన్వేషణ, వాయుపుత్రునిలంకా ప్రయాణం.

సుందరకాండము :- హనుమంతుని లంకా ప్రవేశం, సీతాదర్శనము, లంకాదహనం

యుద్ధకాండము :- సేతు నిర్మాణం, యుద్ధం, రావణ సంహారం, అగ్నిపరీక్ష, సీతారామ పట్టాభిషేకం.

ఉత్తర కాండము :- సీత అయోధ్య బహిష్కరణ, కుశలవుల జననం: అశ్వమేధ యాగం, శ్రీ రామ కుశలవుల యుద్ధం సీతను, కుశలవులను వాల్మీకి శ్రీరామునికి అప్పగించుట, సీతాదేవి భూప్రదక్షిణము, కుశలవుల పట్టాభిషేకము, శ్రీరామాదులు అవతారం చాలించుట మొదలైె ముఖ్య ఘట్టాలు మనోహరంగా ప్రచురింపబడ్డాయి.

3.3.1 2 భారతానికి సంబంధించిన బాలల నవలలు :-

పురాణాల్లోకెల్లా భారతం పవిత్రమైన గ్రంథం. ఇది సకల వేదాంత తత్త్వము లకు కాణాచి. భారతంలో పద్దెనిమిది పర్వాలు కలవు భారత జాతీయ ప్రజా జీవిత సర్వస్వం మహాభారతమునందలి ఇతివృత్తం. పంచమ వేదమనబడే ఈ మహా భారతం భారత వీరులకు పాండవుల చరిత్రను తెల్పుతుంది. వ్యాసభారతాన్ని నన్నయ, తిక్కన ఎర్రనలు తెనిగించినారు. కవిత్రయ పద్య భారతం పెద్దలకు మాత్రమే ఉపయోగపడు తుంది. పిల్లల కర్థమయ్యే రీతిలో భారతంలోని ఇతివృత్తాలను, కొందరి వ్యక్తుల జీవిత చరిత్రలను కొంతమంది రచయితలు పిల్లల కొరకు నవలలుగా వ్రాసినారు. ఈ భారతంలో దర్మాధర్మ స్వరూపము: ఉపాఖ్యానాలతో చక్కగా నిరూపింపబడినది. ఇందులోని

ప్రతి పాత్ర సజీవమైనవి, పైగా ఒక్కొక్క నీతికి ఉదాహరణ, మానవుల నడవడిని తీర్చి దిద్దేదానికి ప్రముఖ పాత్ర వహించే భారతాన్ని గురించి పిల్లలు తప్పక తెలుసు కోవాలి. ఈ ఇతిహాస కావ్యము ధర్మాధర్మముల సంఘర్షణను చక్కగా నిరూపించి, చివరకు ధర్మమే జయిస్తుందని కండ్లకు కట్టినట్లు చూపుతుంది. ఇలాంటి ధర్మ ప్రతి పాదనను పిల్లలు తప్పక తెలుసుకోవాలి. భారతంలో ఆదర్శ విద్యార్థులైన ఏకలవ్యుడు కర్ణుడు మొదలైన వారి చరిత్ర పిల్లలకు ఆదర్శం గురువుకు తగిన శిష్యుడై, తనకు తగ్గని శిష్యులను తయారు చేసి, ఉత్తముడైన ఆచార్యుడై తన గురువులాగానే ఇదం బ్రహామిదం క్షాత్రమ్" అని పట్టుదలకు, శౌర్యధైర్య పరాక్రమాలకు ఆదర్శంగా నిలిచిన ద్రోణాచార్యుల కథ మన పిల్లలకు తప్పక మార్గదర్శకమవుతుంది.

భారతం పిల్లలకు ఉత్తమ సంస్కృతిని, భక్తి భావాన్ని, నీతిని బోధిస్తుంది. భారతానికి సంబంధించిన కొన్ని పిల్లల నవలల్ని గూర్చి తెలుసుకుందాం

1. వేణీ సంహారము 1,2 భాగాలు

—నుదురుమాటి వేంకటరమణశర్మ

2. మహా వీరుడు కర్ణుడు

—రావి ఎస్. అవధాని

3. మహా మేధావి శకుని

కిరణ్ కుమారి

4. రారాజు దుర్యోధన

—కిరణ్ కుమారి

5. మాయా బజార్

—వి. యస్. ప్రకాష్

నుదురుమాటి వేంకటరమణ శర్మ గారి "వేణీ సంహారము"[1] మహాభారత కథ ఇతివృత్తంగా గలది. సభాపర్వంలో దుశ్శాసనుడు ద్రౌపది శిరోజాలను పట్టుకుని

---

1. వేంకటరమణశర్మ, నుదురుమాటి, మారుతి పబ్లికేషన్స్, విజయవాడ, 1979.

ఆమెను సభలోకి ఈడ్చి తెచ్చిన ఘట్టాన్ని ఉదహరిస్తూ క్రమంగా యుద్ధకథనంతా తెలిపి, ధర్మరాజుపట్టాభిషేకంతో రచయిత నవలను ముగించినాడు.

"వేణీ సంహారము" అనే పదంలో వేణి అంటే శిరోజాలని, సంహారం అంటే వాటిని ముడి వేయడమని ప్రదానార్థం. దుశ్శాసనుడు ద్రౌపది శిరోజాలను పట్టుకొన్నప్పుడు అవి విడివడి పోతాయి. భీముడు చేసిన ప్రతిజ్ఞ ప్రకారం ద్రౌపది శిరోజాలు పట్టుకున్న ఆ దుశ్శాసనుణ్ణి ప్రాణాలతోనే చీల్చి ఆ నెత్తుటి చేతుల్తో ద్రౌపది శిరోజాలను ముడివేసి తన ప్రతిజ్ఞ నెరవేర్చుకుంటాడు. నేటి బాలబాలికలకు ఉపకరించే రీతిలో మలచబడిన నవల వేణీ సంహారము.

కర్ణుడు లేని మహాభారతాన్ని మనం ఊహించలేము. మహా వీరుడు, మహా దాత, స్వామి భక్తి పరాయణుడైన కర్ణుని జీవిత చరిత్రను రావి. ఎస్. అవధానిగారు "మహా వీరుడు కర్ణుడు",[1] అనే పేరుతో బాలల నవలగా వ్రాసినారు. కిందటి జన్మలో కర్ణుడు సహస్రకవచుడనే రాక్షసుడు, బ్రహ్మదేవుని వరంతో సహస్రకవచాల రక్షణతో విర్రవీగుతున్న ఆ రాక్షసుని తొమ్మిది వందల తొంభై తొమ్మిది కవచాలను నర నారాయణులు కలసి నాశనం జేస్తారు. మిగిలిన ఒక్క కవచంతో సహస్రకవచుడు భయపడి సూర్యునిలో ఐక్యమై పోతాడు. మరుసటి జన్మలో కుంతికి సూర్యుని ద్వారా కర్ణుడిగా జన్మిస్తాడు. లోకాపనిందకు భయపడి కుంతి కర్ణుని ఒక పెట్టెలో పెట్టి నదిలో వదలివేయగా, అతిరథుడు, రాధ అనే సూత దంపతులకు దొరికి అక్కడే పెరిగి పెద్దవాడవుతాడు. కురుకుమారుల అస్త్రవిద్యాప్రదర్శనలో అర్జునునికి పోటీగా నిలిచి తన అస్త్రవిద్య ప్రదర్శించి వీరుడనిపించు కుంటాడు. దుర్యోధనుడు కర్ణుని మిత్రునిగా స్వీకరించి అంగరాజ్యానికి రాజుగా చేస్తాడు. కౌరవ, పాండవులకు జరిగిన కురుక్షేత్ర యుద్ధంలో పదహారో రోజు కర్ణుని నాయకత్వంలో కౌరవ సేన ముందంజ వేసింది మహా వీరాగ్రేసరుడైనా, ఎంతటి పరాక్రమ వంతుడైనా కర్ణుడు శాపహతుడు మహాదాతస్వామి భక్తి పరాయణుడు, వీరాగ్రేసరుడైన కర్ణుడు మరణించండతో నవల ముగిసి పోతుంది. కర్ణుని ఘనత, వీరత్వం, బాలబాలికల మనస్సులో హత్తుకొటుం దనడంలో సందేహం లేదు.

---

1. అవధాని, రావి. ఎస్. నీతికథాకల్పవల్లి, విశాఖపట్నం-2, 1970.

అనుకూల శత్రువని పేరుగాంచిన శకుని కథను ఇతివృత్తంగా తీసుకుని కిరణ్ కుమారిగారు "మహా మేధావి శకుని"[1] అనే పేరుతో నవల వ్రాసినారు.

గాంధార దేశాన్ని పరిపాలించే రాజు సుబలుడు. అతనికి గల నూరుమంది కొడుకులలో శకుని చివరివాడు. దుర్యోధనుడు రాజ్యకాంక్షతో శకునిని, అతని తండ్రిని, తమ్ముళ్లను బంధిస్తాడు. తండ్రి, అన్నదమ్ములు చావగా శకుని బ్రతికి దుర్యోధనుని మీద కక్ష సాధించాలని అతని పక్షం వహిస్తాడు. పాండవులను మాయా జూదంలో ఓడించి, అడవులకు పంపి యుద్ధానికి కారకుడవుతాడు. కురుక్షేత్రయుద్ధంలో శకుని చనిపోతూతాను చేసిన పాపాలకు భీష్మునికి కారణం వివరిస్తూ అతన్ని క్షమించమని వేడుకుంటూ మరణిస్తాడు. ఈ నవలలో శకుని మేధాసంపత్తు చాలా చక్కగా చిత్రించబడినది.

కిరణ్ కుమారి గారి మరొక పౌరాణిక నవల "రారాజు దుర్యోధన"[2] మహా భారతంలో ముఖ్యమైన పాత్రలలో దుర్యోధనుని పాత్ర ఒకటి. దుర్యోధనునికి చిన్నప్పటినుండి పాండవులంటే అసూయ, ద్వేషం, పాండవులలో బలపరాక్రమవంతుడైన భీముడంటే మరీ ఈర్ష్యచెందేవాడు. శకుని, కర్ణుడు దుశ్శాసనుల ప్రోత్సాహం తో పాండవులను అడవులకు పంపి వారికి సూదిమోపినంత స్థలంకూడా ఇవ్వనని యుద్ధానికి సిద్ధపడతాడు. యుద్ధంలో కౌరవులంతా మరణించిన తరువాత దుర్యోధనుడు ద్వైపాయనం అనే కొలనులో దాగి యుండగా, పాండవులు అతనిని బయటకు రప్పించి ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానిస్తారు. ద్వంద్వయుద్ధానికి భీముణ్ణి ఎన్నుకొని ఆ ద్వంద్వ యుద్ధంలోనే దుర్యోధనుడు మరణిస్తాడు.

వి.యస్. ప్రకాష్ గారి "మాయా బజారు"[3] పౌరాణిక హాస్య నవల. శశిరేఖ అభిమన్యుల వివాహానికి బలరాముడు అంగీకరించక దుర్యోధనుని కుమారుడైన లక్ష్మణకుమారునితో వివాహం నిశ్చయిస్తాడు. అభిమన్యు, సుభద్రల ద్వారా విషయం తెలుసుకున్న ఘటోత్కచుడు శశిరేఖను తన నివాసం చేర్చి, తాను శశిరేఖ స్థానంలో

---

1. కిరణ్ కుమారి. ఐ.యస్ ఆర్. పబ్లికేషన్స్, నెల్లూరు.
2. కిరణ్ కుమారి. ఐ యస్-ఆర్. పబ్లికేషన్స్, నెల్లూరు.
3. వి.యస్. ప్రకాష్, ఐ యస్.ఆర్. పబ్లికేషన్స్, నెల్లూరు

ఉంటాడు. పెళ్ళి సందర్భంగా ద్వారకా నగర వీధుల్లో ఘటోత్కచుని అనుచరులు "మాయాబజార్" ను నిర్మిస్తారు. మాయాబజార్‌లో కౌరవులు నానాబాధలుపడతారు శశిరేఖ రూపంలోవున్న ఘటోత్కచుడు లక్ష్మణకుమారుణ్ణి పెళ్ళిపీటలమీద భయపెట్టి పారిపోయేట్లు చేస్తాడు. దుష్టచతుష్టయాన్ని హస్తినాపురిలో పడేట్లు చేసి, అందరిని తన నివాసానికి చేర్చుతాడు. శశిరేఖ, అభిమన్యుల వివాహంతో నవల ముగిసిపోతుంది. ఘటోత్కచుని చేష్టలు, మాయాబజార్‌లోని వింతలు పిల్లల్ని ఆకట్టుకుని విపరీతంగా నవ్విస్తాయి.

3.3.1.3 భాగవతానికి సంబంధించిన బాలల నవలలు :-

భక్తుల చరిత్ర తెల్పేది భాగవతం. ముఖ్యంగా భాగవతం భ మార్గాన్ని తెలియజేస్తుంది మానవుల ముక్తికి ఉపయోగపడేది భాగవతం. ఈ భాగవతాన్ని భక్తి భావంతో చదివితే భగవంతుని దయకు పాత్రులవుతారని ప్రతీతి. ఆదర్శబాలలు భక్తులైన ప్రహ్లాద, ధృవుల చరిత్ర భాగవతంలోవిదే. ఈ బాలభక్తుల చరిత్ర పిల్లల్లో నైతిక విలువల్ని, భక్తి భావాన్ని పెంపొందింప చేస్తుంది. ఈ భాగవతాన్ని గురించి అందులోని భక్తుల చరిత్రలను గురించి, భగవంతుని లీలలను గురించి పిల్లలు తప్పక తెలుసుకోవాలి. పిల్లలకు ఆదర్శవంతమైన భాగవతానికి సంబంధించిన నవలలు ఎక్కువ రాలేదు.

శీత రాజుగారి "బాల్య స్నేహితులు"[1] భాగవతానికి సంబంధించిన నవల. శ్రీకృష్ణ, కుచేలుల స్నేహ వృత్తాంతం మిందలి ఇతివృత్తం. కృష్ణుడు, కుచేలుడు చిన్ననాటి స్నేహితులు. వాళ్ళిద్దరు చిన్నప్పుడు కలసి చదువుకున్నారు. గురువు సాందీపుని మహర్షి. అప్పటి శిష్యవర్గమందరిలో కుచేలుడు చాలా గుణవంతుడు. కృష్ణుని స్నేహితుడిగా ఉండడానికి కావలసిన సద్గుణాలన్నీ కుచేలుని దగ్గరఉన్నాయి. బుద్ధిమంతుడై క్రమశిక్షణతో విద్యాభ్యాసం చేసేవాడు. శాంతస్వభావం కలిగి ఎవరిని ఏమి అనకుండా సౌమ్యంగా కాలం గడిపేవాడు. ఇన్ని ఉండికూడా దారిద్ర్యబాధ తప్పలేదు. "దరిద్రుడికి సంతతి ఎక్కువ" అన్నట్లు కుచేలునికి సంతాన మెక్కువైనందున ఇంకా ఎక్కువ దారిద్ర్యాన్ని అనుభవిస్తుంటాడు. కుచేలుని భార్య వామాక్షి బిడ్డల ఆకలి చూడ

---

1. శీతంరాజు, మారుతి పబ్లికేషన్స్, విజయవాడ, 1979

లేక భర్త ను శ్రీకృష్ణుని దగ్గరకు పొమ్మంటుంది. "మీరు వెళ్ళి దర్శిస్తే చాలు, అడుగ నక్కరలేదు. మహా సంపదలు వర్షిస్తాడు" అని వెళ్ళమంటుంది. కృష్ణునికి కానుకగా ఇంట్లో ఉన్న కాసిన్ని అటుకులు తెచ్చి తన భర్త కట్టుకున్న వస్త్రానికి కొంగున ముడివేసి పంపుతుంది. భటుల ద్వారా కుచేలుని రాకను తెలుసుకున్న కృష్ణుడు స్వయంగా ఎదురెళ్ళి తీసుకుని వచ్చి ఉచితాసనం మీద కూర్చోబెట్టి పూజిస్తాడు. కుచేలుడు తెచ్చిన అటుకులు ఆప్యాయంగా గుప్పెడు తిని, రుక్మిణీ మందలింపుతో ఆపేస్తాడు. సకల మర్యాదలు పొందిన కుచేలుడు ఇంటికి బయలుదేరుతాడు. అనేక ఆలోచనలతో తన గ్రామం చేరుకుంటాడు. ఇంటి సమీపానికి వచ్చి అక్కడ తనకు సర్వసంపదలు లభించి ఉండడంతో ఆనంద భరితుడవుతాడు. అప్పటినుండి కుచేలుడు సత్కర్మలాచరించుచు, అన్ని పనుల యందు కృష్ణుణ్ణి ధ్యానం చేస్తూ కాలం గడిపాడు.

"గుణాలు మంచివయితే మనసుల్లో కల్మషం లేకపోతే యుగాలు గడిచినా వ్యక్తుల మధ్య స్నేహం మారిపోదనే సత్యం "బాల్యస్నేహితులు" అనే బాలల నవలలో చక్కగా చిత్రితమైంది.

"భగవంతుడు భక్తి బంధానికొక దానికి తప్ప దేనికి వశపడడు. ఆయనకు ఏమి ఇవ్వలేక పోయినా భక్తితో చేతనైనదాన్ని సమర్పించినా తప్పక పరిగ్రహించి అను గ్రహిస్తాడు. ఆయన భక్తుల సేవలనందుకోడమేకాదు, భక్తులకు సకల సేవలు చేస్తాడు అనే భక్తి భావాన్ని కూడా ఈ నవల కలుగచేస్తుంది.

### 3.3.1.4 ఇతర పురాణాలకు సంబంధించిన బాలల నవలలు :-

రామాయణ, భారత, భాగవతాలేకాకుండా మన సంస్కృతి, సంప్రదాయాలు తెలిపే పురాణాలు ఎన్నోఉన్నాయి. వీటి ద్వారా పిల్లలు నేర్చుకోవాల్సినవి చాలా ఉన్నాయి. కొంతమంది రచయితలు వివిధ కాలాల్లో వివిధ సమయాలో పురాణాల్లో జరిగిన సంఘటనలను, కమనీయగాధలను ఆధారం చేసుకుని బాలబాలికలకోసం నవలలు వ్రాసినారు. ఈ నవలలు పిల్లలో పఠనాశక్తిని పెంపొందించి, వాళ్ళలో విజ్ఞానాన్ని, వినోదాన్ని కలుగ చేస్తాయి. పురాణాలోని ఇతివృత్తాన్ని అనుసరించి వ్రాసిన ఈ నవలలు ఏ పురాణాల్లోనివని స్పష్టంగా చెప్పలేము. ఇతర పురాణాలకు సంబంధించిన బాలల పౌరాణిక నవలల్ని గూర్చి పరిశీలిద్దాం.

భారత దేశంలో అనేక పుణ్యనదులు ప్రవహిస్తున్నాయి. ఇవి దేశానికి సర్వ సంపదలనిస్తున్నాయి. ఎందరో ఈ నదులలో స్నానమాడి ముక్తిని పొందినారు. యుగయుగాలనుండి ఈ నదులు ప్రవహిస్తున్నట్లు పురాణాధారాలు ఉన్నాయి. ఎందరో ఈ నదులను దర్శించి తమ పాపాలను పోగొట్టుకుంటున్నారు. ఈ మహానదుల పుట్టుకను గురించి అనేక రకాలుగా, అనేక గాధలు పురాణాల్లో చిత్రింప బడినాయి. ఏ పురాణ మనేది చెప్పడం కష్టం. ఆసక్తి దాయకంగా నీతిదాయకంగా ఉంటాయి.

శ్రీ శిష్టా లక్ష్మీకాంత శాస్త్రి గారు బాలబాలికల విజ్ఞానాభివృద్ధికై భారతావనిలో పెద్దనదులలో ఒకటైన "బ్రహ్మపుత్ర"[1] ను పిల్లలకోసం నవలగా మలచినారు. హరివర్షమనే ప్రదేశంలో చాలామంది మునులు తపస్సు చేసుకుంటూ ఉండేవారు. ఆ ప్రదేశంలో పుణ్యనది లేదనేబాధ అందరికీ ఉండేది. ఒక రోజు మునులందరూ విష్ణువు దగ్గరకెళ్ళితమ బాధ చెప్పుకోగా, అతడు ఉపాయం చెబుతాడు. విష్ణువు ఆ ప్రదేశంలో అమోఘ, శాంతనువుల వివాహం జరుగుతుంది. బ్రహ్మ తేజస్సుద్వారా అమోఘకు జన్మించిన శిశువును శాంతనువు "బ్రహ్మపుత్ర" అనే నామకరణం చేసి, ఎత్తైన పర్వతం మీద పడుకోబెట్టిరాగా, ఆ శిశువు నదిగా మారి బ్రహ్మపుత్రగా పేరుపొందినది ఇది జీవనది.

భరత భూమిలోని పుణ్యనదులలో "గౌతమి" ఒకటి. "గౌతమి"[2] ని గూర్చి అదే పేరుతో శ్రీ శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారు బాలబాలికల కోసం నవలను వ్రాసినారు. ఈ గౌతమీ నది పుట్టుకకు కారకుడు గౌతమి మహర్షి గౌతముడు తన చేతిలోని విత్తనాలు భూమి మీద చల్లగానే అవి ఫలించి వెంటనే పంటనిచ్చే వరాన్ని బ్రహ్మదేవుని ద్వారా పొందినాడు. దేశమంతా కరువు సంభవించినా గౌతముని ఆశ్రమం మాత్రం సుభిక్షంగా ఉండడం కొందరి మునులకు ఈర్ష్య కలిగిస్తుంది. మునులందరూ కలసి ఒక మాయాగోవును సృష్టించి, గౌతముని పంటను మేయమని వదులుతారు. గౌతముడు దానిని అదలించడానికి తమ కమండలం లోని నీరు చల్లి "నీవు పొమ్ము" అని అనగానే గోవు విలవిలతన్నుకుని చనిపోతుంది. గౌతముడు శివుని గూర్చి తపస్సు చేస్తాడు. శివుడుప్రత్యక్షమై తన జట నొకదానిని తీసిచ్చి గోవు మరణించినచోట పిండితే గంగ

---

1,2. లక్ష్మీకాంతశాస్త్రిగారు, శిష్టా, లీలాపబ్లిషర్స్, విజయవాడ-2, 1961

పవహిస్తుందని, పాతకం పోతుందని చెబుతాడు. శివుని జటను గౌతముడు పిండగా ప్రవహించిన గంగయే గౌతమి. ఈ నవల ద్వారా పిల్లల్లో సంప్రదాయ విజ్ఞానం పెంపొందుతుంది.

శీతంరాజుగారి "వైకుంఠ ఏకాదశి"[1] విష్ణుమహిమను తెలిపే నవల. ఒకప్పుడు విదిశాపురాన్ని సద్గుణ సంపన్నుడైన రుక్మాంగదరాజు పరిపాలిస్తూండేవాడు. అతడు ఏకాదశి వ్రతం ఆచరించడమేగాక, తన రాజ్యంలోని వారందరిని ఆచరించమని ఆజ్ఞాపించేవాడు. ఏకాదశి వ్రతం ఆచరించడం వలన అందరికి స్వర్గలోక ప్రాప్తి కలుగుతుండేది. ఇలాగే వ్రతమాచరించడం జరిగితే యమలోకం ఖాళీగా ఉంటుందని బ్రహ్మ మోహినిని సృష్టించి ఏకాదశి వ్రతభంగానికి పంపుతాడు. మోహిని అందానికి ముగ్ధుడైన రుక్మాంగదుడు ఆమెను వివాహమాడతాడు. ఆమె ఎంత వారించినా విన కుండా రుక్మాంగదుడు ఏకాదశివ్రతాన్ని ఆచరిస్తాడు వెంటనే శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమై రుక్మాంగదుని మెచ్చుకుని తనలో ఐక్యం చేసుకోవడంతో నవల ముగిసి పోతుంది.

వైకుంఠ ఏకాదశి వ్రతమాచరించినవారికి స్వర్గలోక ప్రాప్తి కలుగుతుందని ఈ నవల తెలుపడమేగాక, పిల్లల్లో భక్తి భావాన్ని కలుగ జేస్తుంది.

పండరీబోసుగారి "తారకాసురుడు"[2] ద్వాపర యుగంలో మహాతలాన్ని పరి పాలించిన తారకాసురుడనే రాక్షసరాజు కథ ఇతివృత్తంగా గలిగిన నవల. తారకాసు రుని భార్య సురాదేవి. మహా పతివ్రత. వీరికి సంతానం లేదు. తారకాసురుడు బ్రహ్మ కోసం తపస్సు చేసి చక్రాలుకాని చక్రాలు, రధంకాని రధాన్ని, గుర్రాలుగాని గుర్రాలు లాగుచుండగా, మనిషికాని మనిషి ఆ రధంకాని రథాన్ని అధిరోహించి, విల్లుకాని విల్లు చేపట్టి, బాణంకాని బాణాన్నిప్రయోగించి కన్నుకాని కన్నుతో బాణం వేసినవారు మరణం సంభవించేటట్లు వరం పొందుతాడు. దానితో విర్రవీగి స్వర్గలోకం పైకి దండెత్తుతాడు. ఈశ్వరునికి తారకాసురునికి భయంకరమైన పోరాటం జరుగుతుండగా, నారదుడు సురాదేవి పాతివ్రత్యానికి భంగం కలిగించగానే ఈశ్వరుడు తక్షకుని

---

1. శీతంరాజు, అనంత్ పబ్లికేషన్, విజయవాడ—2, 1979.
2. బాలజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, 1979

ప్రయోగించి తారకాసురుణ్ణి సంహరించడంతో నవల ముగిసి పోతుంది. దుష్టునికి ఎప్పటికైనా కీడు తప్పదని ఈ నవల నిరూపిస్తుంది.

గణపతియొక్క లీలావిలాసాలు తెలిపేగాథలు ఇతివృత్తంగా గలిగింది ముద్దా చిట్టిబాబుగారి "కార్యసిద్ధి"[1] నవల. వినాయకుని గురించిన ఉపఖ్యానాలు అనేక పురాణాల్లో అనేక విధాలుగా ఉన్నాయి. 'కార్యసిద్ధి" ఆంధ్రసచిత్రవారపత్రికలో ధారావాహికంగా వెలువడి అందరి మన్ననలు పొందిన నవల. ఈ నవలలో విచిత్రగాథలెన్నో బొమ్మలతో సహా చక్కగా చిత్రింపబడినాయి.

లోక కల్యాణం కోసం జన్మించినవాడు వినాయకుడు. శిష్ట రక్షణకోసం దుష్ట శిక్షణకోసం అవతరించినవాడు. ఇతన్ని పూజించి ప్రారంభించే ఏకార్యానిగ్గాని విఘ్నం రాదు. అందుకనే ఆనాటి నుండి విఘ్నేశ్వరుడనే పేరు స్థిరపడింది.

విఘ్నేశ్వరుడు ఎన్నో సాహసకార్యాలు చేస్తూ, దేవతలను బాధించే రాక్షసులందర్ని సంహరించి, దేవగణాధిపతై, లక్ష్మీగణపతిగా ప్రసిద్ధిచెంది, భారతీగణపతి అనే బిరుదు పొంది సిద్ధి, బుద్ధులను వివాహం చేసుకుని సింహాసనాన్ని అధిష్టించడంతో నవల శుభాంతం, సుఖాంతం.

విద్యార్థుల ఆరాధ్యదైవమైన వినాయకుని లీలా విలాసాలు ప్రతి పిల్లవాడు చదువతగింది.

గీటా సుబ్బారావుగారు "భూలోక సుందరి"[2] అనే నవలను వ్రాసినారు. ఈ నవలలోని ఇతివృత్తం పింగళి సూరనామాత్యుని "కళాపూర్ణోదయం" అనే ప్రబంధం నుండి గ్రహింపబడింది.

ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడు ద్వారకానగరాన్ని పరిపాలించే రోజుల్లో గొప్ప అందగత్తె, సకళవిశారద అయిన "కలభాషిణి" అనే యువతి ఉండేది. "కలభాషిణి" ప్రధాన పాత్రగా ఈ నవలలోని కథ సాగి పోతుంది.

---

1. చిట్టిబాబు, ముద్దా, ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్, విజయవాడ, 1965
2. బాలజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, 1979

బాలబాలికలు ప్రబంధాన్ని అందులోని విషయాల్ని తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో ఈ నవల వ్రాయబడింది.

ఎన్ని పురాణాలు, ఎన్నికథలు, ఎందరో మహాపురుషులు, ఎన్ని భవ్యజీవితాలు ఒక్కొక్క పురాణం ఒక రస గుళిక. ఒక్కొక్క మహాపురుషుడు ఒక్కొక్క దివ్య జ్యోతి. అన్ని మనిషికి మంచిని, సంస్కారాన్ని బోధించే అక్షయనిధులే. అన్నీ సర్వకాలిక సత్యాలకు అక్షర భాష్యాలే. ఇలాంటి పౌరాణిక నవలలు బాలబాలికలకు సరి పడినన్ని లేక పోవడం శోచనీయం.

3.3.2 చారిత్రక నవలలు :-

ఇతివృత్తం పూర్తిగా చరిత్రకు సంబంధించినదిగా, కొన్ని కల్పనలున్నప్పటికి ప్రధాన సన్నివేశాలకు భంగం కలగకుండా సాగేది చారిత్రక నవల. చరిత్రలో జరిగిన ఒక కథ చారిత్రక నవలకు బీజం. ఉదాత్తమైన వ్యక్తుల జీవిత చిత్రణ చారిత్రక నవలల్లో కనిపిస్తుంది. ఒక జాతి జీవితంలోని అమృతమయమైన కొన్ని గాథలే చారిత్రక నవలలనవచ్చు. "ఏ ఒక్క రోజో, ఏ ఒక్క వ్యక్తినో గురించి జరిగిన కథ చారిత్రక నవల."[1] ఒక్క సాహిత్యానికేకాదు; మనం నివసించే పల్లెలకు, పట్టణాలకు, మన దేశంలో ప్రతి గ్రామానికి ఒక అద్భుత గాథ ఉంటుంది. ఇదే మన దేశచరిత్రలోని వైశిష్ట్యం. ఈ చారిత్రక నవల గతాన్ని గురించి చేసే చరిత్ర చిత్రణకన్నా, సత్యానికి దగ్గరగా కూడా ఉంటుంది. చారిత్రక నవలల్లో మొట్టమొదటకనిపించే లక్షణం చారిత్రకత

మన దేశ చరిత్రను పిల్లలు తెలుసుకుని ఉండడం మంచిది, చరిత్రంతా చదవడ మంటే పిల్లలకు విసుగు కలగవచ్చు. ఈ చరిత్రనే సులభశైలిలో చిన్న చిన్న నవలల రూపంలో మలచి పిల్లలకందిస్తే ఆనందంగా చదువుతారు. ఈ చారిత్రక నవలల్లో దర్బారులు, రాజులు, రాజకన్యలు, యుద్ధాలు, పేరోలగాలు, కుట్రలు, కుతంత్రాలు కనిపిస్తుంటాయి. తెలుగు చారిత్రక నవలల్లోని ఇతివృత్తాలలో సగం ఆంధ్ర దేశానికి సంబంధించినవైతే, మిగతా సగం మహారాష్ట్ర, రాజపుత్ర స్థానాలకు, మహమ్మదీయ చరిత్రలకు, గ్రీకు చరిత్రకు సంబంధించినవి ఈ నవలల్లో కొన్ని సుఖాంతాలు, కొన్ని

---

1. నాగభూషణశర్మ, మొదలి, తెలుగునవలావికాసం.

అకుభంతో కూడిన నవలలు ఉంటాయి.

చారిత్రక నవలలు పిల్లల్లో జాతీయభావాలు, దేశభక్తి, ధైర్యసాహసాలు, వీరత్వం, పెంపొందించడానికి తోడ్పడతాయి. ఈ దేశ చరిత్రలు పిల్లల విజ్ఞానాన్ని పెంపొందిస్తాయి. పిల్లలు తమ జాతియొక్క దేశంయొక్క పూర్వ వీరుల చరిత్రను, వారు చేసిన ఘనకార్యాలను, సాధించిన మహోత్తర విజయాలను తెలుసుకోడానికి ఈ చారిత్రక నవలలు తోడ్పడుతున్నాయి. ఇవి పిల్లలకు తమ కర్తవ్యాన్ని తెలుపు తున్నాయి. ఈ నవలల్లోని వీరులు వీర వనితల కథలు పిల్లలకు మార్గదర్శకాలవుతాయి. వీరు చేసిన త్యాగం, చూపిన సాహసాలు పిల్లల్ని ఉత్తేజపరుస్తాయి. ఈ నవలలు పిల్లల భవిష్యజ్జీవితానికి చాలా ఉపయోగపడతాయి.

బుద్ధ భగవానుని పిమ్మట అంతటి మహిమాన్వితుడైన ఆచార్యనాగార్జునుని, పవిత్ర జీవిత చరిత్రను శ్రీ శార్వరిగారు "నాగార్జున"[1] అనే పేరుతో బాలబాలికల కోసం నవలగా వ్రాసినారు. యుగయుగాలుగా తరతరాలుగా తన తాత్త్విక చింతనలో యావత్ప్రపంచాన్ని ఉర్రూతలూగించిన నాగార్జునాచార్యులను గురించి తెలుగు దేశంలో పూర్తిగా తెలియదు. ఇతడు తెలుగునాట సిరపడి పర్వత ప్రాంతంలో నివాసం ఏర్పరు చుకొని దక్షిణాపథంలో బౌద్ధం ప్రచారం చేసినట్లు తెలుస్తున్నది. విదర్భ దేశానికి రాజైన చతురసేనుని కుమార్తె శాంతల మునికుమారుని ప్రేమించిందని తెలుసుకొని చతురసేనుడు ఆ మునికుమారుని కండ్లు పీకించి నాగవనంలో వదలి రమ్మంటాడు. ఆ ముని కుమారుని నాగార్జునునిగా మార్చి అతని పసిహృదయంలోని ఆత్మజ్యోతిని వెలిగిస్తాడు నాగసత్త్వుడు నాగార్జునుడు, కొన్ని సంవత్సరాలు దీక్షతో తపస్సు చేసిన తర్వాత నాగసత్త్వుడు తన విద్యలనన్ని నాగార్జునునికి ఉపదేశిస్తాడు. ఆనాటి నుండి దేశ దేశాలలో బుద్ధభగవానుని శాంతి సందేశం వినిపిస్తూ శాలివాహన రాజైన ఉదయుని ఆస్థానంలో స్థిరపడతాడు. శ్రీ పర్వత ప్రాంతాన నాగార్జుని విశ్వవిద్యాలయ నిర్మాణానికి కారకుడై, బౌద్ధమతాన్ని గూర్చి ఉపదేశిస్తూ నిర్వాణం చెందడంతో నవల ముగిసి పోతుంది. ఇట్టి లోకోత్తర పురుషుని జీవిత చరిత్ర బాలబాలికలకు విజ్ఞానదాయకం.

ఆదర్శవిద్యార్థి జీవితకథాన్ని వస్తువుగా గ్రహించి వావిలాల సోమయాజులుగారు

---

1. పద్మశ్రీ అండ్ కో. చిత్తూరు, 1962

"నాలంద"[1] అనే నవలను రచించినాడు, ఈ నవలలో శిఖిశాతకర్ణ అనే ఉత్తమ విద్యార్థి జీవితం కథావస్తువు. ప్రాచీన భారతదేశంలో "నాలంద" గొప్ప విశ్వవిద్యాలయంగా పేరు పొందినది. శాతకర్ణి, బ్రహ్మాయువు, ధ్వజకేతువు మంగళులు ఉత్తమ విద్యార్థులై నాలందలో విద్యగడించిన తీరు ఈ నవలలో చక్కగా చిత్రించబడినది క్షమాది ఉత్తమగుణ ప్రభావం వలన విద్యార్థులెట్లు ఉపాధ్యాయులకు ప్రీతిపాత్రులై వారి ఆదరానురాగాలతో ఉత్తమవ్యక్తులై, తాము విద్య నేర్చుకున్న సంస్థను జగత్ప్రసిద్ధం కావించడానికి సమర్థులైనారనేది ఈ నవలలో చక్కగా నిరూపించబడినది, ప్రతి విద్యార్థి చదవ తగిన నవల.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి గారి "బంగారు తల్లి"[2] నవల సుమారు రెండు వేలా మూడు వందల సంవత్సరాల క్రితం జరిగినది. గ్రీకు దండనాయకుడు అలెగ్జాండరుకు ఆప్తుడయిన రోహిలసుకుమార్తె పదేండ్ల హెర్మియా ఈ నవలలో కథానాయిక.

అలెగ్జాండరు దండయాత్రలో ఓడిపోయిన అనేకమంది రాజులలో పుష్కలావతిని పరిపాలిస్తున్న విశ్వజిత్తు ఒకడు. అతడు భార్యాబిడ్డలతో పారిపోయి అడవిలో కాలం గడుపుతుంటాడు, విశ్వజిత్తు నిర్మించిన కోటను రోహిలసుకు బహుమానంగా ఇస్తాడు సెల్యూకస్. ఒకరోజు వినోదార్థం పరివారంతో అడివిలోకి వెళ్ళిన రోహిలసుకుమార్తె హెర్మియా దారితప్పి స్పృహతప్పి పడిపోతుంది.ఆ అడవిలో సంచరిస్తూ, హెర్మియాను చూసి తన నివాసానికి తీసికెళ్తాడు విశ్వజిత్తు కొడుకు హరప్రియుడు. ఆ కుటుంబం తన పై చూపిన ఆదరణ, ఆప్యాయతలకు ముగ్ధురాలవుతుంది. తన తండ్రి కారణంగా విశ్వజిత్తు కుటుంబం అడవుల పాలయ్యారని తెలుసుకుంటుంది. చాలా కాలం నుండి విశ్వజిత్తు కుటుంబాన్ని వెతుకుతున్న రోహిలసు హరప్రియుణ్ణి బంధిస్తాడు, ఎంతో సాహసం చేసి హరప్రియుణ్ణి విడిపిస్తుంది హెర్మియా. హరప్రియుణ్ణి తనే విడిపించినావని, శిక్షించమని, విశ్వజిత్తు కుటుంబాన్ని గురించి స్వయంగా అలెగ్జాండరుకు చెప్పి, అతని మన్నన పొందుతుంది హరప్రియుడు చంద్రగుప్తుణ్ణి ఆశ్రయించి తన రాజ్యాన్ని దక్కించుకుని హెర్మియాను వివాహమాడడం ఇందలి ఇతివృత్తం. ఈ నవల

---

1. సోమయాజులు, వావిలాల, ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ, తెనాలి.
2. వెంకటరామచంద్రమూర్తి, పాలంకి. న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్, విజయవాడ, 1978

హెర్మియా ధర్మబుద్ధి, నిజాయితీ, ధైర్యసాహసాలు నిరూపిస్తుంది.

సింగంపల్లి అప్పారావుగారి "దళవాయి రామప్పయ్య"[1] చారిత్రక నవలల్లో పేర్కొనదగినది. కులానికి బ్రాహ్మణుడైనా, కత్తినే వృత్తిగా చేపట్టి కదనరంగంలో వైరివీరుల శిరస్సులతో, బంతులాటలాడుకున్న రామప్పయ్య ఆకాలంలో తెలుగు వీరుల పేరు ప్రఖ్యాతులను దశదిశలా వ్యాపింప జేసిన మహా వీరుడు. ఆ మహావీరుని గాథ ఈ నవలా ఇతివృత్తం. రామప్పయ్య మధురను పరిపాలిస్తుండిన తిరుమల శౌరి నాయకుని మంత్రి, సర్వసైన్యాధిపతి. ఆరోజుల్లో సర్వసైన్యాధిపతిని "దళవాయి" అని సంబోధించేవారు. దళవాయి రామప్పయ్య శత్రువులకు అరివీర భయంకరుడు, రాజకీయపు ఎత్తులు వేయడంలో అద్వితీయుడు, యుద్ధ నీతి తంత్రంలో దళవాయి, రాజభక్తి పరాయణుడు, వినయశీలి, విశేషించి మహారాజైన తిరుమల శౌరినాయకునికి పితృసమానుడు. మధురానగరానికి పదిమైళ్ళ దూరంలో ఉన్న "చతుర్వేది మంగళం" రామప్పయ్య స్వగ్రామం. చిన్నతనం నుండి వేదవేదాంగాలతో బాటు యుద్ధకళ, రాజ్యతంత్రం క్షుణ్ణంగా అభ్యసించినవాడు. తన జీవితాన్నే ప్రభువుకు అంకితం గావించి, చివరకు రామేశ్వరంలో జడైక సేతుపతితో జరిగిన యుద్ధంలో మరణిస్తాడు. ఇది విషాదాంతం. రామప్పయ్య ప్రభుభక్తి, ధైర్యసాహసాలు, విశ్వాసపాత్రత పిల్లలకు మార్గదర్శకాలు.

సింగంపల్లి అప్పారావుగారి "మహారాణాప్రతాపసింహుడు"[2] రసపుత్ర వీరులకు సంబంధించిన కథ.

హిందూ దేశంలో స్వాభిమానులు, అతి సాహసవంతులు, దేశభక్తి పూరితులైన రసపుత్ర వీరులకి మొగలాయిలకు జరిగిన పోరాటం ఈ నవలా ఇతివృత్తం.

దాదాపు 500 సంవత్సరాల క్రితం మేవాడ్ దేశాన్ని రాణాసాంగా పరిపాలిస్తుండేవాడు. ఇతని కుమారుడు ఉదయసింహుడు. ఉదయసింహుడు "పన్నా" అనే దాది సంరక్షణలో పెరుగుతుండేవాడు. పన్నాది నిష్కల్మషమైన రాజభక్తి. అద్వితీయమైన

---

1. భార్గవీ బుక్ లింక్స్, విజయవాడ, 1982
2. బాలజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, 1979

దేశభక్తి, ప్రభుభక్తి, మేవాడ్ రాజ్యాన్ని హస్తగతం చేసుకోవాలన్న కుట్రతో ఉదయసింహుని చంపడానికి వస్తున్నాడన్న వార్త విని, పన్నా తన కుమారునికి ఉదయసింహుని దుస్తులు తొడిగించడం వలన పన్నా కొడుకు చంప బడతాడు. పన్నా ఏ మాత్రం చలించకుండా ఉదయసింహుని ఆశాశాహు దగ్గరికి చేర్చుతుంది. ఉదయ-సింహుని కుమారుడే "ప్రతాపసింహుడు" విదేశాలనుండి దండెత్తివచ్చిన మ్లేచ్ఛులు పవిత్రభారత దేశాన్ని బానిసత్వానికి గురిచేసి పరిపాలించడ మేమిటని, అప్పట్లో ఢిల్లీని పరిపాలిస్తుండిన అక్బర్ చక్రవర్తిని తరిమి కొట్టిన వీరుడు. ఇతని ధైర్యసాహసాల్ని, దేశభక్తిని అక్బర్ స్వయంగా మెచ్చుకుంటాడు. 1595వ సంవత్సరం జనవరి 9వ తేది ప్రతాపసింహుడు మరణిస్తాడు. ఇది విషాదాంతం.

సింగంపల్లి అప్పారావుగారి "మహారాణా హమీర్ సింహుడు"[1] సుఖాంతమైన చారిత్రక నవల.

మేవాడ్ దేశానికి రాజైన లక్షణసింహుడు బాలుడుకావడం చేత పినతండ్రి భీమసింహుడు రాజ్య పాలన చేస్తుండేవాడు. భీమసింహుని భార్య పద్మిని అసమాన సౌందర్యవతి. పద్మిని సౌందర్యాన్ని గూర్చి విన్న అల్లా వుద్దీన్, ఆమె రూపాన్ని అద్దంలో చూసి ఆమె కావాలంటాడు. పద్మిని వేషంలో సైనికులందరు పల్లకిలో వచ్చి అలావుద్దీన్ తరిమికొడ్తారు. లక్ష్మణసింహుడి మనుమడు మహారాణా హమీర్ సింహుడు అల్లావుదీన్‌ను ఓడించి మేవాడ్‌ను ఆక్రమించుకొని సమర్ధవంతంగా మేవాడ్‌ను పరిపాలించిన వీరుడు.

సింగంపల్లి అప్పారావుగారి మరొక నవల "జస్వంత సింహుడు"[2] ఔరంగజేబు నెదిరించి పోరాడిన రసపుత్రుని వీరగాథ ఇతివృత్తంగా గలది.

క్రీ. పూ. 493 సంవత్సరం నుంచి 462 సంవత్సరం వరకు జీవించి మగధ సామ్రాజ్యాన్ని సమర్ధవంతంగా పరిపాలించిన "అజాత శత్రువు"[3] యొక్క గాథను

---

1. భార్గవి బుక్ లింక్స్, విజయవాడ, 1982
2. భార్గవి బుక్ లింక్స్, విజయవాడ, 1982
3. బాలజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, 1979

నవలారూపంలో పలచినాడు సింగంపల్లి అప్పారావుగారు.

మగధ దేశాన్ని సమర్ధవంతంగా పరిపాలించిన హర్యంక వంశస్థుడైన బింబిసారు నికి రెండవ భార్య చలనాదేవి వలన జన్మించినవాడు అజాత శత్రువు. పట్టపురాణి కోసలాదేవి కుమారుడు రాజ్యానికి వారసుడైన సెల్వుణ్ణి పరిమార్చాలని పొరపాటుగా అతని భార్యను చంపడంతో సెల్వుడు బౌద్ధభిక్షువుగా మారిపోతాడు. తండ్రిని, పట్టపు రాణిని బంధించి తనకు తానే చక్రవర్తిగా ప్రకటించుకుంటాడు. అజాత శత్రువు పరి పాలనా దక్షత గలవాడు. కోసల దేశంపై దండెత్తి కోసలరాజైన ప్రసేన జిత్తుకు బందీ అవుతాడు. చెల్లెలు కోసలాదేవి ప్రార్థన ఆలకించి ప్రసేనజిత్తు అజాత శత్రువును బంధవిముక్తుణ్ణి చేయడమేగాకుండా తన కుమార్తె వజ్జిరా నిచ్చి వివాహం జరిపిస్తాడు. అజాత శత్రువు మగధ జేరి తండ్రిని శరణువేడి, రాజ్యానికి చక్రవర్తియై ప్రజాను రంజకంగా పరిపాలిస్తాడు. ఇది సుఖాంతం.

దక్షిణ దేశంలో పుట్టి తన తేజస్సుతో దిక్కులను వెలిగించిన రఘునాథ నాయకుని చరిత్రను జీరెడ్డి చెన్నారెడ్డిగారు "దక్షిణతార"[1] అనే నవలను వ్రాసినారు.

తంజావూరును పరిపాలించిన అచ్యుతనాయకుని కుమారుడు రఘునాథనాయకుడు లక్ష్మణామాత్యుని కుమారుడు వేంకటపతి స్నేహితులేగాక, కవి, పండితులు, వీరి రువురితోపాటు శ్రీరంగ రాయలు హంపెపురంలో తాతాచార్యుల దగ్గర విద్యనభ్యసించి నారు. విజయనగర సామ్రాజ్యానికి వేంకటపతిరాయల తర్వాత వారసుడు రంగరాయలు జగరాజు రాయలను బంధించి, పరిపాలన చేజిక్కించు కుంటాడు. యాచమనాయకుడు రఘునాధనాయకుడు కలిసి శత్రువులందరిని అణచి వేసి విజయనగరానికి రంగరాయల కొడుకైన రామరాయలను రాజుగా పట్టాభిషిక్తుణ్ణి చేయడం ఇందలి ఇతివృత్తం.

"దక్షిణ తార" గ వెలుగొందిన రఘునాథనాయకుని ధైర్యసాహసాలు, ధర్మబుద్ధి ఇందు నిరూపితాలు.

విద్వాన్ కొండూరి నరసింహంగారి "తానాజి"[2] ఆదర్శమైన నవల. ఛత్రపతి

---

1. ప్రభు అండ్ కో, గుంటూరు

శివాజికి ప్రధాన సేనాని తానాజి. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ, ప్రభుభక్తి, దైవభక్తి పరమాశయాలుగా చేసికొని, ఆచరించిన తానాజి హిందూ దేశచరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగినవాడు. కుమారుని పెళ్ళిని ఆపించి "సింహగడ్" కోట మీదికి దండెత్తి, కోటను శివాజి వశం గావించి ప్రాణాలర్పించిన ప్రభుభక్తి పరాయణుడు. తానాజీని గురించి సింహము పోయినది (సింహ) గడము లభించినదని శివాజి ఎంతగానో దుఃఖిస్తాడు.

దేశభక్తి పరాయణతకు ఛత్రపతి శివాజి, వీరమాతలతో జిజియాబాయి ప్రభుభక్తి పరాయణతలో తానాజి మన చరిత్రలో స్థిరస్థాయిగా నిలిచిన మహానుభావులు. ఇట్టి ఉత్తమ చారిత్రక నవలలు బాలబాలికలను మనోవికాసానికి, దేశభక్తిని కలుగ జేస్తాయి.

ఉభయ భాషా ప్రవీణ గుఱ్ఱం జాషువ కవి రచించిన నవల 'చిన్నా నాయకుడు'[1] ఇది గుంటూరు మండలానికి సంబంధించినది ఇందలి కథా నాయకులగు కన్నమదాసు, చిన్నా నాయకుడు వినుకొండకు చెందినవారు. కన్నమదాసు భయంకరాకారుడు, పేరు మోసిన గజదొంగ. బొల్లాపల్లి అడవులు ఇతని నివాసం దారిదోపిడీలు చేస్తూ, స్త్రీలను చెరబట్టుతూ దయలేనివాడై అడవులలో నివసిస్తుండేవాడు. ఒకనాడు కన్నమదాసు అడవిలో ప్రయాణంచేస్తూ ఒక చెంచుకుటుంబాన్ని నిర్దాక్షిణ్యంగా సంహరిస్తాడు. ఆ కుటుంబం నుంచి చిన్నా నాయకుడనే కుర్రవాడు తప్పించుకుని వినుకొండలో ధనిశెట్టి ఆశ్రయాన్ని సంపాదించి అక్కడే పెరుగుతాడు. ఆరోజునుండి కన్నమదాసు మీద కక్షతో అస్త్రవిద్యలో నేర్పు సంపాదించి కన్నమదాసుని సంహరించడం ఇందలి ఇతి వృత్తం.

చిన్నానాయకుని కార్యదీక్ష, పట్టుదల, ధైర్యసాహసాలు పిల్లలకు మార్గ దర్శకాలు.

నండూరి రామకృష్ణమాచార్యగారి నవల "తెలుగు దళవాయి"[2]. ఇందులో

---

1. ప్రభు అండ్ కో, గుంటూరు, 1958.
2. రామా అండ్ కో, ఏలూరు, 1954

తెలుగు దళవాయి యాచమ నాయకుడు. విజయనగర సామ్రాజ్యానికి రంగరాయల కొడుకు రామరాయలను రాజుగా చేయదలచి కుట్ర పన్నిన జగ్గరాజును, ముద్దు వీరప్పను, మాచరాయని ఓడించి రఘునాథ నాయకుని సహాయంతో రామరాయలను విజయనగర సామ్రాజ్యానికి రాజుగా చెయ్యడం ఇందలి ఇతివృత్తం. యాచమనాయకుని ప్రభుభక్తి, దేశభక్తి చక్కగా నిరూపించబడినవి.

జీరెడ్డి బాలచెన్నారెడ్డిగారి "కలము-ఖడ్గము"[1] శ్రీకృష్ణ దేవరాయల కాలం నాటి కథ. విజయదశమి ఉత్సవాలలో పదేండ్ల బాలుడు రాయలమీద ఆశువుగా కవిత చెప్పి రాయల మెప్పు సంపాదిస్తాడు. రాయలు పెద్దనను గురువుగా చేసి ఆ బాలుడైన రఘునాథరెడ్డికి విద్య చెప్పిస్తాడు. రఘునాథుడు కొద్దికాలంలో అన్ని శాస్త్రాలను అభ్యసించి, ఇతర భాషలు కూడా నేర్చుకోవాలని కటకపురానికి వెళ్తాడు. అక్కడ విద్యనేర్చుకుని తిరిగి వచ్చేటప్పుడు అతనికి రాయల గూఢచారిణియైన జయలక్ష్మితో పరిచయం కలుగుతుంది. రఘునాథునికి కవిత్వంతో పరిచయముంది. ఖడ్గంతో పరిచయం లేదు. వాళ్ళిద్దరు దారిలో అష్టకష్టాలు అనుభవించి విజయనగరం చేరి శత్రువుల రహస్యాన్ని అందచేస్తాడు. రాయలకు విజయం చేకూరుతుంది. రఘునాథ, జయలక్ష్మిల వివాహం జరగడం ఇందలి ఇతివృత్తం. ఇది సుఖాంతం.

జయలక్ష్మి శత్రుస్థావరంలో ప్రవేశించి, తన ధైర్యసాహసాలు ప్రదర్శించి వారి రహస్యాలు కనుక్కొని రావడం ఇందు చక్కగా చిత్రితమైనది.

శాతవాహన రాజులలో ఇరవై మూడవ వాడైన "గౌతమీపుత్రశాతకర్ణి"[2] గాధను అదే పేరుతో సింగంపల్లి అప్పారావుగారు వ్రాసినారు. శాతవాహనుల సామ్రాజ్య-ప్రతిష్ఠను పునరుద్ధరించినవాడు, ఆంధ్రుల పేరు ప్రఖ్యాతులు స్థిరస్థాయిగా నిలబెట్టిన వాడు. ఇతని తల్లి పేరు గౌతమి. శాతకర్ణి వేదవిద్యలలో పండితుడు, బాహుబల సంపన్నుడు. ఒకనాడు శాతకర్ణి పులులవేటకుపోయి పులులతో పోరాడుతుండగా, ఇద్దరు స్త్రీలు అతిలాఘవంగా పులుల మీదికి బాణాలు వేసి వాటిని చంపి శాతకర్ణి ప్రాణాలు

---

1. వెంకట్రామ అండ్ కో. విజయవాడ-కర్నూలు, 1954
2. భార్గవీ బుక్ లింక్స్, గవర్నర్‌పేట, విజయవాడ, 1982

రక్షిస్తారు. ఆ స్త్రీలిద్దరూ అవంతీ దేశాన్నేలే సహపాణుని కుమార్తెలయిన వాశిష్ఠిదేవి, శశిశ్రీ. ఆ రోజు నుండి శాతకర్ణి వాశిష్ఠి దేవినే వివాహం చేసుకోవాలని, ఆమెనే ఆరాధిస్తూ ఉంటాడు. చివరకు శాతకర్ణి, వాశిష్ఠి దేవి వివాహంతో నవల ముగిసి పోతుంది.

ఈ నవలలో శాతకర్ణి మాతృభక్తి పిల్లలకు ఆదర్శం. తన తల్లిపేరు కలిపి గౌతమీపుత్ర శాతకర్ణిగా మార్చుకుని ఆదర్శపురుషుడుగా పేరు తెచ్చుకున్నాడు.

ఇంకా పిలకా గణపతి శాస్త్రిగారి "అశోక వర్ధనుడు" (1952) నాదెళ్ళ కృష్ణ మూర్తిగారి "నేతాజి పాల్కర్" బేతవూడి వెంకట శివరావుగారి అమరసింహుడు" (1956) సోమయాజులుగారి "మక్కాంబ" వేదుల కామేశ్వరరావుగారి "రుద్రమదేవి" (1960), వారణాసి గంగాధర శాస్త్రిగారి "స్వయంప్రతిష్ఠ" ప్రతాప కోటయ్యగారి "వీరస్వర్గము" (1953). కొండూరి నరసింహం రాణిగారి "స్వాతంత్ర్య జ్యోతి" మొదలైన ముఖ్యమైన చారిత్రక పిల్లల నవలలు.

ఈ విధంగా చారిత్రక నవలలు పిల్లలకు తమపూర్వుల సాంఘిక, రాజకీయ మత సంస్కృతులను తెలియజేస్తూ పిల్లల్లో జాతీయభావాన్ని, దేశభక్తిని కలిగించి దేశపురోభివృద్ధికి తోడ్పడుతున్నాయి. ఈ చారిత్రక నవలలు పిల్లల్లో మార్పును కలిగించి ఆ మార్పుద్వారా సమాజాన్ని చైతన్యపూరితం చేయిస్తుంది.

ఈ చారిత్రక నవలల ద్వారా పిల్లలు గతంలోని చరిత్ర, సంస్కృతి, నాగరికత తెలుసుకుంటారు. ఇక్కడ పరిశీలించిన చారిత్రక నవలల్లో అధికంగా చరిత్రలోని విషయాలు యథాతథంగా చిత్రించడం జరిగింది దీని ద్వారా పిల్లలకు గత చరిత్ర స్మృతి కలుగుతుంది. ఎదిగే వయసులో పిల్లలకు ఈ గత చరిత్ర స్మృతి చాలా మంచిది. ఈ చారిత్రక నవలల్లో కూడా కొత్తదనం రావాలి. బాలబాలికల్ని ఉత్తేజపరచేటట్లు. చరిత్రలో విషయాలు ఆధారం చేసుకొని సమకాలీన సమాజానికి ఆదర్శప్రాయంగా చారిత్రక నవలలు నిలవాలి. అప్పుడే పిల్లల్లో జాతీయభావం, దేశాభిమానం పెంపొంది ఉత్తమ పౌరులవుతారు. చారిత్రక విషయాల ద్వారా పిల్లల్లో ధైర్యం, త్యాగం, నైతికవర్తన, దేశభక్తి పెంపొందించడం ఈ నవలల ఉద్దేశ్యం.

### 3.3.3 మహాపురుషుల జీవిత చరిత్రలకు సంబంధించిన బాలల నవలలు :-

చారిత్రక నవలల్లో వీరులగాథలే గాకుండా కొంత మంది మహాపురుషుల జీవిత చరిత్రలు కూడా నవలలుగా వచ్చినాయి. చరిత్రకు, చరిత్ర సృష్టించిన మహా పురుషులకు అవినాభావ సంబంధముంది. మన చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయిన మహనీయుల జీవిత విశేషాలు బాలలు తెలుసుకోవడం చాలా అవసరం. నీతినియమాలను, ధైర్య స్థైర్యాలను, వీరశూరత్వాలను, త్యాగధర్మాలను ప్రబోధించే కథలను, గాథలను పిల్లలకు ఉగ్గుపాలతో రంగరించి చెప్పడం మన సంప్రదాయం. మహాత్ముల జీవిత చరిత్రలు బిడ్డల జీవితాలకు మార్గదర్శకాలు బాలల నవలల్లో మహాపురుషుల జీవితాలకు సంబంధించిన నవలలు చాలా తక్కువ.

శ్రీపతి సీతంరాజు సరోజగారి "భద్రాచలరామదాసు"[1] మన చరిత్రలో పరమ భక్తుడిగా ఎప్పటికీ చెరగని సువర్ణాక్షరాలతో లిఖించబడిన ఒక భక్తుని గాథ.

విజయవాడ సమీపాన నేలకొండపల్లి గ్రామానికి చెందిన లింగన్న, కామమ్మ దంపతుల ఏకైక కుమారుడు గోపన్న. చిన్నతనం నుండి ఎంతో భక్తిభావం కలిగి శ్రీరామ నామస్మరణ చేస్తూండేవాడు. శ్రీరామ జన్మదినోత్సవం జరపడానికి డబ్బులేక తన మేనమామలైన అక్కన్న, మాదన్నల దగ్గరకు గోల్కొండ వెళతాడు. గోల్కొండలో తానీషా ద్వారా భద్రాచలానికి తహసిల్దార్‌గ నియమింప బడతాడు. గోపన్న పన్నులను సక్రమంగా వసూలు చేసి తానీషాకు పంపి మంచి పేరు సంపాదించుకున్నాడు. ఆ చుట్టుపక్కల ప్రజలు గోపన్నను ప్రత్యేకాభిమానంతో గౌరవిస్తూ ఉండేవారు. గోపన్న నిరంతరం శ్రీరామనామ సంకీర్తనము చేయడం వల్ల అందరూ అతన్ని "రామదాసు" అని పిలిచేవారు. భద్రాచలం కొండ మీద సీతారామలక్ష్మణ భరత శతృఘ్నుల విగ్రహాలు ఎండకు ఎండి, వానకు తడుస్తూండడం వల్ల, ఆ విగ్రహాలకు గుడికట్టించాలని వెంటనే ఆ పని ప్రారంభిస్తాడు, మధ్యలో పైకం అయిపోవడం వల్ల ప్రభుత్వపు డబ్బుతో గుడి నిర్మాణం పూర్తి చేస్తాడు. ఈ విషయం తెలిసిన తానీషా రామదాసుని చెరసాలలో పెట్టిస్తాడు. రామలక్ష్మణులు మారువేషాలలో

---

1. రాధామాధవ పబ్లికేషన్స్, కేదారేశ్వరపేట, విజయవాడ, 1976

వచ్చి తానీషాకు డబ్బుకట్టి రామదాసుని విడిపిస్తారు. విషయం తెలిసిన తానీషా వెంటనే రామదాసును చెరవిడిపించి పల్లకీలో ఊరేగించి తన తప్పు మన్నించమని వేడుకుంటాడు. తరువాత రామదాసు భద్రాచలం చేరి శ్రీరామ దేవునికి నిత్యం పూజలు చేయిస్తూ శ్రీరామసన్నిధికి చేరుకుంటాడు.

పరమ పావనుడైన రామదాసుగా పరమేశ్వరునిలో ఐక్యమైన గోపన్న మన తెలుగు జాతి గర్వించదగ్గ పరమభక్తుడు.

సింగంపల్లి అప్పారావుగారి "గోస్వామి తులసీదాసు"[1] శ్రీరామ భక్తుల్లో అగ్రగణ్యుడై చరిత్రలో స్థిరస్థాయిగా నిలిచిపోయిన ఒక మహనీయుని గాథ.

ఆత్మారాం, తులసీల కుమారుడు రామ్‌భోలా. పుట్టగానే తల్లిని అయిదు సంవత్సరాల వయసులో పెంచిన తల్లిని పోగొట్టుకున్న నిర్భాగ్యుడు. ఏడేళ్ళ వయసులో తెగిన గాలిపటంలా రోడ్ల వెంబడి తిరుగుతున్న రాంభోలాను కొందరుసాధువులు ఆదరించి ఆశ్రయమిస్తారు. పరమేశ్వరుని ప్రేరేపణ వల్ల "నరహరిదాస్" అనే సన్యాసి రాం-భోలాను చేరదీసి సకల విద్యాపారంగతుణ్ణి చేస్తాడు. తులసీదాసు తన స్వగ్రామం చేరుకుని రామకథాగానం చేస్తుంటాడు. రత్నావళితో వివాహం జరుగుతుంది. కొంత కాలానికి సన్యాసాశ్రమాన్ని స్వీకరించి తీర్థయాత్రలకు బయలుదేరుతాడు. తన భక్తితో ఆంజనేయస్వామి, శ్రీరామలక్ష్మణుల్ని దర్శనం చేసుకుంటాడు. పరమేశ్వరుని ప్రేరణవల్ల శ్రీరామగాథను (శ్రీరామచరితమానస్) పేరుతో రెండు సంవత్సరాల ఏడునెలల ఇరవైఆరు రోజుల్లో వ్రాసి, ఆ కావ్యాన్ని చేతపట్టుకుని కాశీకి బయలుదేరుతాడు. అక్కడ పండితుల అవమానానికి గురవుతాడు ఢిల్లీ పాదుషా అక్బర్ చక్రవర్తికి తులసీదాసు గురించి తెలిసి, తులసీదాసును ఢిల్లీకి ఆహ్వానిస్తాడు తులసీదాసు అక్బర్ ముందు శ్రీరామకథను అతి మనోహరంగా గానం చేస్తాడు.

"లోకంలో అనేక భిన్నభిన్న సాంప్రదాయాలు ధర్మాలు ఉంటాయి. అన్ని మతాలు తమ సాంప్రదాయానుసారం తమకు నచ్చిన భగవంతుని కొలుస్తారు. ఎన్ని మతాలున్నా భగవంతుడొక్కడే" అని అంటాడు తులసీదాసు. తల్లిదండ్రుల యెడల

---

1. బాలజ్యోతి పబ్లికేషన్స్ ఏలూర్‌రోడ్, విజయవాడ, 1979

పిల్లల కర్తవ్యం గురించి భార్యాభర్తల ప్రేమానురాగాల గురించి, భగవంతుని యెడ మానవునికి ఉండవలసిన భక్తి శ్రద్ధల గురించి ఇలా ఎన్నో సామాజిక రాజకీయ విషయాలను గురించి తులసీదాసు తన గ్రంథంలో విపులంగా తెలియజరచాడు.

శ్రీరామ భక్తుల్లో అగ్రగణ్యుడైన తులసీదాసు భక్తి, జ్ఞాన, వైరాగ్యాలనే వాటిని ఆధారం చేసుకుని తన జీవితాన్ని ధన్యం చేసుకున్న మహనీయుడు. క్రీ. శ. 1680 సంవత్సరంలో తన తొంభై ఒకటవ ఏట తులసీదాసు కాశీలోని "అసీఘాట్" వద్ద తన జీవయాత్రను ముగించినాడు. తులసీదాసు మరణించినా అతడు రాసిన రామాయణ మహాకావ్యం అజరామరంగా నిలిచి అతడి కీర్తిచంద్రికలను మానవాళి ఉన్నంత వరకు ప్రసరింప జేస్తూనే ఉంటుంది.

శ్రీమతి సీతంరాజు సరోజ గారి మరొక నవల "భక్త తుకారాం"[1] తుకారాం పాండురంగని భక్తులలో అగ్రగణ్యుడు. తన జీవితాన్ని పాండురంగని కోసం వెచ్చించిన మహనీయుడు. నిత్యం పాండురంగని భజనలతోనే కాలం వెళ్ళబుచ్చేవాడు చివరకు పాండురంగని అనుగ్రహం పొంది అతనిలో ఐక్యమైన ధన్యజీవి.

ఆంధ్రుల సాంఘిక, సాంస్కృతిక పునరుజ్జీవన మహోద్యమాలకు "వేగుచుక్క" అయిన కందుకూరి వీరేశలింగం పంతులుగారి జీవిత చరిత్రను, యస్. మంగాదేవిగారు "వేగుచుక్క"[2] అనే పేరుతో వ్రాసినారు.

వీరేశలింగం పంతులుగారి జన్మస్థలం రాజమండ్రి. సమాజం బాగుపడాలంటే ప్రతి స్త్రీని విద్యావంతురాలినిగా వివేక వంతురాలినిగా చేయాలని నమ్మినవారు. స్త్రీల కోసం ప్రత్యేకంగా పత్రికలు నడిపి, పుస్తకాలు రాసి ప్రచురించినారు. పంతులుగారు ప్రజల్లో మూఢవిశ్వాసాలు పారద్రోలేదానికి శ్రమించి, బహు భార్యత్వం, సతీసహగమనం, బాల్యవివాహాలు నిరసించినారు. వితంతు వివాహాలను ప్రోత్సహించినారు. స్త్రీల కోసం ప్రత్యేకంగా "సతీహితబోధిని అనే మాసపత్రికను నడిపినారు. ఒకటవ తరగతి నుండి పదవ తరగతి వరకు పిల్లలకు కావలసిన వాచక పుస్తకాలు వ్రాసినారు.

---

1. రాధామాధవ పబ్లికేషన్స్, కేదారేశ్వరపేట, విజయవాడ, 1976
2. ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ, బర్కత్‌పుర, హైదరాబాదు, 1982

పిల్లలకు తేలికగా అర్థమవడానికి ఈసప్ నీతి కథలు, సత్య సంజీవని పుస్తకాలే కాక, "సంగ్రహ వ్యాకరణము" అనే తెలుగు వ్యాకరణాన్ని కూడా రాసి ప్రచురించినారు. 1905 సంవత్సరంలో విక్టోరియా వితంతు శరణాలయాన్ని స్థాపించినారు. ఇంకా పంతులుగారు ప్రజలకు ఎంతో మంచి పనులు చేసినారు. మనకు మొట్టమొదటి నవల గా పరిగణింపబడుతున్న "రాజశేఖరచరిత్ర" వ్రాసింది కూడా పంతులుగారే. వీరేశలింగం పంతులుగారు 1919 మే 27న పరమపదించినారు. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు పంతులుగారిని మెచ్చుకుంటూ ఆయన సమాధిమీద ఒకపద్యాన్ని చెక్కినారు,

> "తనదేహము తన గేయము
> తనకాలము తన ధనంబు
> తన విద్య జగజ్జనులకు
> వినియోగించిన ఘనుడీ వీరేశలింగ కవి జనులారా!

వీరేశ లింగం పంతులుగారు కవిగా, సంఘ సంస్కర్తగా, పాఠశాల సంస్థాపకులుగా గొప్ప పేరు సంపాదించిన యుగపురుషుడు. బాలబాలికలకు ఆదర్శపురుషుడు.

మన బాలలకు మహాపురుషుల చరిత్రల గురించి వచ్చిన నవలలు చాలా తక్కువ. పిల్లలకు ఇలాంటి మహాపురుషుల జీవిత చరిత్రలు అందించడానికి ఇంకా కృషి జరగాలి బాలల్లో భక్తి భావం పెరిగి, విషయ పరిజ్ఞానం అలవడాలంటే మహాపురుషుల జీవిత చరిత్రలు తప్పక తెలుసుకోవాలి.

### 3.3.4 సాంఘిక నవలలు :-

సమాజంలో మార్పు సహజం. సాంఘిక జీవనానికి ప్రతిబింబం నవల. సాంఘిక నవల సమకాలిక జీవనానికి దర్పణం వంటిది. రచయిత ఎట్టి ఇతివృత్తాన్ని స్వీకరించినా అందులో సమకాలిక సాంఘిక సంఘటనల ప్రభావం తప్పక ఇమిడి ఉంటుంది. సమకాలిక సాంఘిక జీవితానికి సంబంధించినవన్నీ సాంఘిక నవలలని చెప్పవచ్చు. సాంఘిక చైతన్యం అణువణువున ప్రతిబింబించేవి సాంఘిక నవలలు.

"సమకాలిక సమాజాన్ని ప్రతిబింబిస్తూ ఆ సమాజంలోని వ్యక్తుల జీవితాలపై

సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక ప్రభావాలను పరిశీలించి దానిని కళాత్మకంగా విశ్లేషించి, జీవితాన్ని గురించి పాఠకుల ఆలోచనాశక్తిని పెంచేది ఉత్తమ సాంఘిక నవల"[1].

సంఘంలోని కుళ్ళును, అవినీతిని, అక్రమ పరిస్థితులను చాటిచెప్పి, వాటి పరిష్కారమార్గాన్ని, ఈ సాంఘిక నవలలు సూచిస్తున్నాయి, నేడు నవలా కారులెందరో సాంఘిక సమస్యల్ని ఇతివృత్తాలుగా ఎన్నుకుని, సంఘంలోని సమస్యలను పాత్రల ద్వారా చర్చించి యదార్థ పరిస్థితిని సామాజికుల ముందుంచడానికి ప్రయత్నిస్తున్నారని చెప్పవచ్చు. ముఖ్యంగా విద్యార్థుల మనస్తత్వాన్ని వారి చర్యలను దృష్టిలో ఉంచుకుని వారి జీవితంలో జరిగే సంఘటనలను ఇతివృత్తాలుగా తీసికొని కొంతమంది రచయితలు బాలల కోసం నవలలు వ్రాసినారు. వీటిలో నీతిని బోధించే సాంఘిక నవలలు కూడా ఉన్నాయి. బాలబాలికల పైనందిన జీవితంలోని సాంఘిక సమస్యల్ని నవలా రూపంలో మలిచి, బాలబాలికల దృష్టిని ఆ సమస్యమీదికి ఆకర్షించి, వారికిఆలోచనా దృక్పధాన్ని కలిగించి, సంఘంలో మార్పు తీసుకురావడానికి రచయితలు ప్రయత్నిస్తున్నారు ఇంలాటి నవలలు సంఘ సంస్కారానికి, బాలబాలికల మనోవికాసానికి సాధనంగా కూడా ఉంటున్నాయి.

పిల్లల సాంఘిక నవలల్లో వారి తలిదండ్రులు, తోబుట్టువులు, బంధువులతో సంబంధాలు, పాఠశాల వాతావరణం. ఇతివృత్తాలుగా ఉంటాయి. పిల్లల జీవితం నుండి కథను తీసుకొని దానిని నవలగా మలచినపుడు పిల్లలకు చక్కని నవల తయారవుతుంది.

బాలలకు వెలువడ్డ నవలల్లో అనువాద నవలలు ఎక్కువ సంఖ్యలో ఉన్నాయని చెప్పుకున్నాం, స్వతంత్ర నవలల్ని పరిశీలిస్తే వీటిలో పౌరాణిక, చారిత్రకాలకన్నా సాంఘీక నవలలు ఎక్కువ సంఖ్యలో ఉన్నాయని చెప్పవచ్చు. ఈ సాంఘీక నవలల్లో సాహసిక బాలల నవలలు, వైజ్ఞానిక బాలల నవలలు, హాస్య నవలలు అనే వర్గాలున్నాయి. ఈ నవలలన్ని కేవలం ఇతివృత్త వైవిధ్యాన్ని బట్టి పరిశీలించడం జరిగింది.

---

1. చంద్రశేఖర్, ఎం. ఆధునిక రచయిత్రుల సాంఘీక నవలల సమీక్ష. (అముద్రిత సిద్ధాంత వ్యాసం)

కాణిపాకం లింగన్నగారి "శాంతిచక్రం"[1] 1970 సంవత్సరంలో దేవదత్తం వారపత్రికలో ధారావాహికంగా వెలువడిన బాలల నవల. ఈ నవలా రచనకు ఒక ప్రయోజనం ఉద్దేశించబడింది. ఇరుగు పొరుగు దేశాల మధ్య సరిహద్దు తగాదాలు చెలరేగి, కార్చిచ్చులా వ్యాపించి అయిన వార్ని కానివార్ని అమాంతం హతమారుస్తుంటే అటువంటి భీభత్సం నుంచి శాంతిని, చల్లదనాన్ని మొలిపించడం ఈ నవల లక్ష్యం. ఈ లక్ష్యం సాధించినవాడు శంకరనే చిన్న కుర్రవాడు.

శంకర్ చాలా తెలివైనవాడు. ధైర్య సాహసాలు కలవాడు. చిన్నతనంలోనే తలిదండ్రులను కోల్పోయిన అనాథ. ఇతనికి పుట్టుకతోనే సద్గుణాలు అలవడినాయి. శంకర్ తండ్రి త్యాగరాజు దేశం సరిహద్దుల్లో శాంతి నెలకొల్పడం కోసం ప్రాణాలర్పించిన సార్థక నాముడు. శంకర్‌ను పట్టి బంధించాలనుకున్న రాతిగుండెలు, శంకర్ మంచి ప్రవర్తనకు వెన్నపూసలా కరిగినాయి. మానవత్వంతో ఇరుదేశాల వాళ్ళ కళ్ళు తెరిచారు. ఫలితం ఇరుగు పొరుగు ఒకరై స్నేహాన్ని కోరినాయి. అద్భుతమైన శంకర్ ప్రయత్నాల్లో కుక్క సహాయంగా నిలుస్తుంది. తండ్రికి చెందవలసిన "శాంతి చక్రం" బహుమానం ప్రభుత్వం శంకర్‌కు అందజేయడం ఇందలి ఇతివృత్తం.

ఈ నవల చివర రచయిత బాలబాలికలను శంకర్‌లా నడుచుకోమని, మంచి గుణాలను పెంచుకోమని ప్రబోధిస్తాడు.

"నేటి బాలలే రేపటి పౌరులు" అనే మాట తరచూ వినబడుతూ ఉన్నదే. అయితే వాళ్ళను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దేందుకు కావలసిన కృషి, కార్యదీక్ష, పెద్దలలో అంతగా కానరావడం లేదు. ఇలాంటి రోజుల్లో తన సర్వస్వాన్ని ఈ మహోన్నత లక్ష్యసాధనకే వినియోగించిన ఒక ఆదర్శ ఉపాధ్యాయుని కథే కోడూరి లీలావతి దేవిగారి "ఆశాకిరణం"[2] ఆంధ్ర ప్రభ సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా వెలువడి ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారి బహుమతి పొందిన బాలల నవల.

పిల్లలకోసం వ్రాయబడ్డ ఈ చిన్న నవలలో ప్రధాన పాత్రధారులు బడి పిల్లలు.

---

1. చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘం, చిత్తూరు, 1977
2. వాహిని పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1973

బడిమట్టూ తిరిగే ఈ కథకు అసలయిన కథానాయకుడు గాంధీజీ. అసలైన కథాంశం ఆయన చెప్పిన సూక్తులు. భవాని తెలివైన కుర్రాడు. ఎప్పుడూ క్లాస్ ఫస్ట్ వచ్చేవాడు భవాని, కృష్ణ, మోహన్ క్లాస్‌మేట్స్. కృష్ణ, మోహన్‌లు అహంకారానికి ప్రతి రూపాలు. మోహన్ ఆ స్కూలు కట్టించిన రాజశేఖరం గారి కుమారుడు. తన తండ్రి కట్టించిన స్కూలు కావున తానెప్పుడైనా స్కూలుకు రావచ్చుననే అహంకారానికి తొలిరోజే బుద్ధిచెప్తాడు ఆ స్కూలుకు కొత్తగా వచ్చిన మురళీధరం మాష్టారు. మొదటి చూపులోనే మురళీధరం మేష్టారు అభిమానానికి పాత్రుడయిన భవానినిచూసి ఈర్ష్యపడేవాళ్ళు,వాళ్ళు చేసిన తప్పు తెలుసుకొని పశ్చాత్తాపపడేలా చేస్తాడు మురళీధరం. ఫలితంగా ఒక కాలు పోగొట్టుకుంటాడు. పిల్లలందరూ మురళీధరంతో కలిసి "భారతమాతకు జై", "బాపూజీకి జై" అని నినాదాలు చేస్తుండటంతో నవల ముగిసిపోతుంది.

ప్రతి తల్లి తన ఇంటిలో బిడ్డల బాధ్యత సక్రమంగా నిర్వర్తిస్తే పిల్లలెలా బాగుపడతారో వాళ్ళని నిర్లక్ష్యం చేస్తే ఎలా తయారవుతారో ఈ నవల నిరూపిస్తుంది.

ప్రతిరోజూ ఏదో ఒక దినపత్రికలో "తప్పిపోయాడు" "కనిపించడంలేదు" అనే ప్రకటనలు చూస్తూనే ఉంటాం. అలాపారిపోయే పిల్లలు ఏమవుతారు? ఇంట్లోంచి పారిపోతే ఎంత ప్రమాదమో గీతా సుబ్బారావుగారి "పారిపోయిన బఠాణీ"[1] నవల తెలుపుతుంది. ఇందులో కథానాయకుడు తొమ్మిదేళ్ళ బఠాణీ తెలివైనవాడు. ఒకరోజు బడిమానేసి సినిమాకెళ్ళాడని తండ్రి కొట్టడంతో ఇంట్లోంచి పారిపోతాడు. రైలెక్కి పట్నం చేరుకుని, రౌడీల చేతిలో చిక్కుతాడు. జేబుదొంగగా తయారవుతాడు. అక్కడ నుండి కష్టాలనుభవిస్తూ మంత్రిగారింట్లో పనికి కుదురుతాడు. మంత్రిగారి రహస్య విషయాలను పేపరుకెక్కాయని, దానికి కారణం బఠాణీ అని కొట్టి తరిమేస్తారు. బఠాణీ ఏడుస్తూ ఊరిబయట కాళికాలయం చేరుకుంటాడు. అక్కడ ఒక ధనవంతుని కూతురిని తెచ్చి బలియివ్వడానికి ప్రయత్నాలు జరుగుతుంటాయి. ఈ విషయం పోలీసులకి తెలియజేసి ఆఅమ్మాయిని రక్షిస్తాడు, బఠాణీని తీసికెళ్ళి తల్లిదండ్రులకు అప్పగిస్తారు

1. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, ప్ర.ము. 1960.
ద్వి.ము. 1979.

పిల్లలం తొందరపడి, ఆలోచనలేకుండా ఇల్లు విడిచి పారిపోకూడదని ఈ నవల తెలుపుతుంది.

గీతా సుబ్బారావుగారి మరొక నవల "పూల మనసులు"[1] దారి తెలియని పిల్లలకు దారిచూపే దీపాలు తలిదండ్రులు. ఆ దీపాలు కరువైతే ఆ పిల్లల జీవితాలు ఏమవుతాయి? ఈ సమాజంలో పువ్వులలాగా వికసించవలసిన వాళ్ళు ముళ్ళులాగా ఎలా మారి పోతారు. ముళ్ళుగా మారిన కొన్ని పూల మనసుల కధే పూలమనసులు. ఆంధ్ర ప్రభలో ప్రచురింపబడి ఆబాలగోపాలాన్ని ఆకర్షించిన నవల.

విభిన్న మనస్తత్వాలు గల గోపి, జాని స్నేహితులు. తలిదండ్రులు లేని అనాధలు. న్యాయంగా, నీతిగా, బతకాలన్న ఉద్దేశ్యంతో గోపి హోటల్ సర్వర్‌గా చేరి నైట్ కాలేజీలో చదువుకుంటూ అభివృద్ధిలోకి వస్తాడు. సమాజం మీద కసితో కోపంతో దొంగగా మారుతాడు జాన్. గోపి. మంచితనం వల్ల మారినా పోలీసుల కాల్పుల్లో మరణిస్తాడు. ఈ ప్రపంచంలో అన్నిటికన్నా విలువైన వస్తువులు అమ్మా నాన్నా. ఈ ఇద్దరూ లేకుంటే జీవితం తాడులేని బొంగరం అయి పోతుందని ఈ నవల నిరూపిస్తుంది

హిందూ ముస్లిం కలహాలలో ఎన్నో కుటుంబాలు నాశనమైపోగా, ఒక ముస్లిం కారణంగా తన చెల్లి, తల్లి చనిపోగా, ఆ ముస్లిం కూతుర్నే, ఆదరించిన ఒక చిన్నారి కధే పిళ్ళా సుబ్బారావు గారి "చిన్నారి విజయం"[2].

అందరి హృదయాల్లోనూ ఆనందం ఇవ్వగలిగేది వెన్నెల. చిన్నారి హృదయాలు కూడా వెన్నెల లాంటివే. ఆ చిన్నారి హృదయాలకు కులమత భేదాలు, కొద్ది, గొప్ప తేడాలు లేవు, వాళ్ళు మమతకీ, మంచికి ప్రతిరూపాలు అని ఈ నవల నిరూపిస్తుంది.

బహుముఖ ప్రజ్ఞాశాలియైన కె. సభా గారు బాలబాలికల కోసం కొన్ని నవలలు వ్రాసినారు. ఇతను వ్రాసిన నవల "కవి—గాయకుడు"[3]. చిన్నతనం నుండి మురళి

---

1. బాలజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, 1979.
2. అన్నపూర్ణా పబ్లిషర్స్, విజయవాడ. 1962.
3. బాలవిజ్ఞాన విపంచి, విజయవాడ, 1961

అనే కవి, మోహన్ అనే గాయకుడు ఇద్దరూ మిత్రులుగా ఉండి, పెరిగి పెద్దవారై పేరు ప్రఖ్యాతులు గడించినా విడిపోక అన్యోన్యంగా జీవించడం ఇందలి ఇతివృత్తం. మురళీ, మోహన్‌ల ప్రేమమయ జీవితాలను బాలబాలికల మనస్సును రంజింప చేసేటట్లుగా వ్రాయబడిన చక్కని నవల. ఈ నవలలో పిల్లల స్నేహమాధుర్యాన్ని సభాగారు చక్కగా చిత్రించినారు.

కె సభాగారి "చంద్రం"[1] పిల్లల జీవితాలను చిత్రించే నవల. చంద్రం పేద విద్యార్థి. తండ్రిలేడు. తల్లి ఉన్నా ముసలిది. చాలీచాలని తిండి. చంద్రానికి చదువు కోవాలని ఆసక్తి. ఆశ. స్కూలు ఫీజులు చెల్లించలేని పరిస్థితి. ఫీజు కట్టలేదని అయ్యవారు చంద్రాన్ని స్కూలుకు రానీయరు. ఆ దుర్భర పరిస్థితిలో చంద్రం తన సహాధ్యాయుడు గోపి ఇంట పాలేరుగా చేరుతాడు. గోపి తండ్రి చంద్రం దగ్గర వెట్టి చాకిరి చేయిస్తాడు. చివరకు కాళ్ళు పట్టమని కోరగా, అభిమానం అడ్డొచ్చి మిలటరీలో చేరిపోతాడు. ఆర్నెల్ల తరువాత మిలటరీ శెలవుల్లో తనగ్రామానికి తిరిగి వచ్చిన చంద్రం తన తల్లి మరణవార్త వింటాడు. చంద్రం తల్లిని తలచుకొని ఏడుస్తుండడంతో నవల ముగిసిపోతుంది పేదవాని జీవితానికి ఈ నవల చక్కని ఉదాహరణ.

సభాగారి మరొక చక్కని పిల్లల నవల "సూర్యం"[2]. సూర్యం చాలా తెలివైన కుర్రాడు తన కొడుకు పెద్ద చదువు చదివి గొప్పవాడుకావాలని సూర్యం తల్లి విసుక్కోకుండా శ్రమిస్తూ ఉండేది. చెన్నయ్య మేష్టారి దయ వలన చిత్తూరులో ధర్మ ఫారంలో చేరడమేకాకుండా, సూర్యానికి భోజన వసతి కూడా లభిస్తుంది. తండ్రి చనిపోవడంతో సూర్యం చదువాగిపోతుంది. తండ్రి చేసిన అప్పుకు మునసబుదగ్గర పనికి కుదురుతాడు. ఒకరోజు ఉన్నట్టుండి ఎక్కడికో వెళ్ళిపోయిన సూర్యం పది సం త్సరాల తర్వాత ఊళ్ళో అడుగుపెడతాడు. ఊర్లో చందాలు వసూలు చేసి చెన్నయ్య మాష్టారి పేరుతో ఊరిలో బడినెలకొల్పితాను చదవడానికి పడ్డకష్టాలు మిగతా పిల్లలకు కలగనీయకుండా ఉచిత విద్య ఏర్పాటు చేసి వారితోనే ఉండిపోతాడు.

---

1. దేశిబుక్ డిస్ట్రిబ్యూటర్స్, శరత్ బిల్డింగ్స్, విజయవాడ, 1965
2. ఆదర్శగ్రంధమండలి, విజయవాడ, 1959

చిన్నపిల్లల సున్నితమైన మనస్తత్వాన్ని తెలిపే నవల కె. సభాగారి "పసి హృదయాలు"[1]. వాణి, రాణి, గిరిజ అనే ముగ్గురు పిల్లలు వాళ్ళింట్లో మునగ చెట్టు మీద నివసిస్తున్న తల్లి ఉడుత, పిల్ల ఉడుతతో ఆడుకోవడం ఇందలి ఇతివృత్తం. పిల్లలు పిల్ల ఉడుతకు ఆహారం పెట్టడం, ద్రాక్షపండ్లు కొమ్మకు కట్టడం, ఉడుత పిల్లను తిసమనడం పిల్లల అమాయక మనస్తత్వానికి నిదర్శనం.

సదానందం మేష్టారు ఒకరోజు ఒక గమ్మత్తయిన కల గంటారు. ఆ కలలో పిల్లలు పరిపాలించే ఒక రాజ్యాన్ని చూస్తారు. అదే సభాగారి "పిల్లల రాజ్యం"[2]. పిల్లల రాజ్యంలో పదిసంవత్సరాల వయసుగల పిల్లలు అన్ని పదవులను సమర్థవంతంగా నిర్వహిస్తూ ఆ రాజ్యాన్ని పరిపాలిస్తూంటారు. "ఆ పిల్లల రాజ్యంలో ప్రేమ రాజ్యమేలు తుంటుంది, కరుణ పరిపాలిస్తుంటుంది. సత్యం రక్షణ వహిస్తుంటుంది. ఓర్పు నిర్వహిస్తుంటుంది. శాంతి అధికార వహిస్తుంటుంది ఆ రాజ్యంలో ఒకే ఒక సూత్రం విశ్వాసం. సదానందం మేష్టారుకు మెలకువ రావడంతో కలగరిగిపోయి వాస్తవం లోకి రావడం ఈ నవలా ఇతివృత్తం. సదానందం మాష్టారు అలాంటి పిల్లల రాజ్యం కోసం కలలు గంటూ ఉంటాడు."

"ఓ భగవాన్
ఎప్పుడు కన్పిస్తుంది నాకాలోకం
ఎంత చక్కని లోకమాలోకం
ఎంత సుందరమైనదా లోకం
ఆ లోక మొక్కటే నాలోకం
అది యెంత చిత్రమైనది అద్భుతం
కలలోనైనా ఒకసారి కన్పించునా?
కరుణించి చూపించు కల్యాణమూర్తి
మఱువ జాలను ప్రభూ మఱచిపోలేను
మా పిల్లలకు ప్రసాదించు మాలోకం"

---

1. బాల విజ్ఞాన విపంచి, విజయవాడ, 1961.
2. ఆదర్శగ్రంథ మండలి, విజయవాడ, 1958

అంటూ పిల్లలందరికి కలలో కనిపించిన "పిల్లల రాజ్యం" కావాలని భగవంతుని ప్రార్థించడంతో నవల ముగిసిపోతుంది.

శ్రీయుతులు కొలిపాక మధుసూధనరావు, పబ్బరాజు గోపాలరావు గారు "మోగిన గంట" అనే నవలను వ్రాసినారు. సూర్యాపతి అనే అమాయకపు బాలుని జీవితం ఇందు చిత్రంపబడింది ఒక స్నేహితుడు ఆటలో సూర్యాపతి మనసు గాయ పరచగా, సరోజక్క వద్దకు వెళతాడు. ఆమె వేరేవిధంగా అతనిని గాయపరుస్తుంది. మతిస్థిమితం పోగొట్టుకున్న ఆబాలుడు సికింద్రాబాద్ చేరుకుని చాలా బాధలు పడుతుంటాడు చివరకు ఒక శరణాలయంలో బుద్ధదేవుని చిత్రపటం ముందు మోకరిల్లినపుడు ఆ బాలుడు చిత్తశాంతి పొందడం ఇందలి ఇతివృత్తం. పసిపిల్లలు సున్నిత హృదయా లెట్లుంటాయో ఇందు చిత్రింపబడింది.

చింటూ అనే కుర్రాడు చేసిన సాహసగాథ సి. కనకాంబర రాజుగారి "చింటూ తెచ్చిన తంటా"[1]. రాజారమేష్ చంద్రగారు అనాథ ఆశ్రమం నుండి చింటూని తెచ్చి పెంచుకుంటుంటారు. వారికి గోపి పుట్టగానే అమ్మగారికి చింటూ మీద ప్రేమతగ్గి, కోపగించుకునేది కొందరు దొంగలు డబ్బుకోసం గోపి అని చింటూని తీసి కెళ్ళి, రాజారమేష్ చంద్రగారికి డబ్బుకోసం ఉత్తరం వ్రాస్తారు. చింటూ అక్కడినుండి ఉపాయంతో తప్పించుకుని వచ్చేస్తాడు. దొంగలు నిజంగానే గోపీని తీసికెళ్ళిపోతారు గోపీని తీసికెళ్ళే దొంగ తన తండ్రని చింటూకు తెలుస్తుంది. పోలీసులకు దొంగల స్థావరం చూపెడతాడు. పోలీసులు చింటూకు బహుమతి ఇస్తామంటే వద్దని నాన్నని విడిపించమంటాడు.

చింటూ దొంగల స్థావరం నుండి తప్పించుకోడానికి చేసిన ప్రయత్నాలు పిల్లల్ని బాగా ఆకట్టుకోగలవు

పిల్లల మనస్తత్వాలు విచిత్రంగా ఉంటాయి. పిల్లల విచిత్ర మనస్తత్వాన్ని ఇతివృత్తంగా తీసుకొని అరవిందగారు "ప్రేమమంత్రం"[2] అనే నవలను వ్రాసినారు.

---

1. వాహినీ ప్రచురణాలయం, విజయవాడ, 1976
2. నవజ్యోతి పబ్లికేషన్స్, విజయవాడ, 1973

ఇది ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ (1972) బహుమతి పొందిన పిల్లల నవల.

పిల్లలది ఒక వేరే ప్రపంచం. వాళ్ళు చాలా సుకుమారంగా ఉంటారు. అప్పు డప్పుడు కొందరు పిల్లలు విచిత్రంగా అందరికంటె భిన్నంగా ప్రవర్తిస్తుంటారు. ఈ కోవకు చెందినవాడు రాము. తలిదండ్రుల ఆప్యాయత, ఆదరణ లేక విచిత్రంగా తయారవుతాడు. ఇతనిది పిల్లల్ని రెచ్చగొట్టి ఆనందించే స్వభావం. రాము; రాజు మురళి, సుధ, పాపని రెచ్చగొట్టి పెడదారి పట్టిస్తున్నాడని కుసుమ మందలిస్తుంది. దానితో కుసుమ మీద కోపం పెంచుకుంటాడు. తరువాత కుసుమ ఆప్యాయత ప్రేమ, ఆదరణ రాముని మంచివాడుగ మార్చివేస్తుంది. పిల్లలు అమానుషంగా ప్రవర్తించి నపుడు వాళ్ళని సరైన మార్గంలో మళ్ళించాలంటే ఆప్యాయత, ప్రేమ, స్నేహం మాత్రమే పనికొస్తాయని ఈ నవల నిరూపిస్తుంది

"చిన్నారి బాలల హృదయాల్లో పెద్దలు ఏ విజ్ఞాన బీజాలు వెదజల్లితే అవే వారి కీర్తి కిరణాలకు బీజాక్షరాలుగా ప్రకాశిస్తాయి" దీన్ని ఆధారంగా తీసుకుని తంగెళ్ళ పాండురంగశర్మగారు "గులాబి బాలలు" [1] అనే చక్కని పిల్లల నవలను వ్రాసినారు.

రఘు, ఆనంద్‌లు మంచి స్నేహితులు. ఒకే బడిలో చదువుతూండేవారు. ఆనంద్‌కు తలిదండ్రుల ప్రోత్సాహముంది. రఘు అడుగడుగునా తండ్రికోపానికి గురికావలసి రావడంతో ఆ చిన్నారి హృదయం సంఘర్షణకు గురవుతుంది. ఒకరోజు రఘు తండ్రి ఎక్కువగా కేకలెయ్యడంతో నదిలో దూకుతాడు. దారిన పోయేవాళ్ళు రఘుని రక్షించి ఆనంద్ వాళ్ళిళ్ళు చేరుస్తారు. ఈ సంఘటనతో రఘు తండ్రి మారి పోయి రఘుని ఆప్యాయంగా చేరదీస్తాడు. రఘు, ఆనంద్‌లు "గులాబి బాలలు" నాటికను ప్రదర్శించి బంగారు పతకం పొంది, అందరి మన్ననలు పొందడంతో నవల ముగుస్తుంది.

పిల్లలను తల్లిదండ్రులు సహృదయంతో అర్థం చేసుకున్నప్పుడే వారు అభి వృద్ధిలోకి రాగలరని ఈ నవల నిరూపిస్తుంది.

---

1. శర్మ పబ్లికేషన్స్, విజయవాడ, 1965
2. కవితా పబ్లికేషన్స్, విజయవాడ, 1964

గమ్మత్తయిన ఇతివృత్తంలో కొమ్మూరి వేణుగోపాలరావు గారు "పిల్లదొంగ"[1] అనే చక్కని నవల వ్రాసినారు.

థర్డు ఫారం చదివే శంకరం ఇందులో కథానాయకుడు. తండ్రి నారాయణరావు తన ఖర్చుకి సరిపడే డబ్బు లివ్వడం లేదని శంకరం అడపాదడపా దొంగతనం చేస్తుంటాడు. శంకరానికి చలం ప్రాణస్నేహితుడు. స్కూల్లో తెలుగు మేష్టారు "పిల్లదొంగ" నాటికలో శంకరం చేత 'పిల్లదొంగ" పాత్ర వేయిస్తాడు. అందరూ పిల్లలదొంగ పాత్రని ప్రశంసిస్తారు. అప్పుడప్పుడూ దొంగతనం చేస్తూ శర్మాయితో చేరి చెడు అలవాట్లు నేర్చుకుంటాడు. తరువాత తప్పు తెలుసుకొని చలంతో స్నేహంగా ఉండి ఇక దొంగతనం చేయకూడదని నిశ్చయించుకుంటాడు. కాని రాము తల్లి చావు బతుకుల్లో ఉందని, ఇంజక్షన్లకి డబ్బు అవసరమై దొంగతనం చేస్తూ తండ్రికి పట్టుబడతాడు. తండ్రి వెంటనే శంకరాన్ని రిఫర్మేటరీ స్కూల్లో చేర్పించడం ఈ నవలా ఇతివృత్తం.

పిల్లల అవసరాలు, కోరికలు గురించి తలిదండ్రులు తమని అర్థం చేసుకోనప్పుడు పిల్లలు పెడత్రోవ తొక్కుతారని ఈ నవల నిరూపిస్తుంది.

పిల్లలందర్ని బాగా ఆకర్షించే నవల ఆర్.ఆర్. ఉప్పుటూరిగారి "నెహ్రూక్లబ్బు" బాబు, శశి, ఉమాపతి, రాము, శ్రీధర్, అరుణ స్నేహితులు. శెలవుల్లో మామూలుగా పిల్లలందరూ కలిసి ఆడుకుంటూ ఉంటారు. అలాగే ఈ పిల్లలందరూ కలిసి నవంబరు 14వ తేదిన చాచానెహ్రూ పుట్టినరోజున "నెహ్రూక్లబ్బు" ఏర్పాటు చేసి క్లబ్బంతా చాచానెహ్రూ ఫోటోలతో అలంకరిస్తారు. ఆ రోజు పిల్లలందరూ వాళ్ళ తలిదండ్రులను ఆహ్వానించి "నెహ్రూకబ్బు" ప్రారంభిస్తారు. అందరూ "చాచానెహ్రూ అమర్ రహే" అని నినాదాలు చేయడం ఇందలి ఇతివృత్తం. దేశభక్తి ప్రబోధించే ఈ నవల పిల్లల కోమల హృదయాలను రంజింప చేస్తుంది.

నార్ల చిరంజీవిగారి "వీధి గాయకుడు"[3] చక్కని పిల్లల నవల. పేదవాడైన

---

1. కవితా పబ్లికేషన్స్, విజయవాడ, 1964.
2. శ్రీరమణా పబ్లిషర్స్, చిత్తూరు, 1964.
3. దేశికవితా మండలి, విజయవాడ, 1955

ఒక వీధి గాయకుణ్ణి బంగారు పట్నంలోని కోటీశ్వరులు అవమానించి అతనిద్వారా తిరుగులేని గుణపాఠం నేర్చుకోవడం ఇందలి ఇతివృత్తం.

బంగారు పట్నంలో కుంటి వేణు కుటుంబం తప్ప మిగతా కుటుంబాలన్ని కోటీశ్వరులవే. సంత రోజున ఆ పట్నంలో ప్రతి ఇంట్లో ఎలుకలు కుప్పలుకుప్పలుగా బయలుదేరి అందర్ని బాధపెట్టుంటాయి. ఎలుకలను చంపినవారికి వెయ్యి వరహాలిస్తానని మంగళరాయడనే కోటీశ్వరుడు ప్రకటిస్తాడు. వీధిగాయకుడు మురళి వాయించి ఎలుకలను దూరంగా తరిమి, వాటి బెడద వదిలిస్తాడు. డబ్బుకోసం వచ్చిన వీధి గాయకుణ్ణి మంగళరాయడు అవమానించి పంపుతాడు. మరుసటి రోజు పట్నంలోని పిల్లలందర్ని మంగళరాయుని ఒక్కగా నొక్క కొడుకుతో సహా తన మురళీగానంతో-

"పాపల్లారా! నాకూనల్లారా
పండువెన్నెలలు చిలికే బాబుల్లారా!
మురళీగానం వినిపిస్తోందా?
ముద్దూముచ్చట వినిపిస్తోందా?
తీయని కలలో మునిగిన పాపా
తేరుకొనీ ఇటురావే పాపా
పెదవులు నవ్వులు చిందేపాపా
కదిలీనీవిటు చూడవె పాపా
తూగుటుయ్యేలల పవళించారా
రాగమధువులను చిలికించారా
మత్తు నిద్దురలు విడివస్తారా
కొత్తలోకమును గనవస్తారా"
(వీధిగాయకుడు, పు. 51, 52.)

పాడుకుంటూ పిల్లలందర్ని కొండగుహలోకి తీసికెళ్ళిపోతాడు. వీధిగాయకుడు పిల్లల కోసం ఒక కొత్త లోకాన్ని సృష్టిస్తాడు. కుంటి వేణుపై ఆ మురళిగాన ప్రభావం పడదు వీధిగాయకుని చరిత్ర పిల్లల భాషలో చెక్కి, వేణు అక్కడే ఉండిపోతాడు.

ఈ నవల అట్టమీద, లోపల వేసిన బొమ్మలు అత్యంత ఆకర్షణీయంగా ఉండి పిల్లలను మరోకొత్తలోకాలకు తీసుకువెళ్ళి, కొత్త ఆలోచనలు కలిగిస్తుంది.

చావరాల సరళాతిలక్ గారి "చిన్నారి మనసులు"[1] పిల్లల మనస్తత్వాన్ని వివరిస్తూ వ్రాయబడింది. గిరిజది జాలిగుండె. బొమ్మల పెళ్ళి చేయడానికి గిరిజ స్నేహితురాళ్ళు, గిరిజ తమ్ముడి చిన్నారి స్నేహితులు గిరిజ వాళ్ళింటో చేరి ఆట మొదలు పెడ్తారు. ఆటకు గిరిజావాళ్ళింటి నౌకరు కూతురు సుబ్బి రావడాన్ని పిల్లలందరూ వ్యతిరేకిస్తారు. సుబ్బి కోసం గిరిజ "బొమ్మల పెళ్ళి" ఆట మానేస్తుంది. సుబ్బిని సుబ్బలక్ష్మిగా చేసి తన పలకిచ్చి స్కూలుకి తీసికెళ్తుంది గిరిజ. సుబ్బిని గూర్చి అందరికి చెప్పి, పిల్లల్లో పరివర్తన తెప్పించి సుబ్బిని చదువు కొనేటట్టు చేస్తుంది. చివరగా అందరూ కలిసి "బొమ్మల పెళ్ళి" చెయ్యడం ఇందలి ఇతివృత్తం.

గిరిజలాగా అందరూ సుబ్బిలాంటి పిల్లల్ని అభివృద్ధిలోకి తీసుకరావాలని ఈ నవల తెలుపుతుంది. అట్టమీద, లోపలి బొమ్మలు పిల్లలకు ఆకర్షణీయంగా ఉండి ఆశక్తి కలిగిస్తుంది.

జయశ్రీ మల్లిక్‌గారి "సాహసయాత్ర"[2] పిల్లలందరూ చదవదగిన నవల.

ఉపాధ్యాయులు స్కూలు పిల్లలందర్ని ఒక అడవిలోకి విహార యాత్రకు తీసుకు వెళ్తారు. అడవిలో కోయయువకులు ప్రాణాలకు తెగించి క్రూర మృగాలతో పోట్లాడి చంపడం పిల్లలకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. కల్తీలేని స్వచ్ఛమైన రుచి కరమైన కోయల ఆహారాన్ని రుచిచూస్తారు. అమాయకులైన ఆ కోయలతో కొన్ని రోజులు గడిపి, తిరిగి రావడం ఇందలి ఇతివృత్తం.

విహారయాత్రలకు పిల్లల్ని ఎప్పుడూ సుందర ప్రదేశాలకే తీసుకువెళ్ళకుండా అప్పుడప్పుడూ అడవి ప్రదేశాలకు కూడా తీసికెళ్తే, పిల్లల్లో మానసిక వికాసం కలిగి భయాందోళనలు తొలిగిపోయి ధైర్య సాహసాలు కలగడానికి దోహదం చేస్తుందని

---

1. బుడుగు బుక్స్, విజయవాడ, 1983
2. దేశి కవితా మండలి, విజయవాడ,

ఈ నవల నిరూపిస్తుంది.

ఇద్దరు అన్నదమ్ముల ప్రేమమయ జీవితాన్ని కనక మేడల వేంకటేశ్వరరావు గారు "అన్నదమ్ములు"[1] అనే నవలగా వ్రాసినారు. భాను, రాము వరుసకు అన్నదమ్ములు. వీళ్ళిద్దరి తలిదండ్రులకు సరిపడదు. భాను, రాము ఒకే స్కూల్లో చదువుతుంటారు. భానుతో చేరి రాము చెడిపోతున్నాడని రాముని వాళ్ళమ్మ చదువుకు వేరే ఊరికి పంపుతుంది. అక్కడ రాము అనేక కష్టాలు ఎదుర్కొవడం వల్ల సరిగా చదవలేక పోతాడు. కాని రాము పరిస్థితిని తల్లి అర్థం చేసుకోదు. భాను తలిదండ్రుల ఆదరణతో, ఆప్యాయతతో బాగా చదువుకుంటాడు ఎటూ పోలేని పరిస్థితులో రాము ఒకరోజు ఇల్లు వదలి పారిపోయి నావికుడుగా చేరిపోతాడు.

పెద్దల్లో ఉండే విరోధాలు పిల్లల దాకా రానీయకుండా పిల్లల్ని అర్థం చేసుకోవాలని ఈ నవల తెలుపుతుంది.

కప్ప గంతుల మురళీకృష్ణగారి "గోపి చదువు"[2] చక్కని ఇతివృత్తం గల పిల్లల నవల. తలిదండ్రులు లేని గోపి కిష్టయ్య మేష్టారి ఆప్యాయితతో, జాన్ రాముల సహాయంతో కొన్ని ఇళ్ళు భిక్షం ఎత్తుకొని శ్రద్ధగా చదువుకుంటూ ఉంటాడు. ఒకరోజు భిక్షానికి వెళ్ళగా తన క్లాస్‌మేట్ శ్యామల తండ్రి రామలింగయ్య పరిచయమవుతాడు. అప్పటినుండి శ్యామల వాళ్ళ కుటుంబం గోపీని ఆదరిస్తుంది. రామలింగయ్య గోపిని చదివించి శ్యామలనిచ్చి వివాహం జరిపిస్తాడు. గోపి కష్టపడి పై చదువులు చదివి ఉద్యోగం సంపాదించుకుంటాడు. ఎన్ని కష్టాలొచ్చినా పిల్లలు శ్రద్ధగా కష్టపడి చదివితే జీవితంలో ఉన్నత దశను చేరుకోవచ్చునని ఈ నవల నిరూపిస్తుంది.

హైస్కూలు ఉపాధ్యాయులకు సంబంధించిన సంఘటనలతో ప్రాథమిక పంతుల జీవిత ప్రత్యక్షనరకం కె. సభాగారి 'బడిపంతులు'[3] ఆంధ్రప్రభ దినపత్రిక ఆదివారం సంచికలలో ప్రచురింపబడిన నవల.

---

1. దేశ కవితా మండలి, విజయవాడ,
2. క్వాలిటీ పబ్లిషర్స్, విజయవాడ, 1978
3. భగవాన్ అండ్ కో. చిత్తూరు, 1955

బ్రహ్మయ్య అనే ఒక ఉపాధ్యాయుని జీవితచరిత్ర బడిపంతులు. చిన్నప్పటినుండి బడిపంతులు ఉద్యోగమంటే ఇష్టపడేవాడు బ్రహ్మయ్య. తను కోరినట్లుగానే బడిపంతు లయ్యాడు. ప్రతిరోజూ పాఠశాలకు వెళ్ళడమంటే బ్రహ్మయ్యకు పరమానందం. నవ్వుతూ పాఠం చెప్పేవాడు. కరుణ గాథలను వినిపించి ఆ లేతమనస్సులను ద్రవింప చేసేవాడు. సాహసగాథల్ని ప్రదర్శించి వారిలో పౌరుషాగ్నులను ప్రజ్వలింప చేసేవాడు. బ్రహ్మయ్య పాఠాలు పిల్లలకు తియ్యని పాయసాలు బ్రహ్మయ్యను హైస్కూలుకు బదిలీ చేయడంతో కష్టాలు ప్రారంభమవుతాయి. జీతాలు సరిగా అందక, ఇల్లు గడవక, అప్పులపాలై తిండి లేక కృశించి మరణించడం ఇందలి ఇతివృత్తం.

ఈ నవలలో జీవితంలోని ఆనందాలు, ఆవేదనలు వాస్తవ దృష్టితో చిత్రించ బడినది.

ముద్దంశెట్టి హనుమంతరావు గారు "వాసుచదువు"[1] అనే నవలను వ్రాసినారు. వాసు తండ్రి వ్యవసాయదారుడైనా తన కొడుకు బాగా చదివి మంచి ఉద్యోగం చెయ్యా లని పంపుతాడు. వాసు స్నేహితుడు ధర్మారావు. వాసు తనుండే ఊర్లో చదువైపోగా మేనత్త ఊర్లో చదివి స్కూలు ఫైనల్ పాసవుతాడు. ధర్మారావు చదువు మానుకుని ఒక ఫ్యాన్సీషాపు పెట్టుకుని ఉంటాడు. ఉద్యోగాల వేటలో అలసి పోయిన వాసుని తన షాపులో చేర్చుకొని ఇద్దరూ షాపుని అభివృద్ధి చేసుకొని హాయిగా జీవించడం ఇందలి ఇతివృత్తం.

"చేతిలో ఉన్నదాన్ని వదులుకొని, లేనిదానికోసం పరుగెత్తడం అవివేకం అని ఈ నవల నిరూపిస్తుంది

ఆలూరి భుజంగరావుగారి "కుక్క ఆత్మకథ"[2] పిల్లల్ని ఆకర్షించి, అలరించే నవల.

ఒక సామాన్యమైన కుక్కపిల్ల కొన్ని మంచిపనులు చేసి గొప్పస్థితికి వస్తుంది. ఆ కుక్క చేసిన మంచి పనులే ఈ నవలా ఇతివృత్తం.

---

1. ఆదర్శగ్రంథ మండలి, విజయవాడ, 1955
2. సాహితీ కేంద్రం, తెనాలి, 1954

కుక్కపిల్లను చిన్నపిల్లలు ఎలా ఏడిపించేది ఈ నవలలో వివరంగా చెప్ప బడింది. పిల్లలు ఏడిపించేటప్పుడు అంటే చిన్నకుక్కపిల్లల చెవులు పట్టి పైకెత్తి కింద పారెయ్యడం; చలికాలంలో చల్లని నీళ్ళలో ముంచడం లాంటివి చేస్తుంటారు. పిల్లలూ! మీరు ఇలాంటి పనులు చెయ్యద్దని కుక్క చెబుతుంది కుక్క పెరిగి పెద్దదై శాస్త్రులు గారింట్లో చేరుతుంది. ఏట్లో మునిగి పోతున్న శాస్త్రులుగారి కొడుకుల్ని రక్షిస్తుంది. చివరకు ఒక దొరని అపాయం నుండి రక్షించడంతో దొర, దొరసాని కుక్కని వాళ్ళ స్వదేశానికి తీసుకు వెళతారు.

ఒక సామాన్యమైన కుక్క కర్తవ్యాన్ని అనుసరించి, ధర్మం తప్పకుండా నడిచి, విశ్వాసం ప్రకటించి గొప్ప స్థితికి చేరుకుంటుంది. బాలలందరూ ఇలాగే ధర్మం తప్ప కుండా నడవాలని ఈ నవల తెలియజేస్తుంది.

ఐ. నాగుమల్లారెడ్డిగారి "పోలీసుకుక్క"[1] పిల్లల్ని ఆకర్షించే నవల.

కలవారింట దాదాపు సగం జీవితం సేవలు చేసి, వారితో సమానంగా సుఖాలను భవించిన ఓ కుక్క ఆ ఇంట్లో నుండి తరమబడి ఆ వూరిలో బ్రతుకు భారంగా తోచి, పువ్వులమ్మినచోట కట్టెలమ్మలేక వేరే ఊరికి పోయి అక్కడ కొన్ని మంచి పనులు చెయ్యడం ఇందలి ఇతివృత్తం.

ఉన్న ఊరు వదిలి వెళ్ళిపోయిన కుక్క అనేక సంఘటనలు చూసుకుంటూ ప్రజల్ని, ప్రభుత్వాన్ని మోసగించి దొంగ ధాన్యం రవాణాదార్లను పోలీసులకు పట్టిస్తుంది, పిల్లల్ని దొంగతనంగా ఎత్తుకుపోయి జేబుదొంగలుగా తయారుచేస్తున్న ముఠా ఆచూకి తెలియజేస్తుంది. మొదట తను నివసించిన ఇంటి అమ్మాయి సుగుణ తప్పిపోగా ఆ అమ్మాయిని కాపాడుతుంది, ఇలా కుక్క విశ్వాసానికి మారుపేరుగా ఎన్నో సాహసోపేతకార్యాలు చేసి, పోలీసుశాఖలో స్థిరపడిపోతుంది.

స్వామిభక్తికి, స్నేహానికి, విశ్వాసానికి మూగజీవులు ప్రబల నిదర్శనాలని ఈ నవల తెలుపుతుంది.

---

1. విజయసాహితి, నెల్లూరు, 1966

ఎల్లోరాగారు రచించిన "మందారాలు"[1] నవల పిల్లలకు ప్రత్యేకమైన వసతులు కావాలని ప్రబోధించే నవల.

అరుణ, రజని అనే అక్కాతమ్ముళ్ళు ఒక కల గంటారు. ఆ కలలో రేపటి లోకం ఎలా ఉంటారో చూస్తారు. ఆ కలలో వాళ్ళు "ఐకమత్యం" అనే దేశాన్ని చేరుకుంటారు. అక్కడ "నవోదయం" అనే ఒక చిన్న బాలునితో పరిచయం అవుతుంది. "నవోదయం" వీళ్ళకు ఆ దేశంలో పిల్లలకున్న అన్ని ప్రత్యేకతలు చూపిస్తాడు. ఆ దేశంలోని పిల్లల ప్రత్యేకత, పిల్లల ఆహార విశేషాలు, బాలల నాటక మండలి, బాలల సినిమా సెంటరు, చిల్డ్రన్స్‌పార్కు, బాలల పఠన మందిరం పిల్లలకు ప్రత్యేకంగా ఉండడం అక్కడి విశేషం.

బాలలకు మంచిని, నీతిని, విజ్ఞానాన్ని ఇచ్చే చిన్నపిల్మలు, పిల్లలకు ప్రత్యేక సినిమా థియేటర్లు, నాటక శాలలు చదువు కోవడానికి విరివిగా బాలసాహిత్యం వెలువడాలని, బాలల రచనలకు, రచయితలకు, ప్రోత్సాహమివ్వాలని, బాలబాలికల కోసం ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలనే ఉద్దేశ్యంతో ఈ నవల వ్రాయబడింది.

చిల్డ్రన్స్ సైకాలజీకి తగినట్లుగా బోధనాపద్ధతులలో, పాఠ్యక్రమాలలో, స్కూలు నడుపు విధానాలలో, టీచింగ్‌లో అడుగడుగునా కొత్తవిధాలను ప్రవేశపెట్టాలని, బాలలకు సంబంధించిన అన్ని విషయాల్లో ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలనే ఉద్దేశ్యంతో ఈ నవల వ్రాయబడింది.

ఇటువంటి 'చిన్నారి లోకం" పిల్లలకు ఎంతైనా అవసరం.

ఇంకా ఉన్మాదిగారి "ఉన్మాదిని" (1949) బలివాడ కాంతారావుగారి "బూచీ" మొదలైనవి ముఖ్యమైన సాంఘిక నవలలు. ఈ సాంఘిక నవల మరలా

1. బాలల సాహసిక నవలలు
2. బాలల హాస్య నవలలు

---

1. ఎల్లోరా, అన్నపూర్ణా పబ్లిషర్స్, విజయవాడ, 1963

3. బాలల వైజ్ఞానిక నవలలు

అని మూడు వర్గాలుగా విభజించి పరిశీలించడం జరిగింది.

3.3.4.1 సాహసిక నవలలు :-

సాహసాలంటే పిల్లలు చాలా ఇష్టపడతారు. పిల్లల్లో సాహస ప్రవృత్తి ఎక్కువగా ఉంటుంది. ఏదో చెయ్యాలని, ఎవ్వరూ చెయ్యని పనులు చేసి గౌరవం పొందాలని పిల్లలకుంటుంది. అందుకే పిల్లలు సాహసాలన్నా, సాహసాలకు సంబంధించిన పుస్తకాలన్నా ఆసక్తి చూపుతారు. సాహసిక నవలలంటే ఆనందంగా, ఆశ్చర్యంగా చదువుతారు. ఇవి పిల్లల్లో ఉత్తేజాన్ని, ఆసక్తిని, మనోధైర్యాన్ని పెంపొందిస్తాయి.

యుగంధర్‌గారి "టింకూ సాహసాలు"[1] పిల్లల సాహసిక నవల. ఈ నవలలో కథానాయకుడు టింకూ రాత్రిపూట అందరూ నిద్రపోయాక పిల్లలందర్నీ కూడగట్టుకుని కొండ అవతల ఒక గుహలో చేరి "దొంగలముఠా" తయారుచేస్తాడు. చీపురు పుల్లల కత్తులు, విరిగిపోయిన చేటలు డాల్లుగా ఉపయోగించి దార్లుకాచి దోపిడి చెయ్యాలనేది టింకూ ఉద్దేశ్యం. ఆ ముఠాకి నాయకుడు టింకూ. మిగతా పిల్లలందరి ముందు ఎత్తైన బండపై కూర్చుని "టింకూ దొరకి జై" అనిపించుకుని సంతోషంతో పొంగిపోతాడు. అర్థరాత్రి కొండపైన గుహలో చేరి టింకూ చేసిన సాహసాలు పిల్లల్ని ఆకర్షిస్తుంది. అంత చిన్నకుర్రవాడి ధైర్య సాహసాలకు ఆశ్చర్యం కలుగుతుంది.

రవిగారి "సాహసి గోపి"[2] పిల్లల సాహస నవల. ఎనిమిదేళ్ళ గోపి ఇందులో కథ నాయకుడు. గోపికి అత్త జగదాంబ తప్ప ఎవరూ లేరు. జగదాంబ అంటే గోపికి భయం. ఒకరోజు వనమాలను వెతుక్కుంటూ వెళ్ళిపోయి, అడవిలో ఒక ఏటి ఒడ్డున పడి నిదర పోతాడు. ఉదయం లేచి వనమాలతో వచ్చిన గోపిని ఒక పల్లెటూరికి పంపుతుంది జగదాంబ. గోపి అక్కడ గొడ్లుమేసే పని చేసేవాడు. ఒక

---

1. యుగంధర్ బుక్స్, విజయవాడ, 1979
2. కె.యస్.ఆర్. అండ్ సన్స్, విజయవాడ.

రోజు గోపి దారి తప్పి అడవిలోకి వెళ్ళిపోతాడు. ఆ అడవిలో దారితప్పి ఏడుస్తున్న మధుమతి అనే రాజాగారి అమ్మాయిని వాళ్ళ ఇంటికి చేరుస్తాడు. గోపి చేసిన ఈ సాహసాన్ని మెచ్చుకుని జగదాంబ అనుమతితో రాజాగారు గోపిని తమతో ఉంచ కుంటాడు.

ఏ దిక్కూలేని గోపి ఒక సాహసపు పని చేసినందువల్ల, రాజాగారి ప్రాపు సంపాదించి సుఖంగా బ్రతుకుతాడు.

గిరిజశ్రీ భగవాన్‌గారి బాలల బొమ్మల సాహసిక నవల "ఓపాపకథ"[1]

ఒకపాప అంతకు ముందు జన్మలో రాధగా ఉండి, ఒక కోటీశ్వరుని కూతురు. తను ప్రేమించిన యువకుని వివాహం చేసుకోవడానికి తండ్రి ఇష్టపడ లేదని, ఆ యువకునితో కలసి "రత్నగిరి" లో కాపురం పెడ్తుంది ఒకరోజు అతను పట్నం వెళ్లొస్తానని తిరిగి రాడు. రాధ తన తల్లి నగలను రత్నగిరి కొండలలో ఎక్కడో దాచి మరణించి పాపగా పుడ్తుంది. ఆ నగలకోసం చాలామంది పాపను వేటాడుతారు. చివరికి పోలీసులు ఆ నిధిని స్వాధీనం చేసుకోవడంతో నవల సుఖాంతమవుతుంది.

అక్రమం, అన్యాయం ఎప్పుడూ జయించవని ఈ నవల నిరూపిస్తుంది.

గొల్లపూడి మారుతీరావుగారి "రజనీకాంత్"[2] అనే బాలల నవల పిల్లల సాహసాలను తెలిపే నవల.

రజనీకాంత్‌కు బామ్మ తప్ప ఎవరూ లేరు. వాళ్ళిద్దరిని ఊరు వెలివేయడంతో, ఊరికి దూరంగా ఒకగుడిసెలో నివసిస్తూఉంటారు ఒకానొక విచిత్రపరిస్థితుల్లో "గోపూ" అనే కుర్రాడు పరిచయం అవుతాడు ఆ పరిచయం ప్రాణస్నేహంగా మారుతుంది. గోపుకి ఒక బాబాయి ఉంటాడు. "రజీ" (రజనీకాంత్) చేసే సాహసాలు గోపుని ఆకట్టుకుంటాయి. "రజీ" ఒక్కడే అర్థరాత్రి ఎవరూ తోడు లేకుండా పడవలో ఎక్కి

1. ఐ.యస్.ఆర్. పబ్లికేషన్స్, నెల్లూరు.
2. గొల్లపూడి మారుతీరావు, నవోదయపబ్లిషర్స్, విజయవాడ, 1960

అవతలి ఒడ్డులో ఉన్న లోయలో, తోటలో ఉండి వస్తాడు. అతడి సాహసం గోపుని ఆశ్చర్యపరుస్తుంది. ఒకరోజు గోపు, రజీ ఆ లోయలోకి వెళ్తారు. రజీ అర్ధరాత్రి భయం లేకుండా శ్మశానంలోకి కూడా వెళ్తాడు. రజీకి ఉన్న ఏకైక ఆధారం వాళ్ళ బామ్మ చనిపోతుంది. "రజీ" గోపు ఇద్దరే కలిసి గొయ్యి తవ్వి శవాన్నిపూడుస్తారు. అప్పటినుండి "రజీ" ఒక్కడే లోయలో ఉంటాడు. అక్కడ ఆశీర్వాదం అనే సైనికుడితో పరిచయం అవుతుంది. అతడు "రజీ"ని పెంచుకుంటానంటాడు. కాని దురదృష్టవశాత్తు ఆశీర్వాదం చనిపోతాడు. అప్పటి నుండి "రజీ" నాటకాలాడి ఎన్నో సాహసాలు చేస్తూ చివరకు బిక్షగాడుగా చనిపోతాడు.

తల్లిదండ్రులు లేని పిల్లలు, దిక్కులేనివాళ్ళుగా ఎలా తయారవుతారో, చివరకు వాళ్ళ జీవితాలు ఎలా అంతమవుతాయో ఈ నవల నిరూపిస్తుంది. ఇందులో "రజీ" చేసిన సాహసాలు కుక్కలాగ, పిల్లిలాగ అరచిన అరుపులు పిల్లల్ని ఆకర్షిస్తాయి.

3.3.4.2 హాస్య నవలలు :-

హాస్యమంటే తెలియని వాడుగాని, నవ్వడానికి రానివాడుగాని ఉండడంటే అతిశయోక్తి కాదేమో. హాస్యమనేది ఒక శారీరక ప్రక్రియ. ఇది మనో ప్రసన్నతను బయటకు వ్యక్తం చేస్తుంది. మానవుని సహజ ప్రవృత్తులలో నవ్వు ఒకటి. మన ఆలంకారికుల పరిభాషలో "నవ్వు" అంటే "హాస" మనిపేరు. ఈ "నవ్వు" పసి పిల్లలను ఆనంద లోకాల్లో ముంచెత్తు తుంది. హాస్య రచనలంటే పిల్లలు చాలా ఇష్టపడతారు. పసిపిల్లల నవ్వులో వారి మనో ప్రసన్నత గోచరిస్తుంది. తెలుగులో పిల్లల హాస్య పత్రికలు, హాస్య రచనలు చాలా తక్కువగా వచ్చాయని చెప్పవచ్చు. ఇతివృత్తంలో హాస్యం, వినోదం గల పిల్లల నవలలు చాలా తక్కువ. వాటిలో పుస్తక రూపంలో చాలా తక్కువ గా వచ్చినాయి

హాస్య ప్రధానేతి వృత్తంగా రచనలు చేసిన వారిలో ముళ్ళపూడి వెంకటరమణ గారు ముఖ్యులు. ఈయన ప్రతి రచనలోని ప్రతిమాటలో హాస్యం తొణికిసలాడు తుంటుంది. వీరు రచించిన పిల్లల నవల "బుడుగు"[1]. ఇది బాలబాలికల విచిత్ర

---

1. బుడుగు బుక్స్, విజయవాడ, 1, ప్ర.ము. 1967, ద్వి.ము. 1981
2 1980

మనస్తత్వాన్ని చిత్రించే హాస్య నవల. ఇది రెండు భాగాల నవల. వార పత్రికలో సీరియల్ గా ప్రచురింపబడి పలువురి ప్రశంసలు పొందిన నవల. రెండు భాగాలలోను అట్టపైన, అట్టలోపల వేసిన బొమ్మలు అత్యంత ఆకర్షణీయంగా ఉండి, పిల్లలకు విషయాన్ని సుబోధకం చేస్తుంది. ఈ నవలా భాగాలు రెండింటికి కథానాయకుడు "బుడుగు". అతనికి మరోపేరు పిడుగు బుడుగు యొక్క వింత చేష్టలు, ముద్దు ముద్దు మాటలు పిల్లల్ని కడుపుబ్బ నవ్వించగలవు. ఏడుసంవత్సరాల హీరో 'బుడుగు" ప్రవైటు మాస్టర్ల దగ్గర, పెద్దవాళ్ళ దగ్గర మాట్లాడేతీరు పిల్లల్ని గిలిగింతలు పెడుతుంది. ఈ నవలలో బుడుగు గాక, అమ్మ, నాన్న, బాబయి, సీగానపె సూనాంబ, బామ్మ, లావుపాటి పక్కింటి పిన్ని, సీతా అంతా చిత్రవిచిత్రాలుగా మనకళ్ళకు కనిపించడం విశేషం.

ఈ నవలను గురించి రేడియో అన్నయ్య న్యాయపతి రాఘవరావు గారు బుడుగు బాలల మనస్తత్వానికి సరిపోదని అన్నారు ముళ్ళపూడి వెంకటరమణ గారు వాడిన శబ్దస్వరూపాల మార్పుకు రాఘవరావు గారు తీవ్రమైన అభ్యంతరం తెలిపినారు. మొత్తం మీద వెంకటరమణగారి "బుడుగు" పిల్లల్ని హాస్యలోకాల్లో ముంచెత్తుతుంది.

యుగంధర్ గారి బాలల బొమ్మల హాస్య నవల "టింకూ-బుడిగి"[1] ఈ నవలలో మధ్య మధ్యలో కడుపుబ్బ నవ్వించే కార్టూనుండడం మరో విశేషం. ఈ నవలలో కథానాయకుడు టింకు. హిప్పీ మావయ్య సిగరెట్లు తాగడం చూసిన టింకూ వాళ్ళమ్మకి చెబుతాననడంతో టింకూకు హిప్పీ మావయ్య చాక్లెట్లుకు డబ్బు లిస్తుంటాడు. హిప్పీ మావయ్య రాధను ప్రేమిస్తున్నాడని తెలుసుకుని, తను కూడా ఎవర్నైనా ప్రేమించాలను కుంటాడు. తనకు నచ్చిన పిల్లకోసం తెగ వెదికి, టింకూ స్కూల్లోనే చదువుతున్న "బుడిగి"ని ప్రేమించాలనుకుని బుడిగికి చెప్పడంతో నవల ముగిసిపోతుంది. హిప్పీ మావయ్యకు టింకూకు జరిగిన సంభాషణ పిల్లల్ని కడుపుబ్బ నవ్విస్తుంది

హాస్యరాజుగారు రచించిన పిల్లల హాస్య నవల "లంబు-జంబు"[2]

---

1. యుగంధర్ బుక్స్, విజయవాడ.
2. వికటకవి పబ్లికేషన్స్, మద్రాసు, 1982

"లంబు_జంబు" అనే ఇద్దరు డిటెక్టివ్‌లు గుర్నాధం ఇంట్లో దొంగను పట్టుకోవడం ఇందలి ఇతివృత్తం. "లంబు, జంబు" ఇద్దరూ ప్రయివేట్ ప్రాక్టీస్ చేస్తుంటారు, వాళ్ళ దగ్గరకి ఎవరూ రారు. ఏదో చిన్న చిన్న కేసుల్లో ఆత్రుతకొద్దీ తలదూర్చి భంగపడుతుంటారు. ఆ వూళ్లో గుర్నాధం అనే ఫ్యాక్టరీ యజమాని వీళ్ళ దగ్గరకొచ్చి తన ఇంట్లో జరిగే దొంగతనాలు, తనకొచ్చే ఆకాశరామన్న ఉత్తరాల విషయం కనుక్కోమంటాడు. అడ్వాన్సుగా రెండు వేలు ఇవ్వడంతో లంబు-జంబుకు మూర్ఛవచ్చినంత పనవుతుంది. ఆ కేసులో తప్పక జయం పొందాలని నిశ్చయించుకుని పరిశీలించి గుర్నాధం ఇంట్లో దొంగగా ఉంటున్న వంటవాడు గంగరాజుని బంధిస్తారు. బ్యాలన్స్ పదివేల రూపాయలు తీసుకుని, తమ ఫస్ట్ కేస్ సక్సెస్ కావడంతో చేటంత ముఖాలతో ఆనందంగా నిష్క్రమించడంతో నవల సుఖాంత మవుతుంది.

లంబు_జంబుల ఆఫీసుగది, వారు ప్రవర్తించిన తీరు పిల్లల్ని హాస్యలోకాల్లో ముంచెత్తుతుంది.

3 3.4.3 వైజ్ఞానిక నవలలు :-

విజ్ఞాన విషయాలకు, కల్పన జోడించి రాసిన నవలలు వైజ్ఞానిక నవలలు. పిల్లలకు వైజ్ఞానిక విషయాలను సులభంగా, అర్థమయేటట్లు బోధించాలని కొంత మంది రచయితలు వైజ్ఞానిక నవలను వ్రాసినారు. ఈ నవలలు పిల్లలకు ఆసక్తిదాయకంగా ఉంటాయి. కాని బాలల నవలా సాహిత్యంలో వైజ్ఞానిక నవలలు అతి తక్కువగా వచ్చినాయి. ఇంగ్లీషులో హెచ్.జి.వెల్స్, ఫ్రెంచిలో జూల్స్‌వెర్న్ మొదలైన వాళ్ళు గొప్ప వైజ్ఞానిక నవలలు వ్రాసినారు. ఇవి ప్రపంచ ప్రఖ్యాతి పొందినాయి వైజ్ఞానిక కల్పనకు ముఖ్యంగా అద్భుతం, భీభత్సం, రక్తం కరుడు కట్టించే భయం వంటివి కావాలి. ఈ వైజ్ఞానిక నవలల్లో ఫ్లయింగ్ సాసర్లు, పేలిపోయే నక్షత్రాలు, గ్రహాలు, విజ్ఞాన శాస్త్ర విషయాలు ఇతివృత్తాలుగా ఉంటాయి.

వైజ్ఞానిక నవలల్లో చెప్పుకోతగ్గది కంచి రమాదేవిగారు రాసిన "అనంతంలో అంతం" బాలబాలికలకు వైజ్ఞానిక సాహిత్యం పట్ల అభిరుచి కలిగించాలని, సాహిత్య అకాడమీ వాళ్ళు స్త్రీల చేత నిర్వహించిన పోటీలో బహుమతి పొందిన నవల.

"సునంద" లోకవాసియైన "హరియస్" అనే శాస్త్రజ్ఞుడు ఈ నవలలో ముఖ్య

పాత్రధారి జరిగిన రెండు వందల కోట్ల సంవత్సరాలనుండి సునంద లోకంలో భూలోకంలో మానవ ప్రగతికి సంబంధించిన విషయాలను వివరిస్తాడు. మారణాస్త్రాల ఉత్పత్తి కొరకు జరిగిన పోటీలలో తన దేశం తునాతునకలై పోగా, అతడు ఒక్కడే మహా శాస్త్రాల సహాయంతో యోగశక్తులతో ఆ ప్రమాదం నుండి బయటపడి భూలోకాన్ని చేరుకుంటాడు. భూలోకంలో హారియన్ దీర్ఘ కాలం నిద్రతో గడిపి, భూలోకంలో జరిగే అణుశాస్త్ర సంబంధమైన పరీక్షలు జరుగుచున్నాయని, ఇది తనకు యోగ్యమైన స్థానం కాదని, మానవ స్పర్శ సోకని గురుగ్రహానికి పోయి అక్కడ తన జాతి వాళ్ళను సృష్టించి, వాళ్ళ అభివృద్ధికి తోడ్పడతానని హారియన్ చెప్పడం ఇందలి ఇతివృత్తం.

"మానవ కల్యాణానికి దోహదకారి కావలసిన మహత్తర విజ్ఞానాన్ని అసూయ ద్వేషాలతో స్వార్థపరత్వంతో ఉపయోగించుకుంటే అది సర్వనాశనానికి దారితీస్తుందని" హారియన్ స్వానుభవాలు తెలుపుతాయి. రేడియో, టెలివిజన్, కాలయంత్రం మొదలైనవి దేశప్రగతికి తోడ్పడే విధానాన్ని చక్కగా వివరించినారు.

విజ్ఞాన శాస్త్రం పదునైన కత్తిలాంటిదని, దాన్ని చక్కగా ఉపయోగించే విధానం పైన్నే ప్రగతిగాని, వినాశనంగాని జరుగుతుందని ఈ నవల ద్వారా తెలుసు కోవచ్చు.

శ్రీ నోరి రామకృష్ణగారి "సూర్యయానం" పిల్లలందరూ చదవదగిన ఉత్తమోత్తమమైన వైజ్ఞానిక నవల.

విజ్ఞాన విషయాలలో ఆసక్తి గల ఒక ఉపాధ్యాయుడు తన మేధా సంపత్తితో విమానంలాగా ఆకాశంలో పయనించే సూర్యయానం అనే ఒక నూతన యంత్రాన్ని కనిపెడ్తాడు. ఈ విషయాన్ని క్లాసులోని పిల్లలకు చెప్పి, తమ సాధ్యమైనంత త్వరలో ఆఫ్రికాలోని భయంకరమైన అడవుల్లో ప్రకృతిని పరిశోధించడానికి వెళ్తున్నానని చెబుతాడు. ఈ విషయం విన్నరాముకి తాను కూడా మేష్టారితో పోవాలనిపించి తల్లితో చెబుతాడు. తల్లిని ఒప్పించి గురువుతో "సూర్యయానం" లో ప్రయాణించి, ఆఫ్రికా అడవుల్లో గల నరమాంస భక్షకులతో పోరాడి, వాళ్ళని వశపరచుకొని, ఏనాడో వెళ్ళి పోయిన తండ్రిని, అక్కడ కలుసుకొని తిరిగి భారత దేశానికి రావడం ఇందలి

ఇతివృత్తం.

అవసరాల రామకృష్ణరావు గారి "గణిత విశారద" వైజ్ఞానిక పిల్లల నవల. శారద అనే అమ్మాయి పెరిగేకొద్దీ గణితశాస్త్రంలో ప్రావీణ్యం సంపాదిస్తుంది. ఆమె ప్రశ్నలకు ఎవ్వరూ సమాధానాలు చెప్పలేక పోతుంటారు. చివరకు ఆమెకు పెళ్ళి కూడా ఒక సమస్య అవుతుంది. విజ్ఞానవర్మ శారద ప్రశ్నలకు సమాధానాలు చెబుతాడు. గాయత్రీదేవి ప్రత్యక్షమై శాస్త్రాలు సద్వినియోగం చెయ్యమని చెప్పి దీవిస్తుంది.

ఈ నవల పిల్లలకు ఉత్కంఠరత కలిగిస్తుంది. ఈ నవల పిల్లలకు గణితశాస్త్రం లోని విచిత్రాలను తెలియచెబుతుంది.

ఈ విధంగా బాలల నవలల్ని అనువాద, పౌరాణిక, చారిత్రక, సాంఘిక నవలలుగా వర్గీకరించి, ఇతివృత్తాలను పరిశీలిస్తే ఇవి పిల్లలకు మార్గదర్శకాలుగా, ఆదర్శవంతంగా ఉన్నాయి సాంఘిక నవలల్లోని ఇతివృత్తాలు పిల్లల జీవితాలకు దగ్గరగా ఉన్నాయి. చాలా వరకు పిల్లలే పాత్రలుగా గల ఇతివృత్తాలున్నాయి. పిల్లలకివి తమప్రవర్తనలోని లోపాలను సరిదిద్దుకోవడానికి ఎంతగానో ఉపయోగపడతాయి

బాలల నవలల్ని వర్గీకరించి ఇతివృత్తాల్ని పరిశీలించడం ఈ అధ్యాయంలోని విషయం. బాలల నవలల్లోని వివిధాంశాల్ని తరువాతి అధ్యాయంలో పరిశీలించడం జరిగింది.



# 4

# బాలల నవలలు-వివిధాంశాలు

"మానవ జీవిత యదార్ధ చిత్రణము" నవల అనే యదార్థాన్ని చిత్రించడానికి నవలలోని కొన్ని అంశాలను పరిశీలించాల్సి వుంటుంది. నవలా చిత్రణకు పనికివచ్చే అంశాల్లో ఇతివృత్తాన్ని గురించి ఇదివరకే చర్చించడమైంది. నవలకు ముఖ్యాంశాలైన పాత్ర చిత్రీకరణ, సంభాషణలు, సన్నివేశకల్పన, సందేశాలను గురించి ఈ అధ్యాయం పరిశీలిద్దాం.

## 4.1 పాత్ర చిత్రీకరణ :-

సాహిత్య ప్రపంచంలోని వ్యక్తులే పాత్రలు. నవలా రచనలో పాత్ర చిత్రణ చాలా ముఖ్యమైంది. రచయితలు తమ చుట్టూ వున్న సమాజాన్ని పరిశీలించి ఎన్నో రకాల పాత్రలు సృష్టించుకుంటారు. పాత్రలు ఎప్పుడూ ఏదో ఒక ప్రాంతానికి, కాలానికి, కులానికి, ఒక వర్గానికి చెంది స్వంత వ్యక్తిత్వంకలిగి, ఏదో ఒక విభాగానికి ప్రాతినిధ్యం వహిస్తూ, మానవ సహజమైన లోపాలు కలిగి ఉంటాయి. పాత్రలను

ఎన్నుకోవడంలో పాత్రల నైజస్థితి ఎంత చక్కగా ప్రతిబింబిస్తే ఆ పాత్ర చిత్రణ అంత సజీవంగా ఉంటుంది. మొత్తం మీద పాత్రల చిత్రణ స్వాభావికంగా ఉండాలి.

పాత్ర చిత్రణను గూర్చి మధురాంతకం రాజారాం గారు - "రచయిత స్వయంగా పాత్రల మంచి చెడ్డల్ని గురించి చెప్పకూడదు. సాక్షిమాత్రుడుగ కధ చెప్పుకుంటూ పోవాలి. ఆయా ఘట్టాలలో పాత్ర వ్యవహరించే తీరు సహజత్వానికి వీలైనంత దగ్గరగా ఉండాలి. సాంతం చదివి ముగించినమీదట ఆ పాత్ర గుణదోషాలతో సహా జాగా పరిచితుడైన సజీవ వ్యక్తిలా పొడగట్టాలి"[1] అని చెబుతూ పాత్ర చిత్రీకరణ చాలా సహజంగా ఉండాలని అభిప్రాయపడినారు.

నవలా రచనలో పాత్రల ప్రాముఖ్యం ఎటువంటిది. నవలా రచయితకు పాత్రకు గల సంబంధం ఏమిటి? అనే ప్రశ్నలు ఎలిజబెత్ బొవెన్ ఇలా సమాధానం చెప్తోంది "రచయిత పాత్రలను సృష్టించడు. వాటిని వెదికి పట్టుకుంటాడు. ఒక రకంగా చూస్తే అవి పరిసరాల ప్రభావంతో రచయిత మనస్సులో రూపుదిద్దుకుంటాయి అవి మసక వెలుతురులో ఎదుటి బెంచీమీద కూర్చుని తమని గురించి తాము రచయితకు చెప్పుకునే సహప్రయాణీకుల వంటివి"

నవలలోని పాత్రలు మన జీవితంలోని పాత్రల్ని జ్ఞాపకం చేసేవిగా, చైతన్య వంతంగా స్పష్టంగా చిత్రీకరించినపుడే ఆ పాత్రలు సజీవంగా ఉండి ఆ నవల ప్రజాదరణ పొందగలుగుతుంది. కథాగమనానికి, మానవ స్వభావ చిత్రణమునకు ఈ పాత్ర చిత్రణ దోహదం చేస్తుంది.

మన పూర్వ సాహిత్యంలో ప్రహ్లాదుడు, ధ్రువుడు తప్ప పిల్లలకు పరిచయమైన పాత్రలు ఇంకెవ్వరూ లేరు. ఇతర దేశాల బాలసాహిత్యంలో సంఘంలోని పిల్లలే పాత్రలు. చింతా దీక్షితులుగారు సంఘంలోని పిల్లలను సజీవ పాత్రలుగా

---

1. తెలుగుకథ, విమర్శనాత్మక వ్యాస సంపుటి, ఆంధ్ర సారస్వతసమితి, 1974; పుట. 102
2. విద్యేశ్వరి, డి. నవలా పరిణామ క్రమంలో పాత్రోన్మీలనం, అభ్యుదయ ఈ దశాబ్ది నవల విశేష సంచిక, జనవరి, 1980

తీసుకుని రచనలు చేసినారు.

ఈ నవలల్లో పిల్లలు ఎక్కువ పాత్రలుగా ఉంటారు. పిల్లలు మామూలుగా స్కూలు వాతావరణంలో ఎక్కువ గడుపుతుంటారు. కాబట్టి ఉపాధ్యాయులు, తల్లి దండ్రులు ఎక్కువ పాత్రధారులుగా ఉంటారు. పిల్లలకు పరిచయం చెయ్యబడే పెద్దల పాత్రలుకూడా ఉంటాయి,

సేకరించిన బాలల నవలల్లోని కొన్ని ముఖ్య పాత్రల్ని ఇక్కడ చర్చించడమైంది

గీతా సుబ్బారావుగారి "పారిపోయిన బలాణి" లో బలాణి పాత్రను రచయిత చక్కగా చిత్రించినారు. ఈ నవలలో బలాణి పాత్ర తన్నుతాను పరిచయం చేసు కుంటుంది. బలాణి ఫస్టుఫారం విద్యార్థి. క్లాసులో ఫస్టుమార్కులు బలాణీవే.

"నాకు మంచి బట్టల్లేవు. కొత్త పుస్తకాలు లేవు, మంచి పెన్నులేదు. చెప్పులు కొంటానని మా నాన్నగారు ఇప్పటికి మూడేళ్ళ నుంచి చెప్పడమేగాని యింతవరకు కొనలేదు" అని తనతోటి పిల్లల్ని చూసి బాధపడే స్వభావిగా బలాణి(పు.2) చిత్రించ బడినాడు. చిన్నపిల్లవాడైనా బలాణి దొంగతనం, మోసం తప్పని భావించేవాడు. ఇంట్లోంచి వెళ్ళిపోయిన బలాణి ఒక దొంగల ముఠాకు చిక్కి, వాళ్ళుదొంగతనం చెయ్యమంటే— "దొంగతనం నేను చెయ్యను. అది మహాపాపం

కావలిస్తే యింకా బోలెడు బట్టలు వెయ్యి వుతుకుతాను.

మరో రెండు టిఫిన్ క్యారియర్‌లు యివ్వు అన్నం తీసుకు

వస్తాను. కాని దొంగపని చెయ్యను" (పుట 20) అని చెప్పడంలో బలాణి పాత్రను రచయిత నిజాయితీ గల పాత్రగా చిత్రించినారు.

కోడూరి లీలావతిదేవిగారి "ఆశాకిరణం" అనే నవలలో ప్రధాన పాత్రధారులు బడిపిల్లలు. ఈ నవలలో మురళీధరం మేష్టారు ఒక విశిష్టమైన వ్యక్తిగా త్యాగమూర్తిగా ఒక ఆదర్శ ఉపాధ్యాయుడుగా చిత్రింపబడినాడు.

మంచీచెడూ తెలియని రోజుల్లో, దేవుడి ప్రతిరూపం అనుక్షణం గుండెల్లో కనబడుతుండే రోజుల్లో బాలలను సరిదిద్ది, వాళ్ళకు ఉన్నతాదర్శాలు తెలియజెప్పి శాంతి పథంలో నడిపించాల్సిన బాధ్యత ఉపాధ్యాయునిపై ఎంతయినా వుంది. అయితే

ఈ బాధ్యత అంత సులువయిందేమీకాదు. నానాటికి కలుషితమై పోతున్న ఈ ప్రపంచంలో అసమానత్వపు చీకటినుంచి, ఈర్ష్యాసూయల కాలుష్యాన్నించి, పసిబాలలను తప్పించి తాను వెలిగించిన జ్ఞాన జ్యోతితో మార్గం చూపుతూ గాంధీ నడచిన క్రాంతి పథం వైపు భావితరాన్ని కదిలించడం సామాన్యులు సాధించగలిగే విజయంకాదు. అలాంటి అసామాన్యుడయిన వ్యక్తి మురళీధరం మేష్టారు.

> "ఒక ఉపాధ్యాయుడు విద్యార్థుల విద్యాబుద్ధుల
> కోసం ఎలాకష్టపడి పనిచెయ్యాలి అనే విషయాన్ని
> మురళీధరం మాష్టారు మాటల్లో కాకుండా
> ఆచరణలో పెట్టి చూపించారు. ఇటువంటి మాష్టారు
> మన స్కూల్‌లో ఉన్నందుకు మనస్కూలు అదృష్టం
> చెప్పతరంకాదు" (పుట. 131)

అన్నమాటలు మురళీధరం పాత్ర వ్యక్తిత్వాన్ని చాటుతుంది.

కొమ్మూరి వేణుగోపాలరావుగారి "పిల్లదొంగ" పాత్ర చాలా విచిత్రంగా తీర్చిదిద్దబడింది. శంకరంను పిల్లదొంగగా రచయిత మనకు పరిచయం చేసినారు. ఈ పాత్ర ద్వారా చిన్నకుర్రవాని మనస్తత్త్వం విశితంగా అర్థమవుతుంది. శంకరానికి తలిదండ్రులు ఇంట్లో డబ్బులివ్వకుండా, ఎవరితో తిరగకుండా కట్టుదిట్టం చేస్తారు.

ఆ రోజునుంచి అబ్బాయికి నిర్బంధన బాగా బలపడింది, ఏ పనిచెయ్యబోయినా అడ్డే. ప్రతిదానికి అస్వతంత్రం.

> "అందుచేత ఆ అబ్బాయిలో స్వతంత్ర భావాలు రేకెత్తినై
> ఎందుకు తను వీళ్ళకు లోబడి ఉండాలి' (పు. 37)
> "తన ఖర్చుకి ఒక్క దమ్మిడి యివ్వడునాన్న. తను ఎలా
> బ్రతకాలను కుంటాడో? తనకి స్నేహితులతో కులాసాగా
> గడపాలని వుండదూ? హోటళ్ళకు పోవాలని వుండదూ? (పు.10)
> "అబ్బాయి అందరిలాగే జల్సాగా తనూ వుండదలిచాడు.

కాని డబ్బు లేదుగా. డబ్బులు వుండాలంటే ఏం
చెయ్యాలి? (పు.37)

అందుకే దొంగతనాలు మొదలు పెట్టాడు. అప్పటినుండి శంకరం మనస్సులో సంఘర్షణ ప్రారంభమవుతుంది. చివరకు సీతని వదిలి దొంగతనాలు చెయ్యడం తప్పని తెలుసుకుని మంచివాడుగా మారతాడు. ఇందులో శంకరాన్ని దొంగతనం చేసి అల్లరి తిరుగుళ్ళు తిరిగి చెడిపోయి, చివరికి ఎలాగో బుద్ధి తెచ్చుకున్న కుర్రవాడిగా రచయిత చక్కగా చిత్రించినారు.

గీతా సుబ్బారావుగారి "చిన్నారి విజయం" లో వేణు, ముంతాజ్ చెప్పుకోదగ్గ పాత్రలు. వీరిద్దరిలో వేణుపాత్ర చక్కగా చిత్రించబడింది. వేణు వయస్సుకి చిన్న వాడైనా కక్ష, ద్వేషానికతీతుడుగా చిత్రీకరింపబడినాడు. తన తల్లిని, చెల్లిని చంపిన వాని కూతుర్నే ఆదరించిన ఆదర్శ బాలుడిగా చిత్రించబడినాడు. ముంతాజ్ అమాయక బాలికగా చిత్రింపబడింది. ఈ ఇద్దరి పాత్రల్ని రచయిత కుల మత భేదాలు, బీద గొప్ప తేడాలు లేకుండా మమతకి, మంచికి ప్రతి రూపాలుగా చిత్రించినాడు.

కాణిపాకం లింగన్నగారు "శాంతిచక్రం" లో శంకర్ అనే చిన్నకుర్రవాణ్ణి ఉదాత్తమైన పాత్రగా తీర్చిదిద్దినారు. నవలలో శంకర్ చాలా తెలివైనవాడుగ, ధైర్య సాహసాలు గల స్నేహశీలిగా చిత్రింపబడినాడు. రచయిత శంకర్‌ను వీరునిగా, సద్గుణాలరాశిగా తీర్చిదిద్దినారు. శంకర్‌లానడుచుకోమని రచయిత పిల్లలకు ప్రబోధిస్తున్నారు.

"చూసారా! బాలలూ శంకర్ ఎంత మంచి ఆలోచనలు పెంచు
కున్నాడో, మనమూ శంకర్‌లా నడుచుకుందాం, మంచి
గుణాలను పెంచుకుందాం. వీరులనిపించుకుని ఎన్నో బహుమతు
లందుకుందాం" (పు.72)

కె. సభాగారు "సూర్యం", "చంద్రం", నవలల్లో సూర్యం, చంద్రం పాత్రలను సజీవంగా తీర్చి దిద్దినారు. చదువుకోవాలని ఆసక్తి ఉన్నా బీదతనంవల్ల చదవలేని వాళ్ళు సభాగారు సూర్యం, చంద్రం పాత్రలను సజీవంగా పేద వాళ్ళ జీవితాలకు ప్రతీకలుగా తీర్చిదిద్దినారు.

సూర్యం.- పేదవాడుగా, మంచివాడుగా, పిల్లలకు ఆదర్శవంతుడుగా చిత్రింప బడి నాడు. తిండి లేకపోయినా చదవాలనే పట్టుదల, చదువు మీద మోజు కలవాడు. బాగా చదివి ఉద్యోగం చెయ్యాలని వాడి ఆశ.

"బాగా చదివితే ఉద్యోగం చెయ్యవచ్చునని వాడి ఆశ. అప్పుడప్పుడు ఉద్యోగుల్ని కూడా చూశాడు. వారిలాగా టోపి పెట్టుకుని. షరాయి వేసుకుని, బూట్లు తొడుక్కుని, కోటు వేసుకుని నడిచేరోజులు రావాలని వాడికి కోరిక" (పు.18)

పేదతనం వల్ల చదువాగిపోయి ఎక్కడికో వెళ్ళిపోతాడు. హఠాత్తుగా ఊడిపడ్డ సూర్యాన్ని రచయిత మహర్షి పాత్రలా తీర్చిదిద్దినాడు. అనాథులను ఆదరించి విద్యాబుద్ధులు చెప్పించి తాను పడ్డ కష్టాలు వాళ్ళు పడకుండా చేసి, ఆదర్శవంతుడుగా నిలిచి పోతాడు.

చంద్రం .- చంద్రం పేదవాడు. తిండికి చాలీచాలని బ్రతుకు. స్కూలు ఫీజు చెల్లించ లేని స్థితి. చదువంటే ప్రాణం. "నేను జీతం కట్టలేను సార్. జీతం లేకుండా చదువు చెప్పరా సార్" అని అయ్యవారిని ప్రాధేయ పడతాడు చంద్రం పేదవాడైనా అభిమానవంతుడిగా చిత్రింపబడినాడు. ఈ అభిమానమే చివరకు చంద్రాన్ని మిలటరీలో చేరేట్లు చేసుంది.

గీతా సుబ్బారావుగారి "పూలమనసులు" లో గోపి, జాన్ అనే స్నేహితులు ముఖ్య పాత్రధారులు. ఈ నవలలోని పాత్రలు తమను తాము పరిచయం చేసుకోవడమే గాకుండా, ఇతర పాత్రల్ని కూడా పరిచయం చేస్తాయి.

గోపి:- తలిదండ్రులను పోగొట్టుకుని బ్రతుకు తెరువుకోసం పట్టణానికి వచ్చిన అనాధ. కష్టపడి న్యాయంగా, కష్టపడి, నిజాయితీగా బ్రతకాలనుకునే తత్వం కలవాడు. అలాగే కష్టపడి హోటల్ సర్వరుగా పనిచేసి నైట్ కాలేజీలో చదివి అభివృద్ధిలోకి వచ్చినమంచి పాత్ర గోపి.

జాన్:- సంఘం మీద కసితో, కోపంతో దొంగగా తయారవుతాడు. దొంగతనాలు చేస్తూ చివరికు మరణిస్తాడు.

సీతిగా, నిజాయితీగా కష్టపడి బ్రతికితే అభివృద్ధిలోకి రావచ్చని, అవినీతి పనులు చేస్తూ, అక్రమంగా బ్రతికితే ముప్పుతప్పదని ఈ గోపి, జాన్ పాత్రలు నిరూపిస్తాయి.

హాస్యపాత్రలు చిత్రించడంలో ముళ్ళపూడి వెంకటరమణగారు అందెవేసిన చేయి వీరి "బుడుగు" బాలసాహిత్యంలో మరచిపోలేని, మరపురాని పాత్ర. ఈ నవలలో "బుడుగు" తన్నుతాను పరిచయం చేసుకుని, మిగతావారిని పరిచయం చేస్తాడు. బుడుగు గాకుండా ఈ నవలలో అమ్మ, నాన్న, బాబాయి, సీగానపెసూనాంబ, బామ్మ లావుపాటి పక్కింటి పిన్ని, సీత పాత్రలన్నీ చిత్ర విచిత్రాలుగా, చక్కగా చిత్రింపబడినాయి.

"బుడుగు" చేష్టలు మాటలు కొంత అతిగా అనిపించినా, హాస్యపాత్రగా ప్రఖ్యాతి గాంచినాడు "బుడుగు" చేష్టలకు కొన్ని ఉదాహరణలు చూద్దాం.

> "ఒసారి బాబాయి ఈ ఉత్తరం నాచేతికిచ్చి సీతకిచ్చిరమ్మన్నాడు.
> నేను వెళ్ళేసరికి సావిట్లో సీతనాన్న కూర్చున్నాడు. వాడికెందుకు చెప్పు అన్ని గొడవలూనూ
> "ఎవరికిరా ఆ ఉత్తరం?" అన్నాడు
> "ఎవరికో నీకెందుకురా?" అన్నాను నేను
> ఢడవా ఇలారా అనేసి వాడు నన్ను గభుక్కున పతేస్కున్నాడు.
> చేతిలో ఉత్తరం లాక్కుచూశాడు. చూసి హు అన్నాడు
> హేం పొగరు రాస్కెల్ నా కూతురికి ఉత్తరం రాస్తాడా? చెప్తాఉండు"
> అన్నాడు వాడు.
> "లేకపోతే నీకు రాస్తాడా" అన్నాను నేను (పు.35 బుడుగు-1)

చాగంటి సరళాతిలక్ గారి "చిన్నారి మనసులు" లో ముఖ్యమైన పాత్రధారులు పిల్లలు. గిరిజ, సుబ్బి అనే పాత్రలను రచయిత చక్కగా తీర్చిదిద్దినారు.
**గిరిజ:-** జాలిగుండె, దయ గలది. గిరిజ ఒకపనిచెయ్యాలని నిశ్చయించుకుంటే దానికి తిరుగుండదు. చదువురాని సుబ్బి అంటే జాలి, తనతో సమానంగా తయారు చెయ్యాలని ఆ చిన్నారి హృదయం పడిన ఆరాటాన్ని రచయిత చక్కగా చిత్రించినారు.

పిల్లల దగ్గరంతా పసూలు చేసి సుబ్బికి పుస్తకం కొని ఇచ్చి. పిల్లలందరితో సుబ్బిని గురించి గొప్పగా చెబుతుంది. అందరూ కలసి కట్టుగా ఉండాలనే తత్త్వం కలది.

"ఎంత బాగుంది ఈ రోజున అందరూ ఇలా కలిసి కట్టుగా
వుండి పనిచేస్తే ఏదయినా సాధించవచ్చుమరి" (పు40)

సుబ్బి:- సానుభూతి చూపించదగిన పాత్ర. సవతి తల్లి ఎన్ని బాధలు పెట్టినా పైకి చెప్పుకోక, అన్ని మౌనంగా భరించే తత్వం గలదిగా చిత్రింపబడింది. గిరిజ దయ వలన బడి ముఖం చూసి లక్ష్మి వినయంగా శ్రద్ధగా చదువుకునేది. లక్ష్మి పాత్ర స్వభావానికి ఒక చిన్న ఉదాహరణ—

ఈ మధ్యనే లక్ష్మి రెండవ తరగతి దాటి మూడవ తరగతి లోకి కూడా వచ్చింది రెండవ తరగతిలో కూడా లక్ష్మికే అన్ని ఫస్టుమార్కులూనూ.

"స్కూలు ఉపాధ్యాయులందరికి లక్ష్మి అంటే ఎంతో అభిమానము
లక్ష్మిని చూచి బుద్ధితెచ్చుకోమని తతిమ్మా పిల్లలని వారు మంద
లిస్తుండేవారు. అయినా లక్ష్మి గర్వపడేదికాదు. అసలు స్వతహాగా
తను నెమ్మదస్తురాలు. పెద్దలను గౌరవించటం. పిన్నలతో
కలిసి మెలసి వుండటం పుట్టుకతోనే తనకు వచ్చింది అనటము
అతిశయోక్తి కాదనుకుంటాను" (పు.53)

చిరంజీవిగారి "వీధిగాయకుడు"లో వీధిగాయకుడు పాత్ర కొత్త తరహాకు చెందినది.

"దుస్తులు మాసిపోయాయి. విచిత్రమైన దుస్తులు
రంగురంగు గుడ్డముక్కలతో తయారైన అంగరఖా
వేసుకున్నాడు. ముఖం కలకల్లాడుతోంది కుడిచేతిలో
మురళి. బంగారు పూజలు పొదిగిన మురళి" (పు ?),

ఇది వీధిగాయకుని విచిత్ర వేషం వీధిగాయకుని రచయిత ఎన్ని విచిత్రాలు తెలిసినవాడుగా, మంచివాళ్ళకు మేలుచేసేవాడుగా, ఆడినమాట తప్పేవాళ్ళకు గుణపాఠం నేర్పించే వ్యక్తిగా, మహత్తర గుణాలు గల వ్యక్తిగా, పిల్లలందరికి ఒక కొత్త

ప్రపంచం చూపిన అద్భుత వ్యక్తిగా చిత్రించినాడు.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి గారి "బంగారు తల్లి" లో హెర్మియా కథా నాయికగా చిత్రింపబడింది. హెర్మియా వయసులో చిన్నదైనా దయ, సాను భూతి కలది. గ్రీకుల దగ్గర బాధపడుతున్న ఇండియన్లంటే జాలి. అడవిలో కదలలేని స్థితిలో ఉన్న తనని రక్షించిన విశ్వజిత్తు కుటుంబ మంటే అభిమానం. ప్రాణం పోయినా మాట తప్పని బాలిక. అడవిలో తలదాచుకుంటున్న విశ్వజిత్తు కుటుంబ మంటే సాను భూతి కృతజ్ఞత—

> "మా గ్రీకులు వీళ్ళకు చాలా అన్యాయం చేసారు. అందమైన పుష్కలా
> వతి కోటలో హాయిగా పోతూన్న యీ కుటుంబానికి ఈ చీకటి
> గుహలో బాధపడవలసిన అవస్థ పట్టింది. ఈ ఇండియన్లు ఎంతమంచివాళ్ళు"
> అన్న మాటలే ఉదాహరణ (పు. 29)

హెర్మియా ధైర్యవంతురాలన్న దానికి, ఇచ్చిన మాట ప్రాణం పోయినా తప్పదన్న దానికి అలెగ్జాండరు మాటలే తార్కాణం.

> రోహిలసుతో అలెగ్జాండరు "ఇంతటి ధైర్యవంతురాలైన పిల్లకు
> తండ్రివైనందుకు నువ్వు గర్వించాలి" (పు.71)
> "ఐతే ఈ ఇండియన్ రాజు ఎక్కడున్నాడిపుడు?"
> అన్న అలెగ్జాండరు మాటకు హెర్మియా సమాధానం
> "వాళ్ళెక్కడున్నదీ తెలియనివ్వనని గాయత్రీదేవికి మాట
> యిచ్చాను ప్రభూ" (పు.71)

వావిలాల సోమయాజులు గారి "నాలంద" లో శిఖిశాతకర్ణి పాత్ర చాలా ఉదాత్తమైంది, శిఖిశాతకర్ణి క్షమ, దయ, క్రమశిక్షణ గల ఉత్తమ విద్యార్థి. అసత్యమెరుగని అమృతమూర్తి, ఉపాధ్యాయుల ఆదరానురాగాలకు పాత్రుడైన ఉత్తమ వ్యక్తి.

> "అమృత మూర్తి నా ప్రియమిత్రుని శిఖిని
> దూరమొనర్చుకొనినాను" (పు. 107)

అన్న అతని మిత్రుని మాటలే ఇందుకు ఉదాహరణ. బాలబాలికలకు మార్గదర్శకమైన పాత్ర ఇది.

ఆలూరి భుజంగరావు గారు "కుక్క ఆత్మకథ' లో కుక్క పాత్ర ద్వారా అన్ని పాత్రలను పరిచయం చేసినారు. కుక్క తనని ప్రజలు ఎలా హింసిస్తారో చెప్పుకుంటుంది

"మమ్మల్ని హింసించడం, బాధపెట్టడం మేము కుమ్మెయ్యమొర్రో
అంటుంటె వింటం పిల్లలకో సరదా" (పు. 19)
"మమ్మల్ని ఇలా హింసించేది పిల్లలే అనుకునేరు
బాగా ఏళ్ళువచ్చి బుద్ధిజ్ఞానం తెల్సిన వాళ్ళుకూడా
హింసిసూ వుండేవారు" (పు. 20)

ఈ కుక్క సామాన్యమైందైనా, ధర్మం, న్యాయం, సత్యం, మనం మన కర్తవ్యాన్ని మర్చిపోకుండా ఉండడం, స్నేహాన్ని కృతజ్ఞతను, సర్వలోకాల్లోను కాపాడుకోవడం, కష్టాలకు భయపడకుండా ధైర్యంగా ఎదుర్కోవడం మొదలైన గొప్పగుణాలుగల ప్రబోధాత్మకమైన పాత్రగా చిత్రించబడింది.

కుక్క పాత్ర ద్వారా రచయిత ఒక ప్రబోధం చేసాడు
చూసారా! ఒక సామాన్యమైన కుక్కని కర్తవ్యాన్ని
అనుసరించి ధర్మం తప్పకుండా నడవడం వల్ల ఎల్లా
వుచ్చస్థితికి వచ్చానో. పిల్లలూ! మీరూ అలాగే
గొప్పవాళ్ళు కావాలి" పు. 110)

అరవిందగారి "ప్రేమ మంత్రం" లో రాము పాత్ర విచిత్రమనస్తత్వం గలదిగా కనిపిస్తుంది. రాము పిల్లల్ని రెచ్చగొట్టి, జంతువులను హింసించి ఆనందించేవాడు. పెద్దవాళ్ళంటే గౌరవం లేకుండా, వాళ్ళని పేర్లుపెట్టి ఏడ్పించేవాడు తన ముందు ఎవరినైనా మంచిగా చూసే రెచ్చిపోయే స్వభావం కలవాడుగా చిత్రింపబడినాడు చివరకు కుసుమ ఆదరణ, ఆప్యాయతలతో మంచివాడుగా మారి పోతాడు.

ఉదాహరణకు — "వాడు తోచక అల్లరి చేస్తాడు. మంచివాడివి అంటే వాడికి

సంతోషంగా ఉంటుంది. మాట వింటాడు. వాడి స్వభావం
అది. సువ మాటలు విని నువ్వు వాణ్ణి కొట్టావనుకో. వాడు
కోపంతో ఇంకా పిచ్చి పనులు చేస్తాడు. వాడు ఇప్పుడు
మొదట్లో చేసినట్లు అల్లరి చెయ్యటంలేదు. నిజంగా మంచివాడై
పోయాడు" అన్న కుసుమ మాటలే (పు.117)

చివుకుల పురుషోత్తంగారి బంగారం ఎలా చెయ్యాలి"? లో రాముడి విచిత్రమైన పాత్ర రాము ధైర్యసాహసాలు గల కుర్రవాడు. సాహసకృత్యాలు చెయ్యాలని ఉవ్విళ్ళూరే వాడు. మంత్ర, తంత్రాలమీద, స్పర్శవేది ద్వారా బంగారం తయారు చెయ్యాలనే కోరిక, ఉత్సాహం గలవాడు.

"ఈ చదువు వ్యర్థం. చాలా శ్రమతో కూడింది!
హాయిగా స్పర్శవేది చిక్కితే? ఎంత జల్సాగా
బ్రతకవచ్చు"? (పు 11)

అనే వాక్యాల ద్వారా రాము స్వభావం అర్థమవుతుంది. చివుకుల పురుషోత్తంగారు రాము పాత్రను చాలా నేర్పుతో చిత్రించినారు

పాత్రను మలచడంలో ఎంతో సమర్థుడని పేరు గాంచిన మధురాంతకం రాజారాం గారు 'ఆకాశ దీపంలో" ప్రేమ్ పాత్ర ద్వారా దేశభక్తిని చూపినారు. ప్రేమ్ బాల వీరుడిగా, . టి బాలుడే రేపటి పౌరుడు అన్న దానికి తార్కాణంగా చిత్రించబడినాడు.

"సైనికులలో మిన్న అయిన అధికారి చిన్నవాడైన
తననలా గుర్తించి మన్నన చేసినందుకు ప్రేమ్‌కు
పరమానందం కలిగించింది. శ్రీరాముడు సేతువు
నిర్మించడంలో ఉడుత కూడా సాయపడినట్లుగా,
దేశరక్షణ కార్యంలో తనకు కూడా కొంత వాటా దొరకడం
వల్ల తన జన్మ తరించినట్టుగా భావించాడు" (పు.41)

ప్రేమ్ పసువులోని ఆ భావన ఎంత గొప్పది.

శత్రుసైనికుల ఆయుధసామగ్రి మీద చేతిబాంబు విసిరి వాటిని ధ్వంసం చేస్తాడు. శత్రువులు ప్రేమ్‌ని కనిపెట్టి అతనిపై గుండ్ల వర్షం కురిపిస్తారు.

> 'గుండ్ల వర్షం జడివానలా ఆ బాలవీరునిపైన కురవ
> సాగాయి. అతను అడుగైనా కదల్చలేదు. అచంచల
> హిమత్పర్వత శిఖరంలా నిశ్చలంగా నిలిచాడు. సింగపు
> పిల్ల గుంటనక్కలవైపు చూసినట్టుగా శత్రువులవైపు
> తృణీకారంగా చూసాడు. అతడి శరీరం తూటాలు
> దూసుకు వెళ్ళిన గాయాలతో పూచిన కడిమి చెట్టులా
> మారింది. కాని అతడి మనసుకు మాత్రం గాయాలు
> లేవు. బాధ లేదు" (ఆకాశదీపం, పు 48)

చివరకు ప్రేమ్ దేశరక్షణ కోసం ప్రాణత్యాగం చేసి వీరమరణం చెందుతాడు. రచయిత ఈ పాత్రను చాలా ఉదాత్తంగా తీర్చి దిద్దినారు. చిన్నపిల్లవాడైనా దేశం కోసం ప్రాణాలైన అర్పించడానికి వెనుదీయని ధైర్యవంతుడిగా ప్రేమ్ పాత్ర చిత్రీకరింపబడింది. ఈ పాత్ర చిత్రీకరణలో రచయిత చూపిన నేర్పు ప్రశంసనీయమైంది.

చరిత్రలో కొంతమంది మహనీయులు చిరస్థాయిగా నిలిచిపోతారు. అలాంటి వారిలో "తానాజి" ఒకరు. ఈ పాత్రను విద్వాన్ కొండూరి నరసింహంగారు "తానాజి" నవలలో పరిచయం చేసినారు. దుష్ట శిక్షణ, శిష్టరక్షణ, దేశభక్తి, ప్రభు భక్తి, దైవ భక్తి జీవితపరమాశయాలుగా చేసికొని జీవించిన వాడు. ఈ "తానాజి" పాత్ర పిల్లలకు మార్గదర్శకమైంది. "తానాజి" భారత దేశ చరిత్రలో స్వర్ణాక్షరాలతో లిఖించదగినవాడు

పి. కనకాంబర రాజుగారి "చింటూ తెచ్చిన తంటా" లో గోపి పాత్రని చాలా చక్కగా చిత్రించినారు. చింటూ అనాధ శరణాలయం నుండి తీసుకురాబడి రాజారమేష్‌గారి దగ్గర పెరుగుతున్న వాడు. డబ్బుకోసం రాజాగారి కొడుకుని దొంగలు బంధించగా, పోలీసులకై దొంగల స్థావరాన్ని చూపించి చింటూని రక్షించిన ధైర్యవంతుడు.

చిన్నపిల్లవాడైనా ప్రాణాలు కూడా లెక్క చేయకుండా తన్ను పెంచిన వారికి

మంచి చేయాలన్న మంచి గుణం కలవాడుగ చిత్రింపబడినాడు, పోలీసులకు దొంగల్ని పట్టించి ఆ దొంగల్లో తన తండ్రిని గుర్తించి, ప్రభుత్వం బహుమతి ఇస్తానంటే బహుమతిగా తన తండ్రిని కోరుకుంటాడు. రచయిత గోపి పాత్రను నేర్పుతో పిల్లలకు ధైర్యాన్ని బోధించే విధంగా, ఆదర్శవంతంగా తీర్చిదిద్దినారు.

ఈ విధంగా పిల్లల నవలల్లో ఎక్కువగా పిల్లలే పాత్రలుగా ఉన్నారు. ఈ పాత్రలన్నీ పిల్లలకు మార్గదర్శకాలుగా ఉన్నాయి. కాని పిల్లలనవలల్లో పాత్ర చిత్రీకరణ కొంచెం కష్టం అనుకోవచ్చు. ఇవి బాలల నవలలు కాబట్టి పిల్లలకనుగుణంగా పిల్లలు మెచ్చే రీతిలో, పిల్లలకు ఆదర్శంగా, ఆ పాత్ర ద్వారా పిల్లలు ఏదైనా మంచి నేర్చుకునే విధంగా తీర్చిదిద్దాలి. ఈ విధంగా రాయడం కొంచెం క్లిష్టంగానే ఉంటుంది. పరిశీలించిన పిల్లల నవలల్లో పాత్రలు చాలా వరకు పిల్లలకు నచ్చేరీతిలో ఉన్నాయి. ఆయా రచయితలు కూడా పాత్రల్ని పిల్లలకు ఆదర్శంగా, మార్గ దర్శకంగా ఉండేటట్లు చిత్రీకరించినారు.

4 2 సన్నివేశ కల్పన :

జీవితాన్ని కథగా మలచే సాహిత్య ప్రక్రియ నవల. నవలలో రచయిత కథ చెప్పాలి. ఆ కథలో మానవ జీవితంలో సంభవించే సంఘటనలు, పరిస్థితులు, రచయిత సన్నివేశాలుగా చిత్రిస్తాడు. సంఘటనలు, పాత్రల ప్రవర్తన, సన్నివేశ కల్పనతో ముడిపడి ఉంటుంది. సన్నివేశం అంటే అక్కడ కల్పించబడిన వాతావరణం పరిస్థితులు, పాత్రలు అలంకారాలు, సన్నివేశాలలోకి వస్తాయి. ముఖ్యంగా ఈ సన్నివేశ కల్పన దేశకాలాదులను గుర్తించి చెయ్యాలి. లేకుంటే సన్నివేశం దెబ్బ తింటుంది. సన్నివేశంలో ఏదో ఒక స్థలం నిర్దేశింపబడుతుంది. వాతావరణం సన్నివేశ కల్పనకు అనువుగా ఉండాలి. ఈ సన్నివేశ కల్పన, వాతావరణం, పాత్రల కనుగుణంగా ఉండేటట్లు చూసుకోవడం రచయిత కర్తవ్యం. నవలల్లోని సన్నివేశాలను సహజంగా ఉండేటట్లు చిత్రించాలి. ఈ సన్నివేశాలను రచయిత తన కళాకౌశలంతో నేర్పుతో చిత్రించి పాఠకుల మనస్సులో మరపురాని ముద్ర పడేటట్లు చెయ్యగలిగితే అది ఉత్తమ నవలగా రూపొందుతుంది.

నవలా ఇతివృత్తంలో పాత్రలకు. సన్నివేశాలకు నేపథ్యంగా ఉండే వాతా

వరణం సహజంగా ఉండటం చాలా అవసరం. నవలలో వాతావరణం అంటే వ్యక్తుల చుట్టూ ఉండే సమాజం ప్రకృతి.

"కథావస్తువును అర్థం చేసుకోవడానికి అవసరమైన సమాచారాన్ని యిచ్చి అనుభవించడానికి అవసరమైన "మూడ్" ను సృష్టించడం సాధారణంగా వాతావరణం కర్తవ్యం"[1] అని వల్లంపాటి వెంకట సుబ్బయ్యగారు తెలిపినారు.

పిల్లల నవలల్ని పరిశీలిస్తే ఎక్కువగా పాఠశాల వాతావరణం కనిపిస్తుంది. పిల్లల నవలల్లో సన్నివేశ కల్పన మామూలు నవలలకన్నా కొంచెం భిన్నంగా ఉంటుంది. బాలల సాంఘిక నవలల్లో పాఠశాల వాతావరణమేగాకుండా చెట్లనీడలు, ఏటిగట్లు, గుడి, పడవలు, పొలాలు, తోటలు, పార్కులు, కాలేజీలు మొదలైన చోట్ల సన్నివేశాలు కల్పించబడినాయి. చారిత్రక, పౌరాణిక నవలల్లో రాజభవనాలు, యుద్ధ భూములు, ఉద్యాన వనాలు, దేవాలయాలు, మఠస్థావరాలు, రాజసభలు, అంతఃపురాలు మెదలైన ప్రదేశాల్లో సన్నివేశ కల్పన చేయబడింది. బాలల నవలల్లోని కొన్ని సన్నివేశాలను పరిశీలిద్దాం.

కొమ్మూరి వేణుగోపాలరావు గారి "పిల్లదొంగ" నవలలో స్కూల్లో పిల్లలు "పిల్లదొంగ" అనే నాటకం వేస్తారు. ఇదే నవలకు కీలకమైన సన్నివేశం. స్కూలు ఆవరణలో అందంగా అమర్చిన స్టేజీ మీద నాటకం ప్రారంభమవుతుంది. నాటకంలో "పిల్లదొంగ" వేషం శంకరం అనే కుర్రాడు వేస్తాడు. నిజజీవితంలో కూడా శంకరం అప్పుడప్పుడు దొంగతనాలు చేస్తుంటాడు, నాటకంలో కూడా అదేపాత్ర ధరించడంతో ఈ నాటకం ముఖ్యమైన సన్నివేశంగా తయారయింది. ఈ సన్నివేశం కథాగమనానికి బాగా తోడ్పడుతుంది.

చంద్రం వాళ్ళింట్లో, అలవాటు ప్రకారం అయిదు రూపాయలనోటు దొంగ తనం చేస్తాడు శంకరం. అది శంకరం స్నేహితుడు చలం చూసి ఆ నోటు అందుకుని అక్కడ పెట్టడానికి వెళ్ళేటప్పుడు చంద్రం చూసి చలమే దొంగ అనుకుంటాడు.

---

1. కథాంగాలు — ఒక పరిశీలన", స్రవంతి, ఫిబ్రవరి, దక్షిణ భారతి ప్రెస్, హైదరాబాదు, 1983.

శంకరం బాధపడ్డాడు కాని ఏమి చెప్పడు.

> "శంకరం యిదంతా చూస్తూనే ఉన్నాడు. అతనికి
> చెప్పరాని బాధగా వుంది. తను చేసిన దొంగతనం
> గురించి యింకోళ్ళు బాధపడటం అతను ఎంతమాత్రం
> సహించలేని విషయం. అందులోనూ తను స్వయంగా
> చలాన్ని దొంగగా నిరూపించినాడు". అని మధనపడుతూ

చలానికి క్షమార్పణ చెప్పుకుని ఇక మీదట దొంగతనాలు చెయ్యకూడదని శంకరం నిశ్చయించుకునే సంఘటన ఈ నవలలో చాలా ముఖ్యమైనది. ఈ సంఘటనతో శర్మాయి లాంటి వాళ్ళు స్నేహం వదలి బుద్ధిగా ఉండాలను కోవడం వల్ల ఇది కథకు చాలా ముఖ్యమైన సంఘటన. ఇందులో రచయిత సందర్భాను సారంగా సన్నివేశాల్ని చిత్రీకరించినారు. ఇవి అతి సహజంగా ఉన్నాయి.

టంగెళ్ళ పాండురంగ శర్మగారి "గులాబి బాలలు" లో ఒకానొక సంఘటన వల్ల "రఘు" జీవితం బాగుపడుతుంది. రఘుని తండ్రి భద్రయ్య ప్రతి పనికి విసుక్కునేవాడు. ప్రతి దానికి అతన్ని నిరుత్సాహపరచి ఆ పసిమనసుకు బాధకలిగించేవాడు. రఘు మనస్సు బాగా గాయపడి నదిలో దూకుతాడు. సకాలానికి దారిన పోయే వాళ్ళు చూసి రఘుని ఇల్లు చేర్చుతారు. రఘుని చూచిన భద్రయ్య—

> "ఆక్షణంలో భద్రయ్య హృదయంలో నూతన తేజస్సు
> ఆవిర్భవించింది. హృదయ పరివర్తన జెందిన అతని
> శరీరమంతా ముచ్చెమటలు పోశాయ్. చేతులు
> గడగడా వణుకుతున్నాయ్. కంపించి పోతున్న
> హృదయంతో భద్రయ్య రఘు దగ్గరకు
> వెళ్ళాడు. ఆప్యాయపూరిత హృదయంతో
> అతని తలపై నిమిరాడు. నీరస స్థితిలో ఉన్న రఘు
> మెల్లగా కళ్ళు తెరవబోయాడు. భద్రయ్య కళ్ళు
> గిర్రున కన్నీళ్ళతో నిండిపోయాయి"

(గులాబిబాలలు పుట. 54, 55)

ఈ సంఘటనతో నిరాశా నిస్పృహలకు లోనై ఆత్మహత్యకు పాల్పడిన రఘు జీవితం ఆనందమయవుతుంది. ఈ సంఘటనతో అంతవరకు కఠిన హృదయంతో ప్రవర్తించిన భద్రయ్య పూర్తిగా మారిపోయి రఘుపట్ల ఆప్యాయత కలిగి ఉంటాడు ఇలాంటి సన్నివేశాలు నవలలకు ఆయువు పట్టులాంటివి.

ఈ నవలలో ఒక సంఘటన చాలా ప్రాధాన్యం వహించింది. అక్రమదారిలో, అమానుషంగా ప్రవర్తిస్తున్న కొందరు విద్యార్థుల్ని మంచి మార్గంలోకి మళ్ళించాలని మురళీధరం మాష్టారు చేసిన ప్రయత్నంలో, పిల్లలు జరిపిన స్ట్రయిక్ కారణంగా రాజీనామా చేయాల్సి వస్తుంది, ఆ స్ట్రయిక్ గొడవల్లో కృష్ణ అనే విద్యార్థి గాయపడతాడు. మురళీధరం తన రక్తం ఇచ్చి రక్షిస్తాడు. ఈ సంఘటనతో "స్ట్రయిక్‌కు కథానాయకుడైన కృష్ణ మారిపోతాడు. ఇంటికి తిరిగి వస్తున్న మాష్టారుకి యాక్సిడెంట్ జరిగి ఒక కాలు తీసేస్తారు. తమవల్లనే మాష్టారుకి ఈ గతి సంభవించిందని పిల్లలందరు మారిపోతారు. ఈ సంఘటన అహంభావంతో అల్లాడిపోతున్న కొందరి పిల్లల మనసుల్ని మార్చి, వారిని దుష్టప్రవర్తననుండి మళ్ళించి మంచివాళ్ళుగా తయారుచేస్తుంది. పిల్లలందరూ మాష్టారి మంచితనం గుర్తించేటట్లు చేసిన ఈ సంఘటన రచయిత్రిగారి రచనానైపుణ్యానికి మచ్చుతునక.

అరవిందగారి "ప్రేమ మంత్రం" లో రాము పిల్లలందరికన్నా భిన్నంగా అమానుషంగా ప్రవర్తించేవాడు. కుసుమ ఈ అల్లరినంతా ఓర్పుతో భరిస్తుంది. రాముకి కాలు విరిగినపుడు ఆవేశంతో కుసుమని గ్లాసుతో కొడతాడు. కాని కుసుమ వెంటనే రాముకి భోజనం తీసుకువస్తుంది.

> "నీకెందుకు బాధ? నేను చెడ్డవాణ్ణి. మీరంతా మంచివాళ్ళు
> నేనొక్కడినే చెడ్డవాణ్ణి. సంతోషించు నేను ఏడుస్తున్నందుకు"
> "నీవ్వు చెడ్డవాడివని ఎవరన్నారు? నువ్వే
> అనుకుంటున్నావు. నాకు తెలుసు, నువు
> నిజంగా మంచివాడివి" అంది కుసుమ.
>
> నువు మంచివాడివని అంటున్నావుకానీ నేను
> మంచివాడిని కాదు కుసుమక్కా. నన్ను
> కొట్టు తిట్టు, అంతేగాని ఇంకా నాకెందుకు

అన్నం తినిపిస్తావు? అంత మంచిగా ఉంటావు?
నాకు మంచివాడిలా ఉండాలని ఉంటుంది కాని ఉండలేను.
మంచివాడిలా ఉండటమంటే యేమిటో నాకు తెలుసు"
అని మంచివాడనుపించుకుంటాడు. (ప్రేమ మంత్రం, పు. 95,96)

దుష్టుడైన రాముని మంచివాడుగా తీర్చిదిద్దిన ఈ సంఘటన ప్రేమ, ఆప్యాయత, స్నేహం కలిసిన మహత్తర సంఘటన.

గీతా సుబ్బారావుగారి "పారిపోయిన బరాణి" లో ఇంట్లోంచి పారిపోయి అనేక కష్టాలు పడి ఒకానొక సంఘటనలో బుద్ధితెచ్చుకుంటాడు. మంత్రి గారింట్లో పనికి కుదురుతాడు బరాణి. మంత్రిగారి రహస్యాలు. ఎవరో బయట పెట్టారని బరాణీని బాగా కొడ్తారు. ఈ సంఘటనతో బరాణీ ఇలా అనుకుంటాడు.

"నన్ను చాలా గట్టిగా కొట్టేరు. చెంపదెబ్బలతో
నాముఖం వాచిపోయింది. కర్రదెబ్బలతో నా వళ్ళు
చిట్లిపోయి వాతలు తేలింది అంతగట్టి దెబ్బలు నేనెప్పుడూ
తినలేదు. ఈ మాత్రం దెబ్బలు ఆనాడు నాన్నగారిచేతిలోనే
తింటే యీనాడీ స్థితికి వచ్చేవాణా? యిన్ని అవస్థలు
పడేవాడినా? నాన్నగారిని ఎదిరించి, పెద్దవాళ్ళ నెదిరించి,
అమ్మని, నాన్నగారిని అందర్ని వదులుకొని వచ్చిన నాకీ
దెబ్బలు చాలవు. నన్ను చంపినా కూడా పాపం రాదు.
ఏం చేసినా పాపం రాదు "

(పారిపోయిన బరాణి, పుట 60, 61)

దెబ్బలు తిన్న బరాణిలో పరివర్తన కల్పించిన ఈ సంఘటన నవలలో చాలా ముఖ్యమైంది.

మధురాంతకం రాజారాం గారి "ఆకాశ దీపం" లో ప్రేమ్ సైనికులతో పాటుగా పోరాడిన ప్రతి సన్నివేశం పిల్లల్ని ఉత్తేజితుల్ని చేస్తుంది. ఉదాహరణకు ఒక సన్నివేశం పరిశీలిద్దాం. ప్రేమ్ చీనా సిపాయిల చేతిబాంబుల్ని తను ఉన్న చోటికి చేర్చుకుంటాడు. ప్రేమ్ విసిరిన చేతి బాంబులకు గురై యెక్కడివారక్కడే నేలపైన పడి

విలవిలలాడిపోతున్నారు.

> "ఆ పాటికి మర తుపాకులు కొన్ని అతనిపైకి
> గురిపెట్టబడ్డాయి. ఢాం ఢాంమ్మని గుండ్లు
> జడివానలా ఆ బాలవీరునిపైన కురవసాగాయి.
> పరుగెత్తడానికి ప్రయత్నించాడుకాడు ప్రేమ్.
> అతడు అడుగైనా కదల్చలేదు. అచంచల హిమవత్పర్వత
> శిఖరంలా నిశ్చలంగా నిలిచాడు. సింగపు పిల్ల గుంట
> నక్కల వైపు చూసినట్టుగా శత్రువులవైపు తృణీకారంగా
> చూసాడు. అతడి శరీరం తూటాలు దూసుకునివెళ్ళిన
> గాయాలతో పూచిన కడిమి చెట్టులా మారింది కాని
> అతడి మనసుకు మాత్రం గాయాలు లేవు. శత్రుబలాన్ని
> విధ్వంసం చేయడంలో తాను చేయగలిగినదంతా చేసిన ఆనందం
> తో అతడి ముఖమండలాన దరహాస కాంతులే తాండవమాడు
> తున్నాయి. తూటాలు తొలిచి వేస్తున్నా, రక్తం చిమ్మిన గ్రోవిలా
> చిమ్ముతున్నా అతడి ముఖంలో బాధ, వేదన కనిపించాయిగావు
> పెదవులపైన చెక్కుచెదరని మందహాసం తాండవమాడుతుండగానే
> అతడి శరీరం నేలపైకి ఒరిగింది."
>
> (ఆకాశదీపం పుట 48, 49)

ఈ సన్నివేశం బాలవీరుడైన ప్రేమ్ ధైర్య సాహసాలను నిరూపించడమేగాకుండా ఈ సన్నివేశం పిల్లల్లో కూడా దేశభక్తిని పెంపొందింపచేస్తుంది. ఈ సన్నివేశం కొండ లోయల్లో చిత్రీకరింపబడింది. కొండల్లో, అడవుల్లో ఈ సన్నివేశం చిత్రీకరించడం చాలా సహజంగా ఉంది. ఈ నవలలో సన్నివేశాలన్నీ దేశభక్తిని ప్రబోధించేవి.

రావి ఎస్ అవధాని గారి "మహావీరుడు కర్ణుడు" లో సన్నివేశాలు అంతః పురాల్లో, రాజమందిరాల్లో, యుద్ధభూముల్లో చిత్రీకరింపబడినాయి. యుద్ధ భూమిలో దైవోపహతుడైన కర్ణుని రథం యుద్ధభూమిలో భూమిలో దిగిపోయినపుడు, కర్ణుడు లేపడానికి ప్రయత్నించి విఫలుడై —

"అర్జునా! ఒక్క రెండు ఘడియలకాలం
యుద్ధం ఆపు నా రధచక్రం భూమిలో
కృంగిపోయింది. లేవనెత్తుతాను, నీకు
యుద్ధ ధర్మాలన్నీ తెలుసు. జుట్టు ముడి
వీడినవాడు విముఖుడు, బ్రాహ్మణుడు,
కవచం లేనివాడు, ఆయుధం లేనివాడు,
రధం లేనివాడు, శరణన్నవాడు వీరిపై
శూరులు ఆయుధం ప్రయోగించరు.
ఈ యుద్ధ ధర్మం నీకు తెలియందికాదు.
నేనిప్పుడు రధంపై లేను, భూమిమీద
వున్న నన్ను నీవు కొట్టడం ధర్మం కాదు.
నా రధ చక్రం పెకలించేవరకూ రెండు
ఘడియలు యుద్ధాన్ని ఆపు" అన్నాడు కర్ణుడు విచారంతో.
మహా వీరుడు కర్ణుడు. (పుట 52)

ఈ సన్నివేశం పాఠకుల హృదయాల్ని కదిలించేదిగా రచయిత చిత్రించినాడు. ఈ నవలలో ప్రతి సన్నివేశాన్ని రచయిత చక్కగా తీర్చిదిద్దినాడు.

పాలంకి వెంకట రామచంద్రమూర్తి గారి "బంగారు తల్లి" లో కోట, అడవి, గుహ, అంతఃపురాలు, ఉద్యానవనాలతో సన్నివేశాలు చిత్రీకరింపబడినాయి ఈ నవలలో కథానాయిక హెర్మియా అనే పేరుగల గ్రీకు బాలిక. ఈ బాలిక పుష్కలావతి కోటలో ఉండడం, దారి తప్పి అడవిలో విశ్వజిత్తుకుటుంబాన్ని కలుసుకోవడం, అలెగ్జాండరుతో హెర్మియా ధైర్యంగా మాట్లాడడం, మొదలైన సన్నివేశాలు సందర్భానుసారంగా. చక్కగా చిత్రి-పబడినాయి.

సి. కనకాంబరరాజుగారి "చింటూ తెచ్చిన తంటా" నవలలో గోపి దొంగల స్థావరంలో గడిపిన సంఘటనలు, ఆ చిన్నపిల్లవాడు దొంగలతో ప్రవర్తించిన తీరు, గోపి, చింటూని రక్షించిన విధము మొదలైన సన్నివేశాల్ని రచయిత చక్కగా చిత్రీకరించినాడు. ఈ సన్నివేశాలన్నీ పిల్లల్లో ఆశ్చర్యంతోపాటు ధైర్యాన్ని, సమయస్ఫూర్తి ని కూడా కలిగిస్తాయి.

4 3 సంభాషణలు :-

నవలల్లో కథ నడిపే విధానాల్లో "సంభాషణ" చాలా ముఖ్యమైంది ఈ సంభాషణలు పాత్రల గుణశీలాలు, స్వభావాలు వ్యక్తం చేసేందుకు దోహదం చేస్తాయి. వ్యక్తుల పరస్పర భావవ్యక్తీకరణకు ప్రధాన సాధనం సంభాషణలు. సాధారణంగా నవలలోని పాత్రలు సమాజంలోని వ్యక్తులకు ప్రతిబింబాలుగా ఉంటాయి. ఈ పాత్రలలో యదార్థత, స్వరూప స్వభావాలు, వాక్ప్రవృత్తి బాగా ప్రతిబింబించినప్పుడే ఆ పాత్రలు పాఠకుల్ని ఆనంద పరచగలవు. అటువంటి పాత్రల సంభాషణలు కూడా సరసంగాను, సుందరంగాను, మనోరంజకంగాను ఉన్నప్పుడే ప్రజాదరణ పొందగలవు

పిల్లల వాస్తవిక జీవితంలోని సంభాషణలకు, నవలల్లోని సంభాషణలకు, చాలా వ్యత్యాసం ఉంటుంది. వాస్తవిక జీవితంలోని సంభాషణలలో అప్రయోజనమైన, అసందర్భమైన ఎన్నో మాటలు దొర్లిపోతాయి. నవల పిల్లలకు ఒక ప్రయోజనాన్ని ఉద్దేశించి వ్రాయబడింది కాబట్టి అందులోని సంభాషణలు కూడా కళాత్మకంగా, ప్రయోజనాత్మకంగా, సందర్భోచితంగా, ఆహ్లాదకరంగా రూపొందించబడతాయి.

వాస్తవిక సంభాషణల, నవలలోని సంభాషణలభేదాన్ని గూర్చి శ్రీ విశ్వామిత్ర గారు వివరిస్తూ :—

> "వాస్తవిక జీవితమున సంవాదములువాల వరకర్థరహితములయి
> యసంబద్ధములయి, స్వచ్ఛందములయి యుండును.
> కాని నవల యందలి సంవాదములు సుసంబద్ధములయి, తర్క-
> బద్ధములయి బహూనియోజితములయి యుండును"[1] అని అంటారు.

నవలల్లో సంభాషణ కల్పన చాలా ముఖ్యమైంది. రచయిత ఉద్దేశ్యం సంభాషణల ద్వారా వ్యక్తమవుతుంది. అచేతనమైన పాత్రలకు చైతన్యాన్ని కల్గించేవి సంభాషణలు. కాబట్టి ఇది ఆకర్షణీయంగా సందర్భోచితంగా, సన్నివేశాలకు అనుకూలంగా జరగాలి. అసహజ సంభాషణలు, అసందర్భపు సంభాషణలు నవల ప్రయోజనాన్ని

---

1. ఆంధ్ర నవలా పరిణామము, హైదరాబాదు, 1971

దెబ్బ తీస్తాయి. పాత్రల నోటివెంట వెలువడే ప్రతిమాట అర్థవంతంగా సహజంగా ఉన్నపుడే నవల ప్రజాదరణ పొందగలుగుతుంది,

శ్రీ బొడ్డపాటి వేంకట కుటుంబరావు గారు నవలలో సంభాషణల ప్రధాన ఉద్దేశాన్ని గురించి చెబుతూ —

> "స్వాభావికముగను, ఉపయుక్తముగను,
> విషయానుకూలముగను, ఇతివృత్తముతో
> సరిగ దులదూచినట్లుగను, సరసముగను,
> సుబోధకముగను సంభాషణలుండుట యావశ్యకము"[1]

అని వివరించినారు.

రచయితలు సమకాలీన సమాజంలోని కథావస్తువు ననుసరించి సంభాషణలు గంభీరంగా, హాస్యయుక్తంగా, సరసంగా ఉండేటట్లు కల్పించాలి. సాంఘిక నవలల్లో సంభాషణలు చక్కని వ్యావహారికంలో చారిత్రక, పౌరాణిక నవలల్లోని సంభాషణలు సరళగ్రాంధికం శిష్టవ్యావహారికంలో ఉంటాయి.

పిల్లల సాంఘిక నవలల్లో పాత్రలుగా పిల్లలే ఎక్కువగా ఉంటారు. వీరి చుట్టూ ఉన్న వారితో పిల్లల సంభాషణ సరళి సాగుతుంది. పిల్లలు తనతోటి పిల్లలతో ఉపాధ్యాయులతో, తలిదండ్రులతో సంభాషించడం కనిపిస్తుంది. ఒక్కొక్కసారి పిల్లలు వారి వయసుకు మించి సంభాషించడం కనిపిస్తుంది. "బుడుగు" లో బుడుగు సంభాషణా రీతి, "టింకూ సాహసాలు" లో "టింకూ—బుడిగి" లో టింకూ సంభాషణ వయసుకు మించినవేమో అనిపిస్తుంది. వయసుకు మించిన మాటలు మాట్లాడడంతో పిల్లలకు ఆనందమనిపించినా కొందరికి అతిగా అనిపించవచ్చు.

సాధారణంగా సంభాషణలు ఇద్దరి మధ్యకాని, ముగ్గురి మధ్యకాని, అంతకంటె ఎక్కువ మంది మధ్యకాని జరుగవచ్చు.

ఒక నవలలోని గొప్పదనం ఆ నవల లోని సంభాషణల ద్వారా తెలుస్తుంది.

---

1. ఆంధ్ర నవలా పరిణామము హైదరాబాదు. 1971

సంభాషణలలో వాడే భాష సరళంగాను, సమాజానికి సన్నిహితంగాను ఉన్నపుడే ఆ సంభాషణలు రక్తి కడతాయి.

పిల్లల నవలల్లో ఒక విషయాన్ని గూర్చి సంపూర్ణంగా వ్యక్తం చేసే సంభాషణలు ఉన్నాయి.

సూర్యం పుస్తకాలకు డబ్బు కావాలన్నపుడు సూర్యం, సూర్యం తల్లి సంభాషణలు ద్వారా విషయం అర్థమవడమే కాకుండా, ఆ డబ్బు సంపాదించే విధానం వ్యక్తమవుతుంది.

ఎదుటి వాళ్ళకు ఏదైనా బోధించాలన్నా, వాళ్ళలో ఉన్నతాదర్శాలు పెంపొందించాలనుకున్నా, రచయిత ఉపన్యాస ధోరణిలో సంభాషణలు సాగిస్తాడు.

"ఆశాకిరణం" లో పిల్లల్లో గాంధీజి సూక్తులు ప్రవేశ పెట్టాలని, వాళ్ళలో ఐకమత్యం కలిగించాలని చేసిన ప్రయత్నంలో మురళీధరం మేష్టారి సంభాషణలు ఉపన్యాస ధోరణిలో సాగినాయి,

సాధారణంగా ఈ నవలల్లో పిల్లలే ఎక్కువ మాట్లాడుకునే మాటలు సంభాషణలుగ ఉంటాయి. ఈ సంభాషణల్లో ఒకరికొకరు స్నేహపూర్వకంగా, మంచి ఉద్దేశ్యంతో మాట్లాడుకునే సంభాషణలు, పక్క పిల్లల్ని విమర్శిస్తూ వ్యంగ్యంగా, పొగరుగా మాట్లాడే సంభాషణలు, అహంకారంతో కొందరు పిల్లలు ఉపాధ్యాయుల్ని ఎగతాళి చేస్తూ మాట్లాడే సంభాషణలు, ఉపాధ్యాయుల మంచితనాన్ని అర్థం చేసుకుని వారి మంచితనాన్ని తనతోగాని, పక్కవానితోగాని మాటల ధోరణిలో చెప్పే సంభాషణలు కనిపిస్తాయి.

ఈ నవలల్లో దీర్ఘ సంభాషణలకు, అంతగా అవకాశం లేదు. చిన్న చిన్న సంభాషణలు, ఉపన్యాస ధోరణిలో సాగే సంభాషణలు, దూషణలతో నిండిన సంభాషణలు ఆప్యాయత స్నేహంతో కూడిన సంభాషణలు, ఈర్ష్య, అసూయలతో కూడిన సంభాషణలు కనిపిస్తాయి. ఈ సంభాషణల ద్వారా పిల్లల మనస్తత్వాన్ని, వాళ్ళ స్వభావాల్ని సులభంగా అర్థం చేసుకోవచ్చు.

చారిత్రక, పౌరాణిక నవలల్లో అక్కడక్కడ దీర్ఘ సంభాషణలు కనిపిస్తాయి

వర్ణనలతో కూడిన సంభాషణలు, మత ధర్మాలను, సంస్కృతీ సంప్రదాయాలను తెలియచెప్పేటప్పుడు ఉపన్యాస దోరణిలో సాగేసంభాషణలు, ప్రేయసీప్రియుల సంభాషణలు శత్రువులు పరస్పరం ముఖాముఖిగ ఆవేశంగా మాట్లాడుకునే సంభాషణలు కనిపిస్తాయి. ఈ సంభాషణలు పాత్రోచితంగా సందర్భోచితంగా ఉండి పాత్రల స్వభావాల్ని వారి గుణగణాలను తెలియజేస్తున్నాయి.

ఈ విధంగా పిల్లల నవలల్లో అన్ని రకాలైన సంభాషణ దోరణులు చోటు చేసుకున్నాయి.

4.4 శిల్పం :-

రచయిత తాను చెప్పదలచుకున్న విషయాన్ని ఒక ప్రత్యేకమైన పద్ధతిలో చెప్పడాన్ని "శిల్పం" అనవచ్చు ఉత్తమ నవలా రచనకు శిల్పం చాలా అవసరం. రచయిత చెప్ప దలచుకున్న విషయాన్ని ఆకర్షణీయంగా, అందంగా, శక్తివంతంగా స్పష్టంగా ఉత్కంఠత రేకెత్తించే విధంగా చెప్పినపుడే అతని ప్రతిభ వ్యక్తమవుతుంది.

"శిల్పం అనేది మన అందరిలోనూ సహజంగా ఉంది. ఏడ్చేపిల్లవాణ్ణి నవ్వించవచ్చు మభ్యపెట్టి. అయితే సాహిత్య కళకి చెందిన శిల్పం యొక్క ఆశయం ప్రజలను మభ్యపెటటంకాదు. వారి దృష్టిని జీవిత కష్టసుఖాల దగ్గరి నుంచి మరల్చి వాటి వెనక ఉండే కారణాలమీదికి మరల్చడం, ఆకారణాలను ఎట్లా సంస్కరించుకునేదీ ప్రజలే నిర్ణయించుకుంటారు. శిల్పం అసమర్ధంగా ఉంటే బుద్ధి విషయం మీద నుంచి విముఖం అవుతుంది అందుచేత శిల్పం యొక్క ఆశయం విముఖుల్ని కూడా విషయోన్ముఖుల్ని చెయ్యటం[1] అని కొడవటిగంటి కుటుంబరావు గారు నవలకు శిల్పం ఎంత ముఖ్యమో వివరించినారు.

ఏ రచనలోనైనా ఇతివృత్తం ఎంత ముఖ్యమో ఆ ఇతివృత్తానికి అందమైన ఆకర్షణీయమైన రూపాన్నిచ్చే శిల్పం కూడా అంతే ముఖ్యం.

---

1. కొడవటిగంటి కుటుంబరావు, సాహిత్య ప్రయోజనం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1969.

శిల్పం అనే మాటను మనం ఇంగ్లీషులోని "టెక్నిక్" అనే పదానికి పర్యాయ పదంగా వాడుతున్నాం సాహిత్య ప్రపంచంలో "శిల్పం" ముఖ్యమైనది. నవలకు మూలమైంది ఇతివృత్తమైనా దాన్ని కథగా మార్చే పనితనమే నిర్మాణ శిల్పం నవలకు శిల్పం ప్రాణం. పిల్లల మనస్సులోని భావాల్ని అర్థం చేసుకుని, వాటిని నవలలో చొప్పించి పిల్లల నిజజీవితంలోని సంఘటనలను ఇతివృత్తాలుగా తీసికొని పిల్లల కర్థమయ్యే రీతిలో నవలలు వ్రాయాలి. ప్రతి పిల్లవాడికి ఒక సమస్య ఉంటుంది రచయిత పిల్లల్లోని ఈ అనంతమైన సమస్యల్ని ఓపిగ్గా పరిశీలించి, పిల్లల్లో పిల్లవాడిగా కలిసిపోయి వాళ్ళ భావాల్ని, ఊహల్ని అర్థం చేసుకోవాలి. పిల్లల జీవితం నుండి వస్తువును తీసుకుని దానిని నవలగా మలచినపుడు అది చక్కని పిల్లల నవలగా రూపొందుతుంది. సరళమైన భాషలో, చక్కని భావాలతో, మంచి రచనా నైపుణ్యంతో పిల్లలు తెలుసుకోదగిన కొత్తకొత్త విషయాలతో పిల్లలకుపయోగపడే నవల వ్రాయాలి.

4.4.1 శైలి :-

రచయిత శైలీ వ్యక్తిత్వమే శైలి. రచనా శిల్పంలో శైలి చాలా ముఖ్యమైంది. ఇది రచనకు ఆయువుపట్టు శైలి కేవలం భాష మాత్రమేకాదు. వస్తువులను చూపించే దృక్కోణం పాత్రోచితమైన సంభాషణను నడిపించడంలో, పాత్రోచితమైన వర్ణనలు ప్రదర్శించడంలో రచయిత వ్యక్తిత్వం శైలి రూపంలో వ్యక్తమవుతుంది. శైలి అనేది రచయిత దృక్పథాన్ని అనుసరించి ఉంటుంది. రచయిత ప్రదర్శించిన శైలి వల్లనే నవల పాఠకుల హృదయాల్ని ఆకట్టుకుంటుంది. నవల జయాపజయాలు నవలలోని శైలిమీద ఆధారపడి ఉంటాయి.

బాలల హృదయాలను, వారి ఊహలను తెలుసుకుని, దానికనుగుణమైన శైలి వాడడం చాలా అవసరం. సరళమైన శైలిని పిల్లలు బాగా ఆకర్షిస్తారు. మృదు మధురమైన శైలిలో ఉన్న పిల్లల నవలలు చిరకాలం పిల్లల మనసులో నిలిచి పోతాయి.

బాలల నవలా సాహిత్యంలో మధురమైన, సులభశైలిలో రచనలు చేసి కె. సభాగారు పిల్లల మనస్సులో చిరస్థాయిగా నిలిచి పోయినారు. వారి నవలలు "సూర్యం" "చంద్రం", "కవి–గాయకుడు", పసిహృదయాలు" చక్కని శైలికి

ఉదాహరణలు. వీరి నవలలు చదువుతుంటే ఆ కథలోని పాత్రలు మనముందు నిలి కథ మనతో చెప్పినట్లే ఉంటుంది. సభాగారి సూర్యం చంద్రం చదువుతుంటే ఏ నిరుపేదలైన విద్యార్థులు తమ బాధలు వారి ఆలోచనలు మనతో చెప్పుకున్నట్లే భ్రమ కలుగుతుంది, దీన్ని వెన్నంటే సామాజిక స్పృహ ఉంటుంది. సభాగారిది చెప్పదలచు కున్న విషయాన్ని పాఠకునికి సులభంగా చెప్పే శైలి, ఎంతో లోతయిన విషయాల కూడా పిల్లల కర్థమయ్యేరీతిలో అతి సరళంగా చెప్పడం సభాగారి ప్రత్యేకత.

బాలసాహిత్యానికి కొత్త ఒరవడిపెట్టి, పిల్లల్ని అలరించి ఆనందింప జేయ డానికి సాహిత్యాన్ని సాధనంగా చేసినాడు. తెలుగు పూలు విరగబూసిన ఆయన కలం నుండి వెలువడిన మంచి ముత్యాలు "వీధి గాయకుడు" "పేను పెసర చేను". ఈ రెండు సులభశైలిలో ప్రబోధాత్మకంగా సాగిన నవలలు.

తెలుగు హాస్య నవలా రచయితల్లో తనదంటూ ఒక శైలిని ఏర్పరచుకున్న వారిలో ముళ్ళపూడి వెంకటరమణగారు ఒకరు. "బుడుగు" నవల చిన్నపిల్లలనుద్దేశించి రాసింది. సామాన్యమైన సంఘటనల్ని నవ్వు పుట్టించే ధోరణిలో పాఠకులకు అందిం చగల శైలి ముళ్ళపూడికి ఉందనడంలో అతిశయోక్తి కాదు

తన ఊహాబలంతో, మధురమైన రచనా శిల్పంతో పిల్లలకొరకు నవలలు వ్రాసిన మహా శిల్పి గీతా సుబ్బారావుగారు. ఇతను "పారిపోయిన బఠాణి "చిన్నారి విజయం" "పూల మనసులు" సుల-శైలిలో వ్రాసినారు. కష్టమైన పదజాలం గాని, పెద్ద వాక్యాలు కాని సుబ్బారావుగారి శైలిలో కనిపించవు

పిల్లలకోసం ప్రత్యేకమైన మృదుమధురమైన సులభశైలిలో పిల్లల హృద యాల్ని ఆకట్టుకునే విధంగా కొంతమంది పిల్లలకోసం నవలలు వ్రాసినారు.

కొమ్మూరి వేణుగోపాలరావుగారు, కాణిపాక లింగన్నగారు, ఆలూరి భుజంగ రావుగారు, కోడూరి లీలావతిదేవి గా. అర ; దగారు, సి కనకాంబరరాజు గారు, చివుకుల పురుషోత్తంగారు, తంగెళ్ళ పాండురంగశర్మగారు, అవసరాల రామకృష్ణ రావుగారు, శ్రీవాత్సవగారు, ఎల్లోరాగారు, సింగంపల్లి అప్పారావుగారు పాలంకి వెంకటరామచంద్రమూర్తి గారు, పోతూరి ప్రసన్నంగారు, శ్రీమతి దనంగారు పిల్లల

కోసం నవలలు వ్రాసినారు.

సాధారణంగా పిల్లల నవలలన్ని సులభశైలిలో ఉంటాయి. ఏవో ఒకటి రెండు నవలల్లో శైలి కొంత కఠినంగా ఉన్నప్పటికి సరళ సుందరమైన శైలిలో ఉన్నాయనడం లో సందేహం లేదు.

4 4.2 భాష :

మానవుడు యుగయుగాలుగా ప్రకృతిలో పరిసరాలతో సంఘర్షణ జరిపి సాధించుకున్న మహత్తర సంపద భాష. మనం పరస్పరం భావవ్యక్తీకరణకు ఈ భాషను ఉపయోగిస్తున్నాం. మామూలుగా రచయితలు వారివారి అభిరుచులను అను సరించి భాషను ఎన్నోరకాలుగా ప్రయోగిస్తుంటారు. సులభమైన భాషతో కొందరు రచనలు చేస్తే, మరికొందరు కఠినమైన భాషలో రచనలు చెయ్యడం పరిపాటి నవల ప్రయోజనకారిగా భాసించాలంటే భాషకు కూడా ప్రాధాన్యం ఇవ్వాలి రచయితలు నవల ల్లోని భాషా విషయంలో ఎగుడుదిగుడు లోపాలులేకుండా చూసుకోవడం చాలా అవసరం. నవల్లో ఒక వాహికగా ప్రముఖ స్థానాన్ని వహించే భాష జనవ్యవహారానికి దగ్గరగా చదవ నేర్చిన వారందరికి అలవాటైన పద్ధతిలో సాగాలి సరళంగా, సులభ గ్రాహ్యంగా భాషను తీర్చిదిద్దాలి. భాషా సరళి బాగుండక పోతే భాష ప్రకటన కుంటు పడడమేగాక, నవలా ప్రయోజనాన్ని దెబ్బ తీస్తుంది.

సమాజంలోని వ్యక్తుల జీవితాలకు అనుకరణ నవల. కాబట్టి నవలలోని భాష సహజంగా ఉండాలి. అందరికీ అందుబాటులో ఉండాలంటే భాష వ్యావహారికంలో ఉండాలి. సమాస భూయిష్టమైన పెద్ద పెద్ద వాక్యాల, ఛందో, వ్యాకరణ ప్రయోగాలు వాడకుండా జాగ్రత్తపడాలి. పిల్లలు చదివి అర్థం చేసుకోగలిగే భాషను తప్పని సరిగా వాడాలి పిల్లలకు భాష భావం సులభంగా అర్థం కావాలి. పిల్లలకు భాష సహజంగా ఉండి, ఆ భాషలో మెత్తదనం, కొత్తదనం ఉండాలి. పాత్రోచితమైన భాష వాడాలి.

మామూలుగా సాంఘిక నవలల్లోని భాష వ్యావహారికంలో సహజంగా ఉంది. పౌరాణిక, చారిత్రక నవలల్లోని పాత్రలు, సన్నివేశాలు మన నిత్య జీవన విధానానికి

